శ్రీరస్తు.

# కావ్యాలంకారచూడామణి

విన్నకోట పెద్దయమహాకవి ప్రణీతము.

చతుర్థముద్రణము.

వేదము - వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్,
4, మల్లికేశ్వరగుడి సందు, లింగిసెట్టివీథి,
మన్నెడి, జి. టి. మదరాసు.
1936
రు. ౧.]

# కావ్యాలంకార చూడామణి




## ప్రథమోల్లాసము.

శ్రీవాగాస్పదయోః పరస్పరయుజోః శ్రుత్యుత్సవశ్లాఘయోః
రాగాలాపనిరూఢయో ర్వ్యలిగణవ్యాపారపారీణయోః
సారస్యా జ్గిరిజేశయో రివ సదా సంగీతసాహిత్యయో
ర్విద్వద్విశ్రమహేతుకం విహరతాం చాళుక్యవిశ్వప్రభౌ. ౧

ఉ. పంకజముల్ దొలంగి తదుపాంతచరన్మధుపప్రసక్తికిన్
గొంకి ఝషాదిరూపములకున్ జనునాథునివింతయక్కుపైఁ
గింకిరి గాఁగ లచ్చి తిలకించి యజస్రము నుండుఁగాత ని
శ్శంకఁ జళుక్యవిశ్వమనుజప్రభుపుణ్యకటాక్షదృష్టులన్. ౨

చ. పరచతురాననప్రతిభ వాసికి నెక్కఁ బదక్రమంబులన్
దిరుగుచు నంగవిభ్రమము ధీముకురంబులఁ గానిపించుచున్
సరసవచస్సవిత్రి యగుచామ యలంకృతులన్ దనర్చి సు
స్థిరతఁ జళుక్యవిశ్వనృపుచిత్తమునన్ బొలుపారు చుండెడున్. ౩

సీ. శ్రీకంఠచూడాగ్రశృంగారకరణ మే రాజున కన్వయారంభగురుఁడు
చాళుక్యవంశభూషణము శ్రీవిష్ణువర్ధనుఁ డేమహీశుతాతలకుఁ దాత
భృతకుమారారామభీముండు చాళుక్య భీముఁ డేనృపకులాబ్ధికి విధుండు
రాజమహేంద్రపురస్థాత రాజన రేంద్రుఁ డెక్కువతాత యేవిభునకు

తే. సంధ్రదళదానవోపేంద్రుఁ డగునుపేంద్ర
ధరణివల్లభుఁ డేరాజుతండ్రితండ్రి
ఘనుఁ డుపేంద్రాఖ్యుఁ డెవ్వనికన్నతండ్రి
యతఁడు విశ్వేశ్వరుఁడు లక్కమాంబసుతుఁడు. ౪

శా. సర్వశ్రీఁ దనపేరివాఁ డగుటచే సంతుష్టచేతస్కుఁ డై
సర్వజ్ఞత్వము రాజశేఖరతయున్ శంభుత్వము న్విశ్వనా
థోర్వీభర్తకు విశ్వనాథుఁడు శివుం డోసంగెఁ గా కున్న నీ
దుర్వార ప్రతిభాతిభాగ్యశుభద స్తుత్యత్వముల్ గలునే. ౫

ఉ. అస్రుతవైరివర్గుఁడు సమాశ్రితభర్గుఁడు ది 
విశ్రుతకీర్తి పుణ్యగుణవేషవిభూషితమూర్తి మానసో

న్మిశ్రితరాజనీతి యధమీకృతభూవరభూతి సర్వలో
కాశ్రయచక్రవర్తి సమదారిచమూసమవర్తి శూరతన్. ౬

సీ. లక్ష్మీధరిత్రుపలాలనప్రౌఢిమ రాజనారాయణప్రభ వహించి
హవ్యకవ్యార్థ నిత్యప్రదానవ్యాప్తి సర్వలోకాశ్రయఖ్యాతఁ జెంది
త్రస్తశస్త్రాఖిలోద్ధరణక్రియాసిద్ధి ధరణీవరాహశబ్దమునఁ జేర్చి
గర్వితారాతివిఖండనోదారతఁ గరవాలభైరవఖ్యాతి వడసి

తే. కదనభీతులఁ బులు మేపి కాచి రాయ
గండగోపాలబిరుదసంగతిఁ దనర్చి
యవనిఁ బొగ డొందు బహువిజయప్రవర్తి
చారుచాళుక్య విశ్వేశచక్రవర్తి. ౭

ఉ. ఎందుఁ జళుక్యవిశ్వధరణీశ్వరురాయకతారిసాళువ
స్పందన మొప్పఁ జెప్ప బహుపక్షబలంబునఁ గ్రందుఁ జెంది మి
న్నందినరాజహంసనివహంబులఁ బట్టి వధించి సన్నుతిం
బొందినధార్తరాష్ట్రకులపూగములన్ గరుణించు నాజులన్. ౮

వ. మఱియును.

సీ. వేదశాస్త్రరహస్య విధు లెల్లఁ బరికించి సవిఁ జతుర్వర్గప్రశస్తి నొంది
రాజవిద్యాతంత్రరక్తిసంభావించి వర్ణక్రమంబుల వల నెఱింగి
జ్యోతిషాయుర్వేదసంగతి నెఱిఁ డొంది సంగీతసాహిత్యసరణి నేర్చి
తురగేభరోహణాదుల విశ్రుతికి నెక్కి యాయుధవిద్యల నతిశయిల్లి

తే. యచట నచ్చట నున్న కావ్యాగమములఁ
జెలఁగి సత్కవిసౌకర్యసిద్ధికొఱకు
నొక్కచోటనె యొడఁగూర్ప నుత్సహించి
సత్కళావర్తి విశ్వేశచక్రవర్తి. ౯

మ. ననుఁ గావ్యక్రమవేది నర్చితబుధానందాదరాలోకితున్
మనితశ్రీగిరిజేశపాదయుగళున్ మాన్యున్ గళాకౌశలున్
వినుతున్ గౌశికగోత్రుఁ బెద్దన సుధీవిఖ్యాతు రావించి స
ద్వినయం బొప్పఁగ నాదరించి తగ నావిశ్వేశ్వరుం డి ట్లనున్. ౧౦

ఉ. భావరసప్రపంచమునఁ బర్వినలంకృతిలక్షణంబు, ఛం
దోవిచితిప్రచారము, గుణూహలదస్ఫురదంధ్రదేశభా
షావివిధప్రసంగములచందము నందముగా నొనర్చి వి
ద్యావిధి గానిపించుటగదా చతురత్వ మనంగ మేదినిన్. ౧౧

క. అను నవ్విశ్వేశ్వరవిభు, ననుమతి యనునూత్నపోత మాధారము గా
ఘనరసరత్నాకరమునఁ, గనుఁగొని యొడగూర్చి యిత్తుఁ గబ్బపుమణులన్. ౧౨

## షష్ఠ్యంతములు

క. లక్ష్మీపుత్త్రునకు సుపేం,ద్రక్షావరనందనునకు ధర్మజ్ఞునకున్;
లక్ష్మవిభేదనలాఘవ,లక్ష్మణునకు సర్వశాస్త్రలంపటమతికిన్. ౧౩

క. సింధురసత్త్వునకు మరు,త్సింధు రస క్రీడ దహిత తృప్తికరునకున్
బంధురశుభానుభవునకు, బంధురమావృద్ధికరణ బహువిభవునకున్. ౧౪

క. చాళుక్యవిశ్వధరణీ, పాలునకు నమన్న్రపాలపరి పాలునకున్
శ్రీలునకు సమరవిజయ,శ్రీలలనాశ్లేషసౌఖ్యశీలున కెపుడున్. ౧౫

వ. అభ్యుదయపరంపరల కకంపితస్థితి యావహిల్లునట్లుగా మద్వచోరచనీయం బగు కావ్యాలంకారచూడామణి యను నలంకార లక్షణంబునకుఁ బ్రథమావతరణం బెట్టిదనిన. ౧౬

చ. సరళవిరాజదుచ్చరణశస్తము వర్ణము, వర్ణపంక్తివి
స్తరము పదంబు, తత్పదవితానము వాక్యము, వాక్యభేదసుం
దరతర మర్థ, మర్థఘనతత్త్వవిబుద్ధము భావ, మట్టిభా
వరుచిరసుప్రసన్నవిభవంబు రసం బొడఁ గూర్ప నేర్చినన్. ౧౭

## భావము

క. బహిరర్థాలంబనమై, విహరించు మనోవికార విలసితము సుమీ
విహిత మగు భావ మన; నది, మహి విజ్ఞానంబు నా సుమతులం బరఁగున్. ౧౮

క, ఘనవిజ్ఞానం బాత్మకు, మనసువనే కలుగు నట్టిమనసున కబ్బున్
కనదింద్రియముల చేతన్, వినఁగా వీనులకు నొదవు విషయప్రాప్తిన్. ౧౯

## భావభేదములు

తే. అట్టి విజ్ఞానకలిత మై యమరుభావ
మాత్మఁ బ్రవ్యక్త మై విభావానుభావ
సాత్త్విక వ్యభిచారి సంజ్ఞలఁ దనర్చు
నాల్గు తెఱఁగుల రసనిదానంబు గాఁగ. ౨౦

క. నవరసవిస్ఫుటకరణ, ప్రవణము లగు సుచితరుచివిభావము లెల్లన్
వివిధ స్త్రీపురుషులయం, దవికళముగఁ బొడమఁ దెలియ నగును గవీంద్రుల్. ౨౧

## విభావములు

ఆ. అవ్విభావ మొప్పు నాలంబనంబు ను
ద్దీపనంబు నాఁగ ద్వివిధ మగుచు
నిఖిల రస విబోధ నిర్మాణ కరణంబు
లిత్తెఱంగు లెల్ల నెఱుఁగ వలయు. ౨౨

## ఆలంబనవిభావము

క. ఆలంబనంబు నాఁగ ర, సాలంబన మైనరూపయౌవనకాంతి
శ్రీలావణ్యాదిక; మది, మూలము తద్వ్యక్తికిం బ్రమోదప్రద మై. ౨౩

### ఉదాహరణము

చ. నెలవుల నిండుచున్నఁగవ నిక్కు-ను, గామునితూపు క్రైవడిం
వెలిఁగెడు రూపవిభ్రమము, విద్యుదుదారతఁ దేజరిల్లుఁ జా
పులజిగి, సొంపు వెట్టనివిభూషణ మై మెయి నంతకంతకుం
బలియుఁ, జళుక్యవిశ్వజనపాలునిమన్ననఁ గన్నయింతికిం. ౨౪

## ఉద్దీపనవిభావము

క. చలియింపక రస మింపుల, నొలయుచు నెవ్వానిచేత నుద్దీపించుం
గలఁగొన బుధులకు నవి యి, మ్ములఁ నుద్దీపనవిభావములు నాఁ బరఁగుం. ౨౫

క. ఆలంబనోక్తగుణములు, నాలంబనచేష్టితములు హారాంలకా
రాళియు నుత్సవలీలలు, నోలిం జతురాహ్వయంబు లుద్దీపనముల్. ౨౬

సీ. రూప లావణ్య తారుణ్యాది శారీర గుణము లాలంబనగుణము లరయ,
నంగ నోచిత భావ హావ హేలాది వింశతియుఁ జేష్టితము లై సంచరించు,
హార కేయూర మంజీర కంకణ కంఠికాదు లలంకరణాఖ్యఁ జెందు,
నుపవన జల చంద్రి కోత్స వా ర్తవ లీల లాత్మ విహారంబు లనఁగఁ బరఁగు;
తే. నిట్టి యుద్దీపన విభావ హిత వినోద
వైభవములఁ బొందుఁ జాళుక్యవిశ్వవిభుఁడు
అలరువిల్తునిభంగి జయంతులీల
భద్రచందమున నలకూబరునిపగిది. ౨౭

## అనుభావములు

శా. భ్రూ తా రానన రాగ దృ గ్విలసనంబుల్ పాణిపాదాంగవా
క్చాతుర్యంబును నోష్ఠకంపనము నాఁగం బేర్చు చేష్టానము
ద్భూతం బై యనుభూత మై రసము సొంపుం జెందుటం జేసి వి
ఖ్యాతం బై యనుభావ మొప్పు లలితవ్యక్తాకృతిం దోఁచుచున్. ౨౮

చ. వదనవికాసముం, బొలయు వాలికచూపులు, లేఁతనిగ్గుతోఁ
బొదలెడితారకల్, బొమల పొ ల్పగుపోకలు, మోవికెంపుపైఁ
గదిరెడిచిన్ని నవ్వు, చెలికత్తెల కందము సేయుమాటలుం,
సుదతి చళుక్యవిశ్వనృపసుందరుఁ జెందుటఁ జెప్ప నొప్పగుం. ౨౯

## సాత్త్వికభావములు

తే. సత్త్వ మన మనోవృత్తి, తజ్జంబు లైన
భావములు సాత్త్వికము లష్టభావితములు

స్తంభ రోమాంచ బాష్ప వైస్వర్య కంప
విలయ వైవర్ణ్య ఘర్మ సంజ్ఞలఁ దనర్చు. ౩౦

## స్తంభము

క. మే నెఱుఁగ కున్న యునికిన, నానాభయహర్ష దర్శన శ్రవణములన్
ప్రాఁపుపడి యునికి చేష్టా, హీన స్తంభంబు నాఁగ నెఱుఁగఁగ వలయున్. ౩౧

క. చాళుక్యవిభుని శైల, తోత్కలధ్వజపటముఁ జూచి క్రొవ్వాఁడి, యని ను
త్తాల స్తంభస్థితికి, స్బాలుఁపడున్ బగఱ సాలభంజిక వోలెన్. ౩౨

## రోమాంచము

క. ఆనందాతిశయంబునఁ, గానఁ బడుట రోమహర్ష కల్పనము సుమీ
మానితరోమాంచం బనఁ, గా నిష్టస్పర్శన ప్రకాశనవిధులన్. ౩౩

క. మనమున విశ్వేశ్వరు నిడి, కొని గాఢాలింగనములఁ గొఱలెడిచోటన్
దనువునఁ బొడమెడిపులకలు, వనితకు రాగాంకురముల వడువున నొప్పున్. ౩౪

## అశ్రువు

క. అతిదుఃఖహర్షణాదులఁ, బ్రతిపాదిత మైన నేత్రపాథఃకణసం
హతి యశ్రు వండ్రు, నఖముఖ, కృతమార్జనవిధులు దానిక్రియ లరయంగన్. ౩౫

క. ఆలములో విశ్వేశన్నృ, పాలునికరవాలు మెఱయఁ బరనృపవనితా
లోలనయనాంబుదంబులు, వాలాయము గురియు నశ్రువర్షం బోలిన్. ౩౬

## వైస్వర్యము

క. భయరోషహర్షణాదుల, నియతం బగుగద్గదధ్వనిత్వం బది ని
శ్చయముగ వైస్వర్యం బగు, రయవాగుచ్చరణసరణిరభసం బగుటన్. ౩౭

క. రాగమున నలుకఁ దేర్పఁగ, నాగతుఁ డగువిశ్వవిభునియాలోకముచే
రాగాలాపక్రమము వి, రాగాలాపక్రమముగ రమణి కలంగెన్. ౩౮

## కంపము

క. ఆకస్మికభయ దయితా, లోకన హర్షాది రుజలు లో నగుదానన్
జేకూఱుఁ గంప మంగ, వ్యాకులచలనాది నెఱుఁగవచ్చుం దెలియన్. ౩౯

క. మృదులతరచంద్రహాసము, గదలించుచళుక్యవిభునిఁ గని భీరువులై
మదవిమతులు వదవద వణఁ, కుదు రాతఁ డుపేంద్రపుత్త్రకుఁడు గానఁ జుమీ. ౪౦

## ప్రళయము

క. ప్రళయము నా సుఖదుఃఖా, దుల నింద్రియమూర్ఛనంబు దొఱఁగుట; దానిన్
దెలియునది భూమిపతన, స్ఖలితాకారములచేతఁ గనుఁగొని చతురుల్. ౪౧

క. ఇమ్మహి నుపేంద్రపుత్త్రుఁడు, సమ్మోహనమూర్తి యగుట సత్యం, బతనిన్
నెమ్మిఁ గనుఁగొన్న యింతికి, నెమ్మది మూర్ఛిల్లి మేను నిలువక పడలున్. ౪౨

## వైవర్ణ్యము

క. మద రోష విషా దాదులఁ, గది రెడుసహజాంగరుచివికల్పమునకుఁ బే
రొదవును వైవర్ణ్యం బన, నది వర్ణవ్యత్యయమున నగుఁ దెలియంగన్. ౪౩

క. సారమతి విశ్వనృపతిని, గోరిన సమకూఱు ఘన్నె కోర్కులు ధరణిన్?
గౌరయశస్స్మరణంబున, సారూప్యపదంబు గలిగెఁ జామకు నొడలన్. ౪౪

## స్వేదము

క. దయితాలింగనసురత, ప్రయాసకలనములఁ జెమరు వాటిల్లు మిథః
ప్రియదంపతులకు, నది గా, త్రయుతార్ద్రత్వమునఁ దెలియఁ దగుఁ జతురులకున్.

క. ఇల విశ్వనృపతిచంద్రుని, లలితకరస్పర్శనముల లలన గరంగెన్,
దలపోయ దీనియొడ లి, మ్ముల నలవిధి చంద్రకాంతమునఁ జేసెఁ జుమీ. ౪౬

## సంచారిభావములు

తే. స్థాయిభావంబునందు నిత్యత్వ ముడిగి
వ్యభిచరించుచు నబ్ధిభంగాళివోలె
నోలిఁ బొడముచు నడఁగుచు నుంటఁ జేసి
యొసఁగు సంచారిభావంబు లెఱుఁగవలయు. ౪౭

సీ. గ్లాని నిర్వేద శంకా మదాసూయలు నాలస్య దైన్య శ్రమావ్యాయములు
స్మృతి మోహ చపలతా చింతలును విషాద సుప్తి విబోధ కౌత్సుక్యములును
నావేగ గర్వ హర్షామర్ష నిద్రలు మ త్యపస్మార కోన్మాదములును
త్రాసోగ్రతా జడతా వితర్కంబులు నవహిత్థ ధృతి మరణాభిధములు

తే. వ్యాధియును వ్రీడయును ననవరుసఁ గృతుల, సాగు ముప్పదిమూఁడు సంచారిభావ
చయము వాని నెఱుంగక జరుగ దండ్రు, రసవివేచనచాతుర్య రంజనంబు. ౪౮

## గ్లాని

క. మానస మెఱియఁగ మేనికి, నానాదౌర్బల్యకారణం బై యొంటన్
మాననిపశ్చాత్తాపము, గ్లాని యనఁగఁ బరఁగు సుకవికల్పనవిధులన్. ౪౯

క. శ్రీకరుఁ డగువిశ్వేశ్వరు, భీకర ధరణీవరాహ బిరుద భరాత్మున్
జేకొని మది ధరియించిన, యాకోమలి క్లేశ ముడుప నింతులతరమే? ౫౦

## శంక

క. ఇదియును నదియును నట్లయి, యొదవెడునొకొ యనఁగఁ బొడము నూహాపోహా
స్పద మై చనునసుమానము, మది శంక యనంగ బుద్ధిమంతుల కెక్కున్. ౫౧

క. స్తనితము తత్రుటితినినదము, విని ధాటీపటహశబ్దవిభ్రాంతి మెయిన్
వెనుకకు మునుదటి దెసకును, జన శంకింపుదురు విశ్వజనపతిశత్రుల్. ౫౨

## ని ర్వే ద ము

క. దుర్విఫలత నీర్ష్యాదుల, దుర్వారప్రతిభ గలిగి తోఁచమి మొదలై
పర్వెడుచిత్తవ్యథచే, నిర్వేదం బొదవు సోష్మనిశ్వసనంబై. ౫౩

క. ఈనోములేల నోమఁగ? నీ నవశిశిరోపచార మేటికి? సెలంతక్
మానుప విశ్వేశ్వరుఁడే; నా,నాఁటికి మనుప రాజనారాయణుఁడే. ౫౪

## మ ద ము

క. మదిరాకృతమోహము సం, పదుదిత హర్షము గళాదిపాటవమును స
మ్మదమున కుదయింపఁగ నా, స్పదములు, దెలియంగవలయు భావజ్ఞు లిలన్. ౫౫

క. కించిత్సంప దవిద్యో, దంచిత మదిరా మదావిలాత్ముల నేర్పల్
మించుఁ బెఱరాచకొలువుల, నించుక విశ్వేశమేది నీశ్వరుసభలోన్? ౫౬

## అ సూ య

క. పరబలమదవిద్యాసుం, దరతలకు సహింపలేక తఱుచగుదోషా
చరణము గల్పించుటపే, రరయ నసూయాభిధాన మై నెగడొందున్. ౫౭

క. ఈమహి విశ్వేశ్వరుచే, శ్రీమహిమల్ గన్నకవిగరిష్ఠు లసూయల్
వేమఱు భావింతురు చిం, తామణి సురధేను కల్పతరువులతో దల్. ౫౮

## ఆలస్యము

క. పొందుగ నిజకృత్యంబుల, మందోద్యోగంబు చేసి మసలుటయ కదా
యొందుచు నాలస్యం బీ, చందం బతిప్రీతి నెఱుఁగ జనుఁ జతురులకున్. ౫౯

క. చాళుక్యవిశ్వవిభులో, నాలమునకుఁ గడఁగుఁ మతు లలసు లగుటయున్;
జాలఁగ వన్నెలు వెట్టక, యాలస్యము చేసి రచట నమరాంగనలున్. ౬౦

## దై న్య ము

క. విపదాప్తి విత్తహరణ, స్వపతినిరాకృతుల నుద్భవంబయ్యెడు త
త్కృపణత్వము దైన్యం బగుఁ, గృప కాస్పదమగుచుఁ జూడఁ గృతపుణ్యులచేన్. ౬౧

క. పరగండభైరవునియెడ, ధ్ధరధాటీపటుత యెట్టిదో రిపుభూభృ
త్పురమాపురంధ్రిముఖముల, సరి నొక్కట దైన్య మంద్రు జను లరయంగన్. ౬౨

## శ్ర మము

క. సురతక్లేశాయాసా, తురనిర్గమనాదికములఁ దోతెంచు శ్రమం;
బరసి తెలియంగవలయును, దరళశ్వాసాది ఘర్మకణవిదళనలన్. ౬౩

క. అడవులకై యద్రులకై, యడుగడుగున నలఁత వొడమ నడలుచుఁ జని రీ
పడఁతుకలు పతులు మనుగడ, నడరఁగ గరవాల భైరవార్చులు సేయన్. ౬౪

## స్మృతి

క. అమరఁ బురాకృతసుఖదుః, ఖములం దలపోసి పోసి కనుఁగొనుటకు నై
నమితోన్నమితాననముగ, నెమకుట సంస్మృతి యనంగ నెలకొనుఁ దలఁపన్. ౬౫

ఉ. "ఈసురచాపదీప్తులకు నీడు సుమీ మన సాలరత్న వి
న్యాసము, లీతటిల్లతలయచ్చు గదా మన లాసికాతనూ
ల్లాసము, లీసునోపలములం దెగడున్ మన మౌక్తికావళీ
భాసము," లంచు విశ్వజనపాలవిరోధి దలంచుఁ గానలన్. ౬౬

## మోహము

క. భయదుఃఖావేశమహా, మయచింతనవిధుల మెఱయ మలఁగొను మూర్ఛా
దయ మది మోహం బనఁ జను, నయుక్త మవివేకసరణి నగుఁ దెలియంగన్. ౬౭

ఉ. అద్దముఁ జూచి బిట్టులుకు, నానలిఁ జేసిన సంచలించు, న
మ్ముద్దియ విశ్వనాథుపయి ముచ్చట చేసినయంతనుండి; యి
క్కద్ది నెఱింగి చందురునిఁ గానఁగ నీరు, పికంబు గూయ న
న్నిద్దపుమ్రోఁత మాన్పుదురు, నెచ్చెలు లిచ్చ యెఱింగి నిచ్చలున్. ౬౮

## చపలత

క. రాగద్వేషాదులచే, సాగెడు చంచలత పేరు చపలత, నిజనా
థాగోవిస్ఫురితవికా, రాగతి నెఱుఁగంగవలయు నండ్రు రసజ్ఞుల్. ౬౯

ఉ. నెయ్యపుబోటి మున్ను చెవి నించినవార్త లెఱుంగ కున్న యా
తొయ్యలి విశ్వభూవిభుని దూరమునం గని రాగసక్త యై
తియ్యపునవ్వు వాతెఱకుఁ దెచ్చె, వడి న్గుచమండలంబుపైఁ
బయ్యెద చక్కఁ జేర్చెఁ, బొలపంబు నమర్చెఁ గటాక్షవీక్షలన్. ౭౦

## చింత

క. తనకు ననిష్టాగమనం, బున నగు తలపోఁత పేరు వో చింత యనన్;
మనసున నెలకొనుదానిన్, గనునది సంతాపహేతుకధ్యానమునన్. ౭౧

చ. తిరముగ విశ్వభూవిభుఁడు దేర్చినఁ దేరక త్రోచి పిమ్మటన్
దరుణి తదీశుతో వెస ముదంబునఁ జన్నమనంబుఁ ద్రిప్పఁగా
వెరవఱి చింతనొందు, పృథివీశుల మూరక వ్రాయు, బోటులన్
బరువడిఁ జూచి సిగ్గుపడుఁ, బాయనిధీరత దూరు బుద్ధిలోన్. ౭౨

## విషాదము

క. అబ్బెఁ దగులాభ మని మది, నుబ్బెడుచో నంతరాయ మొనఁగూడుటయున్
గ్రబ్బికొను వెఱగుపాటది, నిబ్బరపువిషాద మనఁగ నెగడుం జూడన్. ౭౩

క. 'ఇనుఁ డరిగెఁ, దిమిర మడరెను, కని పర్వెడు, విశ్వనాథుకడ కేఁగెద నే'
నని యొకమానిని దలఁపఁగ, ఘనకరములు నిగుడ ధవళకరుఁ డుదయించెన్. ౨౪

## సుప్తి

క. లీనేంద్రియమై విషయ, ధ్యానంబునఁ గొఱలునంతరంగము లోనన్
గానఁబడు కలల కెల్ల ని,దానం బగు సుప్తి, దానిఁ దగ దెలియంగన్. ౨౫
క. సత్యచరిత విశ్వేశ్వర, కృత్యము సంకల్పసుప్రకీర్ణము నగు సౌ
హిత్యమును మరగి సుప్తికి, నిత్యత్వము గలుగఁ గోరు నెలఁతుక యెపుడున్ ౨౬

## బోధము

క. ఇంద్రియములు చిత్తమున క,తంద్రత లో నగుటఁ జెప్పఁ దగు బోధముగా,
రుంద్రవికారవిలోచన, సాంద్రవికారముల నెఱుఁగఁ జనుఁ దజ్ఞులకున్. ౨౭
క. విశ్వేశ్వరుండు పాలిత, విశ్వంభరుఁ డనుచు బుధులు వేదప్రముఖా
నశ్వరవిద్యలయందున్, శశ్వత్పరిబోధసిద్ధిఁ జాటిరి జగతిన్. ౨౮

## ఔత్సుక్యము

క. గురుబంధు ప్రియ ధరణీ, వరవనితాలోకనాది వాంఛల చేతన్
బరు వగు నౌత్సుక్యము త, త్వరత విలంబమునఁ గానవచ్చుఁ దెలియన్. ౨౯
క. ధరణీవరాహలక్ష్మణుఁ, డరిలక్ష్మి వహింప వచ్చునప్పుడు నగరీ
తరుణులు తొడవులు వీడ్వడఁ, బోరిఁదొడిగెడు కౌతుకంబు పొల్పగుఁజూడన్. ౩౦

## ఆవేగము

క. అమితవిచిత్రాలోచన, సమయంబుల సంభ్రమించుసంభ్రమ మావే
గము నాఁబడు; ననుచిత ని, ర్గమనస్ఖలనాదికములఁ గనుఁగొనవలయున్. ౩౧
క. సొబగారువిశ్వభూవరు, ప్రబలజయశ్రీలఁ జూడఁ బఱతెంచు తఱిన్
గబరీకుచజఘనంబుల, నిబిడత నసియాడెఁ బురము నెలఁతలనడుముల్. ౩౨

## గర్వము

క. రిపుతర్జనవాచాటము, విపులాత్మోత్కర్ష కథనవికటము రణలో
లుపమును నగుభుజదర్పము, నిపుణులు గర్వం బనంగ నెగడుచునుండున్. ౩౩
క. బాణకళాగర్వమునఁ గృ,పాణాహంకారగరిమఁ బొటిరెయె సమర
శ్రేణీవిహారణవికట, క్షోణీశులు రాయగండ గోపాలునకున్. ౩౪

## హర్షము

క. దయితాలోకన విభవో, దయ కదన స్తుతులవలనఁ దగ నుదయించున్
బ్రియయుతముదము హర్షం బం,గయుతప్రస్వేదపులకకలితం బగుచున్. ౩౫

క. కరవాలభైరవాంకుని, కరవాలభుజంగి పోరఁ గడు వార్షించుచున్
బరువడిఁ బరభూపాలక, సరసప్రాణానిలముల సరిఁ జవిఁ గొనుచున్. ౭౬

## అమర్షము

క. అపరాధులపై మనమునఁ, గుపితాత్మున కుద్భవించుకోప మమర్షం
బుపగతమత్సరపాప, వ్యపదేశంబులను నెఱుఁగ నగుఁ జతురులకున్. ౭౭

క. పరబలములఁ గనుఁగొని జము, కరణిం గనుఁగొనల నగ్నికణము లురులు నీ
వరగండభైరవునిభట, వరుల యమర్షంబు పొగడవశమే పోరన్. ౭౮

## నిద్ర

క. అలవున నలసత సురతా, కులతన్ బ్రణయోపపన్నకోపాదులచే
నలవడు నిద్దుర, యది యిమ్ముల ముకుళితనయనమాత్రమున నెఱుఁగఁబడున్. ౭౯

చ. చెలువ చళుక్య విశ్వనృపుచే మరుతూపుల నెల్ల గెల్చి యి
ప్పుల సుఖనిద్ర సేయుతటి బోటులచూపుల కిం పొనర్చె న
య్యలికముమీఁద గ్రాలునలకాళియుఁ దిన్ననియూర్పు తావికిన్
జెలఁగెడుతేం ట్లనన్ జెలిమి సేయుచుఁ గొండొకసేపు శయ్యపై. ౮౦

## మతి

క. సహజార్థ తత్త్వసంశయ, మహితవినిర్వహణశక్తి మతి యనఁ బరఁగున్
ముహురుద్భూతప్రతిభా, విహారణమున నెఱుఁగఁ దగు వివేకప్రౌఢిన్. ౮౧

ఉ. పాయక కొల్చువారల సుపర్వులఁ జేయుట, వైరులం బలో
పాయసుదర్శనాంచలవిభగ్నులఁ జేయుట, నుర్వి రాజనా
రాయణుఁ డంట, నిశ్చయమ యంచు సుధీంద్రులు విశ్వమేదినీ
నాయకు సత్ప్రభావకథనంబు మహిన్ బచరింతు రెప్పుడున్. ౮౨

## అపస్మారము

క. భూతావేశక్షమమో, హాతురవికృతులఁ దనర్చి యాత్మలయం బు
ద్భూత మగు నపస్మారము, చేతోగతి నెఱుఁగవలయుఁ జేష్టాదులచేన్. ౮౩

క. భేరీరావంబులు విని, వైరులు కరవాలభైరవభ్రాంతి నప
స్మారులగతిఁ బొగులుచుఁ దల, చీర లెఱుంగరు భయోపచితి యెట్టిదియో. ౮౪

## ఉన్మాదము

క. చిత్తప్రియవనితాహృతిఁ, బిత్తోద్రేకమునఁ గలుగుఁ బృథులోన్మాదం
బిత్తెఱఁ గెఱుఁగుడు దుల్యా, యత్తాచేతన సచేతనాదులయందున్. ౮౫

మ. హరిణశ్రేణిఁ దురంగమప్రతతిగా నర్పించి మేఘంబులన్
గరులన్ జేసి ద్రుమంబులన్ భటులఁగాఁ గల్పించి పోరాటకున్

దిరుగక్ జూతురు భ్రాంతులై తలుచు ధాత్రీపాలు రుస్మాదకా
తరబుద్ధిన్ బరగండ భైరవునితోఁ దత్తత్ప్రదేశంబులన్. ౯౬

## త్రాసము

క. చిత్తమున నున్నయునికిని, హత్తెడుభయకలన త్రాస మనఁ జనుఁ, గ్రూరో
ద్వృత్త నృప దర్శనాదిని,మిత్తంబులఁ బుట్టు నెఱిఁగి మెలఁగఁగవలయున్. ౯౭
క. ధరణీవరాహుభేరీ, విరావ మాలించి వైరివీరులు వికృతా
తురులై సాగర గిరి సరి, దరణ్యదుర్గస్థలముల కరుగుదు రోలిన్. ౯౮

## ఉగ్రత

క. దండించుచోట నుండెడు, చండతపే రుగ్రతాఖ్యఁ జనుఁ దెలియంగా
ఖండన తాడన తర్జన, తుండనముల చేత నెఱుఁగుదురు భావజ్ఞుల్. ౯౯
క. మైత్రక్కడు బిరుదము లుడిగియు, మత్రక్కం డటు సేయ కున్న మనుజపతుల కా
యక్కజ మగువిశ్వేశ్వరు, దృక్కులలఁ గమరిపోక ద్రిమ్మర నకొమే. ౧౦౦

## జడత

క. జడత యది కడు ముదలబునఁ, బడునిష్టానిష్టకర్మభంజనములచో
నడరెడుభయమోదాదులు, దొడరెడునెడఁ బనులవరుసఁ దోఁపింపనిదై. ౧౦౧
క. ప్రణయమున రాజనారాయణుఁ డలికార్యముగఁ జేయునాదరణ శుభ
క్షణతృప్తి నఖిలనృపతులు, ప్రణతిప్రణుతులకుఁ జొరరు పరమోత్సుకులై. ౧౦౨

## వితర్కము

క. గుణగణవిగుణోత్కర్షణ, గణన వితర్కంబు; దానిఁ గనుఁగొనఁ దగు నై
పుణమునఁ జతురులు తత్కారణకార్యవిభేదబుద్ధిరసికత చేతన్. ౧౦౩
క. శ్రీవిశ్వవిభుఁడు చేసిన, యావెరగుల కలుగవలయు నలిగినసిదపన్
భావింప నతఁడు ధీరుఁడు, వావిరి నుఁదేర్పఁ డతనువడిఁ బడపలయున్. ౧౦౪

## అవహిత్థ

క. కడు హర్షంబున మదిలో, నడరెడుననురాగ మొప్ప నణఁచెడు వెరవ
ప్పుడఁతికి నవహిత్థ యనం, బడు నూత్నవిచేష్టితములు పరికింపంగన్. ౧౦౫
క. అవిరళముగ విశ్వమహీధవుగుణములు పొగడుచోటఁ దద్గతమతియై
చెవిఁ బెట్టుచు నొకముద్దియ, చవిచదువులు గఱపెఁ గీరశాబంబులకున్? ౧౦౬

## ధృతి

క. ఎట్టిపదార్థము లబ్బిన, నొట్టిడిన ట్లంట నోప నొల్లక మదిలో
గట్టి యగు దిట్టతన మది, యిట్టులముగ ధృతియనంగ నెందునుఁ బరఁగున్. ౧౦౭

క. చాళుక్యవిశ్వవిభుచే, శ్రీలఁ దనరారుబుధులు చేకొన రవనీ
పాలానీతపటీరదు,కూలాగురుచంద్రగంధకోటుల నైనన్. ౧౦౮

## మరణము

క. గర శౌనల రో గాయుధ విరహాదులవలన నగు వివేకింపంగా
మరణము, నయననిమీలన, విరళశ్వాసాంగవర్ణవిధిఁ దెలియ నగున్. ౧౦౯

క. కరవాలభైరవుని యని, నరి చాపక చచ్చినట్లు యటు పడి యుండెన్
పౌరి నూర్పు లణఁచి ఱెప్పలు,మరలింపక గాఁజువాఱి మ్రాన్పడి భీతిన్. ౧౧౦

## వ్యాధి

క. జ్వరమున నైనను విరహ, జ్వరమున నైనను దనర్చుసంతాపము వి
స్ఫురితవ్యాధి యనంబడు; శరీరసాదాదివిధులఁ జనుఁ దెలియంగన్. ౧౧౧

క. కేలెరియు నొడలు దడివినఁ, గోలంబము లూర్పులేశిఖల మండిపడున్,
చాళుక్యవిభునిఁ జూచిన, బాలికపరితాప మెన్నఁ బని లే దింకన్. ౧౧౨

## వ్రీడ

క. మెయిదెలుపులు పరికించుచు, దయితునిఁ గట్టెదురఁ జూచి తల వంచినమ
ద్దియసొబగు వ్రీడ యెఱుఁగుఁడు, నయనచ్ఛదలీన దర్శనప్రసరములన్. ౧౧౩

ఉ. వేడుకవిశ్వనాథపృథివీవరసుందరు బిట్టు చూచి తో
డ్తోడన సిగ్గు డగ్గఱుడుఁ దొంగలి ఱెప్పలకప్పుఁబోనఁ జి
ట్టాడెడుచూడ్కు లొప్పెఁ గుసుమాయుధ తూణముఖంబునందు నూఁ
టాడెడుపువ్వుఁదూపు లన నంగనకుం దరళంపుఁజాయలన్. ౧౧౪

## స్థాయిభావములు

తే. ఆత్మసంభావితవిభావకానుభావ
సాత్త్వికవ్యభిచారి సంజ్ఞ లఁ దనర్చు
భావములచేత సువ్యక్తభంగు లైన
వాని రసికులు స్థాయిభావంబు లండ్రు. ౧౧౫

క. రతి హాస శోక రోషము, లతులోత్సాహంబు భయసమాఖ్య జుగుప్సా
కృతి విస్మయ శమములు నా, సతతరసస్థాయిభావసంపద నొందున్. ౧౧౬

## రతి

క. సంభోగావాప్తికృతా, రంభస్పృహసొంపు పేరు రతి యనఁ బరఁగున్
సంభృతచేతఃకుతుకవి, జృంభణమున నెఱుఁగఁదగు రసికముఖ్యులకున్. ౧౧౭

క. మంగళరూపవిలాసజి,తాంగజుఁ డగువిశ్వనాథునందు మెలఁగు నీ
యంగనకోరిక సతతము, శృంగారస్థానజాతచేష్టాంగక మై. ౧౧౮

## హా స ము

క. అతివికృతదర్శనాభా, షితచేష్టాగతులచేతఁ జేపడుహాస
ప్రతిపాదన; మెఱుఁగం దగుఁ, జతురులు చేతోవికారపరసతచేతన్. ౧౧౯

క. చాళుక్యవిభునిఁ దలఁచిన, హేలలు నీనుదుటిచేత నెఱిఁగితి మనుడున్
లీలాహాసమునకు న్యావాలము గావించె నింతి వదనోదరమున్. ౧౨౦

## శో క ము

క. శోకం బనఁగను మదిలో, సాకస్మికవిపదవాప్తి నడరెడుదుఃఖ
వ్యాకులత, దాని నెఱుఁగుఁడు, చేకొని రసభేదసిద్ధి చేరుటకొఱకున్. ౧౨౧

క. ఈశోలధ్వజు ననిపెను, బోకులచే నఱ్ఱుఁగడుపుఁ బొలిసినయరినా
రీకులము నెరయ శోకం, బాకారము దాల్చినట్ల యంగంబులతోన్. ౧౨౨

## రో ష ము

క. పరకృతధిక్కారాదుల, నరు దగుకలుషంబు రోష మనఁగాఁ బేర్చున్
పొరిఁబొరిఁ గనలుచునుండెడు, పరుసున నెఱుఁగంగవలయు భావజ్ఞులకున్. ౧౨౩

క. నీపోరిలోన నైనను, నేపారుచళుక్యవిభుని యెసకపురూపా
టోపము దీపించుఁ గడున్, రూపింపఁగఁ గల్పసమయరుద్రాకృతియై. ౧౨౪

## ఉ త్సా హ ము

క. మత్సరమర్దనము త్రిజ, గత్సంకీర్తితము నైనకడిమి నడరు నా
సత్సాహసప్రయత్నం, బుత్సాహం బనఁగఁ బరఁగు నురుతేజమునన్. ౧౨౫

క. శంకింపక సురవనితా, శంకరు లగువిశ్వవిభుని సమదభటులకున్
బింకమునఁ మేను లుబ్బినఁ, గంకణములు విరిసె శౌర్యగరిమోత్పత్తిన్. ౧౨౬

## భ య ము

క. భయ మనఁగఁ బూరుషత్వ, వ్యయకరణం బగుచు నంతరంగమునందున్
క్షయమునకు వెఱచువెఱ పది, నియతం బగుచుండుఁ బ్రాణినికరంబులకున్. ౧౨౭

క. కరవాలభైరవునికర, కరవాలప్రభలసొబగు గలుఁగుటనె కదా
పరికింపఁగ నెచ్చటఁ బర, ధరణీశతమోగుణంబు తలచూప దిలన్. ౧౨౮

## జు గు ప్స

క. హేయాపాదకవస్తుని, కాయశ్రవణావలోకకథనంబులచే
నాయత మగురోఁత సుమీ, యేయెడలఁ జుగుప్స యనఁగ నింపులఁ జెలుచున్.

క. బిరుదములు వెట్టుకొని తుది, బిరుదార్థము నిలుప లేనివిరసునృపులకున్
బరికించి రోయుం ననిమొన, నరు దగుపరగండభైరవాంకుఁడు లీలన్. ౧౩౦

## విస్మయము

క. శ్రవణాలోకాపూర్వ, ప్రవరచమత్కారమైన బంధురకృత్యం
బవని నగు విస్మయం బనఁ, బ్రవీణు లెఱుఁగంగవలయుఁ బ్రచురప్రతిభన్. ౧౩౧

క. అసమునఁ దగువిశ్వభూవిభు, నసిధారాపీతజలము లరినారీదృ
గ్విసరములఁ దొరఁగుచున్నవి, కసుగందక విస్మయంబు గాదె తలంపన్. ౧౩౨

## శమము

క. దూరీకృతసంసారవి,కారము శమ మనఁగ నిగమసారం బై పెం
పారి నది గలిగెనేని వి,చారము గడు నొప్పు నెపుడు చతురుల కెల్లన్. ౧౩౩

క. చాళుక్యవిశ్వవిభుఁడు మ,హీలలనాపాలనమున నెనక మెసఁగుచో
నోలి యతీంద్రులు మనముల, నాలవపురుషార్థసరణి ననిచిరి మిగులన్. ౧౩౪

మ. ఇది నానావిధభావబోధపద మిం దేరాజు రాజత్కళా
సదనం బై విహరించు నాతఁడుగదా సంగీతసాహిత్యసం
పదత్రోవం జనఁ జాలుఁ, జాలిన భవాపాయంబుఁ దూలించు స
మ్మదలీలన్ గృతకృత్యుఁడై నెగడు సమ్యగ్రాజతేజోనిధీ! ౧౩౫

ఉ. సోమకులాబ్ధిచంద్రుఁడు యశోధవళీకృత దిగ్గజేంద్రుఁ డు
ర్వీమహిళాభిరాముఁడు నవీనభుజాబలరాముఁ డంగనా
రామవసంతుఁ డున్నమితరాజజయంతుఁడు వైరిఘోరసం
గ్రామధనంజయుండు రిపుకాననదావధనంజయుం డిలన్. ౧౩౬

క. కంఠీరవశౌర్యుఁడు శ్రీ, కంఠపద స్మరణవిగత కల్మషుఁ డసుహృ
త్కంఠగ్రహఖడ్గుఁడు వైకుంఠపరాక్రముఁడు కదనకోవిదుఁ డెపుడున్. ౧౩౭

## మాలిని

అతులవిభవశక్రుం డర్థసంపన్నచక్రుం
డతిసుగుణగరిష్ఠుం డాత్మవిద్యావరిష్ఠుం
డతనుతనువిలాసుం డంగనాళీవికాసుం
డితరనృపతిపూజ్యుం డిద్ధరాజ్యుండు నీతిన్. ౧౩౮

## గద్యము

ఇతి శ్రీమదుమారమణ చరణారవిందమదన గోవిందామాత్యనందన వివిధబుధవిధేయ విన్నకోటపెద్దయనామధేయవిరచితం బైన కావ్యాలంకారచూడామణి యను నలంకారశాస్త్రంబున భావప్రపంచప్రకటనసముద్దేశ్యం బనఁ బ్రథమోల్లాసము.

---

క. శ్రీలుఁడు ప్రణతావనిపతి, మౌళిమణిద్యుతిసమేతమంజీరుఁడు తే
జోలంకారుఁడు ధృతిసుర, శైలుఁడు చాళుక్యవిశ్వజన పాలుఁడిలన్. ౧

శా. శ్రీ నిండారఁగ లోకరక్షణాఖ్యకై సిద్ధించుటం జేసి ల
క్ష్మీనాథుం డగునయ్యుపేంద్రుఁ డటు లేఁగెన్ గాన నీనూతన
క్ష్మానాథుం డగు విశ్వనాథునకు శృంగారాధినాథత్వ మొం
తే నొప్పం బ్రణుతింప నచ్చుఁ గవు లుత్ప్రేక్షింతు రెల్లప్పుడున్. ౨

క. కావున నుపేంద్రునకుల, క్ష్మీవనితకు దనయుఁ డైనవిశ్వేశ
క్ష్మావరునకుఁ బ్రియకరముగ, భావితశృంగారరసముఁ బ్రణుతింతుఁ దగన్. ౩

క. ఉక్తవిభావాదులచే, భక్తనవస్థాయిరూపభావంబులు సు
వ్యక్తములై నిజగుణసం, సక్తములై రసము లన రసత్వము నొందున్. ౪

తే. స్థాయిభావంబులకు ననుసారు లైన
తద్విభావాదులను రసత్వంబు గలుగుఁ
బరఁగ వెన్నకుఁ బాకసంప్రాప్తిఁ జేసి
తగుఘృతత్వంబు గలఁగుచందమున నెపుడు. ౫

క. వినువారికిఁ గనువారికిఁ, దనరువిభావానుభావ దర్శనచయముల్
ఘనరసపోషకములునాఁ, జనుఁ గవితానాట్యములఁ బ్రసన్నాకృతు లై. ౬

తే. ప్రోడలకుఁ గావ్యములయందుఁ బొందు రసము
ద్రష్టలకు నాట్యములయందుఁ దనరు రసము
స్ఫుటవిభావానుభావసంఘటనచేత
సాత్త్వికవ్యభిచారిసంసక్తిచేత. ౭

క. రస మారోప్యం బగుటన్, బొసఁగను నాట్యములయందుఁ, బొల్పగుఁ దత్త
త్ప్రసరస్మరణముచేతన్, వెస సామాజికులయందు వేద్యం బను నల వై. ౮

## శృం గా ర ర స ము

క. అతులానందాత్మిక యగు, రతియె విభావాదిభావరంజనముల సం
వృత యై శృంగారరసా, కృతిఁ జెందు మనోనురాగ కీలితగతులన్. ౯

క. ద్వివిధం బగుశృంగారం, బవిరళ సంభోగసంభవాత్మకమును నై
తవవిప్రలంభజము నన, యువతిప్రియజనులవలన నుదితం బగుచున్. ౧౦

## సం భో గ శృం గా ర ము

క. అనులాపాలింగన దర్శన చుంబన మోదన ప్రసాధన విధులన్
వనితలుఁ బతులున్ దమలోఁ, జెనయుట సంభోగజనితశృంగార మగున్. ౧౧

మ. లలితస్విన్నకపోల మాననము, హేలాలోల మాలోకనా
వలనం, బుల్లసదంగ ముత్పులకసంవాసంబు, వృత్తస్తన
స్థలి మాల్యావృత, రంజితాధరము లజ్జాహాసభాసంబు, నె
చ్చెలి కీసొంపు చళుక్యవిశ్వవిభుఁ డిచ్చెన్ జూచితే నిచ్చలున్. ౧౨

తే. పంచవిధభావకలితప్రపంచ మెల్లఁ
గలసి శృంగారరసపోషకంబ యండ్రు;
క్రమముతోడఁ బ్రయోగసంగతి యెఱింగి
కావ్యనాటకములఁ గూర్పఁ గనుట యొప్పు. ౧౩

తే. ఇందు శృంగారరసమును నెసఁగఁ జేయుఁ
వివిధభావాదిక క్రియావింశతియును
నెఱుఁగఁబడు భావకుల మది కేర్పడంగఁ
గవిత లక్షణలక్ష్యప్రకారములను. ౧౪

క. అంగనలకు యౌవనగుణ, శృంగారరసోపపన్న చేష్టలు నానా
భంగులయి యొప్పు నిరువది, యింగితముగఁ దత్ప్రకార మెఱుఁగఁగవలయున్. ౧౫

క. ఆవింశతిలో భావము, హావము హేలాభిధయును ననియెడు మూఁడున్
భావింప నంగజాతము, లావిధ మెఱుఁగంగవలయు నయ్యాయి గతులన్. ౧౬

తే. అలరు శోభయుఁ గాంతి దీప్తులును మధుర
తయుఁ బ్రగల్భత్వమును సదౌదారతయును
ధీరతయు నాఁగఁ బేర్కొను తెఱఁగు లేడు
పరఁగు సతుల కయత్నసంభవము లగుచు. ౧౭

తే. చెలఁగు లీలావిలాస విచ్ఛిత్తి విభ్ర
మాహ్వయంబులు గిలకించితాభిధంబుఁ
గొరలు మోట్టాయితంబులు గుట్టమితము
నెసఁగు బిబ్బోక లలిత విహృతులు వరుస. ౧౮

క. పదియును నైసర్గికములు; విదితము లన్నియును గూడి వింశతి యయ్యెన్;
వదలక తల్లక్షణములఁ, దదుదాహరణములు నెఱుఁగఁదగుఁ దజ్జ్ఞులకున్. ౧౯

## భావము

క. అతినిర్వికారచేతో, గతవృత్తివిశేష మరయఁగా సత్త్వము, త
త్ప్రతిపాద్యక్రియ భావము, సతతాలంకారకారి; చనుఁ దెలియంగన్. ౨౦

ఉ. ఆళిజనోపభోగవచనార్థములం జెవిఁ బెట్టి, సిగ్గుతోఁ
గ్రాలెడువింతచూపు కడగన్నులయం దిడి, మున్నువోలె వై
మాళపుటాటకున్ జొరదు మాఱఁదు గల్గుట లో నెఱింగి, యీ
బాల చళుక్యవిశ్వజనపాలునిఁ జూచుట నిక్కువంబు పో. ౨౧

### హావము

క. భావము యించుక వదన, వ్యావళితవికాస మైన హావము, శృంగా
రావిర్భావనివాసము; భ్రూవల్లీ మందచలనమున నెఱుఁగఁబడున్. ౨౨

చ. అరవిరితమ్మిలో వెడలునమ్మధుపమ్ములఁ గ్రేణి సేయుచున్
గరము విలోచనాంతములఁ గ్రాలెడుచూడ్కుల దండడించున
మ్మరుఁ డెడకాఁడుగా నొకతె మక్కువఁ గన్గొనె సిగ్గు ముందఱన్
దిరుగఁ జళుక్యవిశ్వనృపతిన్ జెలిచాటుననుండి వేడుకన్. ౨౩

### హేల

క. హావము సువ్యక్త విలా,సావహ మగునేని హేల యనఁగాఁ బరఁగున్
భావింపఁగ శృంగారము, దైవాఱుచు నారఁబారఁదనరుటచేతన్. ౨౪

శా. భ్రూతారావలనంబు ఘర్మపులకాభోగంబు రాగంబునున్
జేతోజాతుఁడు తన్ను జోకుటఁ బ్రశంసింపన్ బ్రసన్నోదిత
ప్రీతిన్ జూచెఁ బయోజనేత్ర కుతుకశ్రీపుష్టదృష్టిక్రియా
చాతుర్యంబులు చంద్రికన్ దెగడఁగాఁ జాళుక్యవిశ్వేశ్వరున్. ౨౫

ఈమూఁడును అంగసముద్భవములు.

### శోభ

తే. రూప యౌవన లావణ్యరూఢి సొబగు
సుందరుల కెల్ల రసికులు శోభ యండ్రు;
దనరు నన్యోన్యతుల్యగాత్రములయందుఁ
గడఁగి పెట్టని తొడవయి కానఁబడుచు. ౨౬

ఉ. కోరి చళుక్యనాథుకడకున్ జనునింతికి రత్నకాంచనా
కారము లైనభూషణనికాయములం బడవంగ నేల; యీ
సూరెలఁ గ్రాలునంగములసోయగ మెంతకు లేదు చూడఁడా
మారునిపూవుఁదూపులకు మాఱటరూప మనంగ నొప్పెడున్. ౨౭

### కాంతి

క. ఆశోభయ రంజనగుణ, పేశలమై మించుగలిగి బెరసిన విద్యా
కౌశలులు కాంతి యండ్రు ప్రకాశప్రతిభాప్తి నెఱుఁగఁగా దగు బుద్ధిన్. ౨౮

చ. కలపపుఁబూఁతలోన వెలిఁ గ్రమ్ముచుఁ బయ్యెదచీరమీఁద సు
జ్జ్వల యగునంగకాంతి గరువంపునడం బొలుపారెఁ జూచితే
పొలఁతి కుపేంద్రపుత్త్రపరిభోగమతిన్ జనుచోట నెంతయున్
బలుచనివారిదంబు వెలిఁబర్వు శశిప్రభతోడ సాటియై. ౨౯

### దీప్తి

క. శస్త మగుకాంతికల్పిత, విస్తారము దీప్తి యనఁగ విలసిల్లు శరీ
రస్తుత గభస్తివిభవ ని,రస్తాలంకారకరణ యగు సతి కొప్పున్. ౩౦

మ. బలవద్విశ్వనరేంద్రుధాటి మదిలో భావించి యుగ్రాచలా
చలితధ్వాంతగుహాంతరంబులఁ బ్రవేశం బొప్పఁ గావింతు ర
స్ఖలితాంఘ్రిప్రసరంబులన్ బ్రియవధూశారీరభూరిప్రభా
వలనంబుల్ కరదీపికావళులుగా వైరిక్షమావల్లభుల్. ౩౧

## మాధుర్యము

క. పాగ డొందనివస్తువుతోఁ, దగిలియుఁగడు హృద్య మగుటఁ దా మాధుర్యం
బగు నప్రసిద్ధమండన, లగనంబున నెఱుఁగఁ దగు విలాసకరం బై. ౩౨

ఉ. లాలితసిందువారముకుళంబుల పేరులు కర్ణకీలితా
లోలశిరీషపుష్పములు లోధ్రరజంబును మేనఁ జెంది సు
శ్రీలఁ దనర్పఁ గ్రొవ్విరులఁ జేసినకానుక యిచ్చి సొంపుతో
బాల చళుక్యవిశ్వజనపాలుని మ్రోల వెలింగె సిగ్గునన్. ౩౩

## ప్రాగల్భ్యము

క. వ్రీడోదితభయముల్ దగ, వీడుట ప్రాగల్భ్య మనఁగ వెలఁదుల కొనరున్
ప్రౌఢతనం బై విద్యా, మ్రేడితసంక్రీడనముల మెలఁగెడు నెడలన్. ౩౪

మ. ఇల విశ్వేశ్వరచక్రవర్తిసభలో నీముగ్ధ భావింప ని
శ్చలలజ్జావతి యయ్యునుం దగు నెడన్ సంగీతసాహిత్యవి
ద్యల విద్వన్నుతి కెక్కినట్టిదిగదా తర్కింప నత్యాశ్రయ
స్థలదత్యాశ్రితసిద్ధులన్ విధికళాచాతుర్య మొప్పుం జుమీ. ౩౫

## ఔదార్యము

క. లలి సురతాయాసాదుల, నలసియు విలసిల్లు కణఁక యౌదార్య మగున్
లలనకుఁ దగ మగుడనివేడ్కల నొసఁగున్ దయితకౌతుకప్రదచేష్టన్. ౩౬

ఉ. కన్నులచెన్ను పాల్లకవికాసముతోఁ బురణింప, బింకపున్
జన్నులమీఁది పెంజెమరు సాలమి నెన్న, మృదుప్రచారము
త్పన్నపుసోలమును దెలుప, భామకు లోఁ దమకం బొకింతయున్
సన్నము గాక విశ్వనరనాథునిపైఁ దగులంబ చూపెడున్. ౩౭

ఈయేఁడునొకటియుఁ అయత్నసంభవములు.

## ధైర్యము

క. రూపింపఁ జిత్తసంభృత, చాపల్యము చేతఁ బుప్పచాపాదులచే
నేపళుక యుండుతాలిమి, చూపట్టును ధైర్యమనఁగ సుస్థిరబుద్ధిన్. ౩౮

మ. పతి విశ్వేశుఁడు నాకు; నవ్విభుఁడు చెప్పన్ సర్వలోకాశ్రయుం;
డతఁ డేలాగుదలంచినన్ దలఁపనీ; ప్రాణంబు నిత్యంబె? మా
రుత మాకంద మనోజ మాధవ మహారోషంబు సైరింప సం
స్తుతి సామాన్యమె? మాన మాభరణ మై శోభిల్లదే యెల్లెడన్? ౩౯

లీల

క. గతివచనాలోకన మిశ్రిత చేష్టలఁ బ్రియుని ననుకరించుటయ కదా
మతిఁ దలఁప లీల యనఁ జను, సతతమనోరంజనప్రసాదం బగుచున్. ౪౦
ఉ. చేరి చళుక్యవల్లభుని చెప్పినయట్లన సేయు నుత్తమ
శ్రీరమణీసరస్వతుల చేఁతలు చిత్రము; లన్నరేంద్రుఁ డె
వ్వారికి నేపదార్థము లవారిగ నిమ్మను నట్ల యిత్తు; ర
న్నారులకున్ బ్రియానుకరణం బురుధర్మము కాదె యెప్పుడున్. ౪౧

విలాసము

క. బిట్టు నిజప్రియు నంగన, కట్టెదురన్ జూచి యంగకంబులమీఁదన్
బుట్టించినయొయ్యారము, చిట్టాడుట యది విలాసచిహ్నం బరయన్. ౪౨
ఉ. పయ్యెదఁ జక్కఁ దీర్చుకరపల్లవముం, గడచూడ్కిలోన నిం
పయ్యెడుసిగ్గుఁ, గుంతలము లల్లన వీనులపొంతఁ జేర్చున
త్తియ్యపుఁ జెయ్వు, మన్మథుని తేజపుబీజము లై తనర్పఁగాఁ
దొయ్యలి చూపెఁ గోరికలు దొట్రిల విశ్వనరేంద్రచంద్రునిన్. ౪౩

విచ్ఛిత్తి

క. సురతాదులయెడ నల్పాభరణం బై మెఱయుచున్న భావము తగ సుం
దరులకు విచ్ఛిత్తి యనం, బరఁగు నిజప్రథమరసవిభాసక మగుచున్. ౪౪
ఉ. మంచివిభూషణావళులు మాని నవారుణశాటకంబునుం
గొంచెపుహారముల్ చెలువుఁ గోరి ధరించినయింతి కామినీ
పంచశరాంకు విశ్వజనపాలునిఁ జూచి తనర్చెఁ జూడ్కికిన్
బంచషపల్లవప్రసవభాసిని యయ్యెడు తీఁగచాడ్పునన్. ౪౫

విభ్రమము

క. కడుఁ గౌతుకాతిశయమునఁ, దొడవులుఁ బూఁతలును దప్పఁ దొడుగుటచేన
య్యెడు సంభ్రమంబు విభ్రమ, మడరుం బ్రియదర్శనాదులం జెల్లపుడున్. ౪౬
మ. ఒకనేత్రంబునఁ గజ్జలంబు నిడి వేఱొక్కంట నర్పింప నో
ల్లక యొక్కర్తు జయాంగనాపరిణయాలంకారవిశ్వక్షమా
పకునిం జూచె విలోచనప్రభలు విభ్రాజిల్ల నిద్దంబులై
వికచేందీవరపద్మతోరణగతిన్ విప్పారి యొప్పారుచున్. ౪౭

## కిలకించితము

క. లలనునిదెసఁ బ్రియ కబ్బెడు, నలుకయు నెలనగవు గద్గదాలాపములన్
గలరుదితము ననియొడునివి, కిలకించిత మనఁగ, బరఁగుఁ గేళీగతులన్. ౪౮

చ. అలుఁగు, విలోకనాంతముల నశ్రువులం బరఁగించు, చిన్నిన
వ్వులు చిలికించి చేరి చనవుం దగవుం దళుకొత్త గద్గదో
క్తులు సిగిడించు, నిక్కమునకుం బులకించుఁ జెమర్చు, జూడుఁడ
న్నెలఁతకు విశ్వనాథుపయి నెక్కొనుకూరిమిచంద మెట్టిదో ! ౪౯

## మోట్టాయితము

క. పతికిం దనపైఁ దలఁ పు, ద్భుత మని విని వనితమేను పొంగుట మోట్టా
యిత మండ్రుభావసూచన, గతులం దెలియంగవలయుఁ గాముకు లెల్లన్. ౫౦

మ. ప్రమదం బారఁ జళుక్యవిశ్వవిభుశుంభద్దానధారాజలా
ఘుముచేఁ బొంగుచు నంబరాభరణరంగత్కీర్తులం దాల్చుచున్
సుమనోవిస్ఫురదుత్తమాంగరుచులం జూపట్టు భూదేవి ని
త్యము నాథుం డభిగామి యైన వలదా తత్తద్విజృంభక్రియల్. ౫౧

## కుట్టమితము

క. పరిరంభణాధరక్షత, పరిపీడాదులసుఖంబు పటుదుఃఖముగా
దురపిల్లుట కుట్టమితం ; బరయఁగ నుపచారవిధుల నగుఁ దెలియంగన్. ౫౨

మ. వనితా, నేఁడు చళుక్యనాథుని మరున్ వారించుటన్ బీవర
స్తనకుంభాధరబింబమధ్యమున నా సౌగంధికశ్రేణిచేఁ
జన నర్చించెదు నీకు నీసుభగతాసంధాత విశ్వేశ్వరుం
డనియో కాక యుపేంద్రపుత్త్రుఁ డనియో యాచందముం జెప్పుమా. ౫౩

## బిబ్బోకము

క. రాగమున నొందె, గర్వా, భోగంబున నొందె, మొఱఁగిపోవుట నొందెన్,
వేగాదరణము పతిపై, సాగమి బిబ్బోక మనఁగఁ జను నంగనకున్. ౫౪

ఉ. బుద్ధిమహీరమాసతులపొత్తున నుండక సత్ప్రతాపసం
బద్ధసఖత్వ మొప్పఁ జని భాసురకీర్తి దిగంతరంబులన్
వృద్ధగుణానురక్తుఁ డని విశ్వనృపాలు నుతించు నెప్పుడున్
శుద్ధపతివ్రతాత్మికల సోఁకునె యెందు ననాదరక్రియల్. ౫౫

## లలితము

క. వికసితవర్తనమున సే,వకవర్తనమునను రచితవచనములయెడన్
సుకుమారాంగన్యాసము, ప్రకటితముగ లలిత మండ్రు భావజ్ఞు లిలన్. ౫౬

చ. కనుఁగొన నొప్పుకంఠమున గానముఁ, బాణులఁ మంజులార్థక
ల్పనమును, దృగ్విశేషమున భావములం, జరణక్రమంబులన్
దనరు లయప్రపూర్ణ మగుతాళముఁ, గ్రాలఁగఁ బాత్ర యొర్తు రం
జనముగ నాడె నింపు వెదచల్లుచు విశ్వనృపాలుసన్నిధిన్. ౫౭

## విహృతి

క. చెప్పఁ దగుమాట సిగ్గునఁ, జెప్పక వెడ గప్పిపుచ్చు చేష్టాదులచే
నొప్పునది విహృతి, రసికుల, కప్పుడు తగుఁ దెలియ నింగితాకారములన్. ౫౮

ఉ. డెందము విన్న నయ్యె, నొకడిల్లఁదనం బొడఁగూడె మోముపై,
ముందఱిలాగు గాఁ దొడలు, ముచ్చటమాటల కాస చేసె, డీ
చందముఁ జెప్ప మన్న వెడసన్నపుసిగ్గున మ్రొగ్గుచూడ్కిచే
సుందరి చెప్పె విశ్వవిభుఁ జూచినకాముఁడు తన్ను సోఁకుటల్. ౫౯

ఈపదియును నైసర్గికములు.

## విప్రలంభశృంగారము

క. లలితశ్రవణాలోకన, కలహాసూయా ప్రవాసకలనల చేతన్
గలిగెడు దశావిశేషము, చెలువారఁగ విప్రలంభశృంగార మగున్. ౬౦

సీ. అనియుఁ జక్షుఃప్రీతి యన, నంతఁ జిత్తసంగంబు నా, మఱియు సంకల్ప మనఁగ.
నటఁ బ్రలాపంబు నా, నవల జాగర మన, నటుమీఁదఁ గార్శ్యసమాఖ్య మనఁగ
వెండియు విషయవిద్వేషంబు నాఁ, ద్రపాసంత్యక్త మనఁగ, సంజ్వర మనంగ,
నున్మాద మనఁగ, మూర్ఛాపగమం బన, మరణంబు నా, నిట్లు మానినులకు
తే. ననుగతద్వాదశావస్థ మై తనర్చుఁ;
బదియ దశలం డ్రు కొందఱు ప్రౌఢజనులు;
పరఁగు లక్షణములు నుదాహరణములును
వరుసఁ జెప్పెదఁ దెలియంగవలయు నిందు. ౬౧

## చక్షుఃప్రీతి

క. చక్షుఃప్రీతి యనం జను, నక్షీణ విలాసగుణసమగ్రునిఁ బ్రీతిన్
వీక్షించుచునుండుట; మది మరు, నిక్షుధనుర్దండమునకు నెక్కెక్కించున్. ౬౨

ఉ. ఉల్లముఁ జూపుచూపు, లన నొల్లనియుగ్గులు, విచ్చుసిగ్గులన్
బెల్లుగఁ జేరుకోరికలుఁ, బెక్కులు మక్కువచక్కడంబులున్,
మెల్లనె జాఱుపయ్యెదయు, మిం చొలయం బులకించుమేను, రం
జిల్లఁగ చక్షుర్విశ్వనృప శేఖరుఁ గన్గొనుపువ్వుఁబోఁడికిన్. ౬౩

## చిత్తసంగము

క. చిత్తాసంగం బన స్వాయత్తం బగుఁ బ్రతికృతి ప్రయత్నాదిసుఖో
త్పత్తికి నెల వగుచింతన, మత్తెఱఁగు మనోవికీర్ణమై విలసిల్లున్. ౬౪

ఉ. మానినిచూపులం దొరలి మానుగ విశ్వనృపాలుఁ డేపుతో
నానఁగఁ గారుకొన్న మనమా మన మాదట నాదరింప మిం
పూన నుపేంద్రపుత్త్రుఁ డశ డున్నపదం బని కాదె యక్కునన్
సూనపటీరపంకములు సొం పలరారెడు సారసారెకున్. ౬౫

## సంకల్పము

క. చిత్తములో నసిశంబును, మొత్తము లగుకలఁపుఁగాటములఁ బొందెడిచో
జొత్తిల్లు చెమరుపులకల, యొత్తుడు సంకల్పదశకు నొనరినచిన్నెల్. ౬౬

చ. అకట తలంచి చొక్కఁదగ దక్కలయిక్కల నున్న నున్నగా
లికి నెల వైనపువ్వుఁబోదలే పొదలేపులకింప నేల మి
న్నుక యెలనాగ నాగరజనప్రియుఁ డయ్యెడు విశ్వనాథు శ
య్యకుఁ జనవచ్చు వచ్చుమరునమ్ములు వమ్ములు చేసె దంతటన్. ౬౭

## ప్రలాపము

క. ఇంతికిఁ బ్రలాప మనఁగాఁ, గాంతగుణాలాపకథనకల్పన;యదియున్
సంతసము చేయుఁ నుచితార్థాంతరరచనావిశేషణాదులచేతన్. ౬౮

ఉ. ఈగతిఁ జూతురే! తగులరే తగులే తగులేమ లీధరన్ ?
రాగదుఁ డైనవిశ్వనృపురాకయ పో తగురాక నాకు, లో
లో గమిగొన్నచూపుఁదొగలున్ దొగ లై విలసిల్లు ; దానిచే
సాగెడు నన్న రేంద్రునకు సద్ద్విజరాజకళాధరత్వమున్. ౬౯

## జాగరము

క. వల్లభుఁ డెట్టును నబ్బుమి, మొల్లం బగుచింతఁ గన్ను మోడ్పక మదిలో
నల్లలఁ నుడుకుచునుండెడు, తల్లడ మది జాగరాభిధానం బయ్యెన్. ౭౦

చ. నెలగలమేలురేలు చెలినిద్దురకుం బగ లయ్యెఁ, బెల్లువె
ల్లులఁ గొనువేడ్క లీనుపగలుం బగ లయ్యెను, దాన దీనికిం
గలువలు కన్ను లంటయును గైవడి విశ్వనృపాలచంద్రు నిం
పలరఁగఁ జూచుటం గువలయప్రియుఁ డంటయుఁ నిక్క మిక్కడన్. ౭౧

## తనుకార్శ్యము

క. అంగనకు నెట్లు ప్రియుదెస, సంగతి యరు దైనఁ గామసంతాపముచే
నంగములు డస్సిపోయిన, భంగి తనుత్వంబు నాఁగఁ బరగుం జూడన్. ౭౨

చ. అటమట మేల? యేలికొను మంగన; నంగదభంగు లయ్యె న
క్కటకటకంబు లింతి! కెడకత్తెలు నీకడ వాడి పాడిరే
విటతతివింటదూపడనువింటఁ దొరంగుట నీగుణంబు లిం
తటఁ జల మేది మేదినిఁ బొదల్పమ విశ్వనృపాలమన్మథా! ౭౩

## విషయద్వేషము

క. సద్వస్తువు లొల్లక విల, సద్విద్యావిహారణంబు చాలించి వివే
కద్వారము గానమి విష,యద్వేషము తెలియవలయు నస్త్రీతిమెయిన్. ౭౪
ఉ. గీరనురాగ ముప్పతిల గీరమణీ రమణీజయంతుపైఁ
గూరిమిఁ గూరి మిక్కుటపుఁగోరిక లీరికలెత్తఁ బల్కి తిం
పార నపారధీరగుణుఁ డారయ నాపతి విశ్వనాథుఁ డా
మారుఁడు మారుతంబు నెలమావియుఁ గ్రించులు మించు లేటికిన్. ౭౫

## త్రపా నాశము

క. పొలఁతుక నిజదయితునికై, కలమానధనంబు చాల గజిబిజి గాఁ దా
నిలువడియును గులగతియును, దలఁపమియ త్రపావినాశదశ యనఁ బరఁగున్. ౭౬
ఉ. క్రొన్ననగొన్న సిగ్గుదలకొన్న తలంపు నలంపకున్న నీ
నన్నుఁ జళుక్యవిశ్వ నరనాథుఁడు మన్ననలం బొదల్చ నీ
వ న్నెడఁగూడినం జెలుల పాటొడఁబాటటుగాక యెట్లు నే
వెన్నెల నిల్తు గెల్తు ననవిల్తు నదల్తుఁ బికాదిసేనలన్. ౭౭

## సంజ్వరము

క. శీతకరమదనకృతమును, శీతలకరణోపచారజృంభితమును నై
యేతెంచుతాపభర మది, నాతికి సంజ్వర మనంగ నలు వెడలించున్. ౭౮
ఉ. వే చని విశ్వనాథు గుణవిశ్రుతుఁ దోకొని వత్తు మంచు మ
న్నీ చెలు లెల్ల నన్ను పలు కెల్లగఁ జూచితి నో ని దేల నా
కీ చలిమందు లేమిటికి నీవల నావలఁ దావలంబు లై
త్రోచి మొగంబుపైఁ దిరుగుతుమ్మెద లూరడుఁగాక యింతటన్. ౭౯

## మోహము

క. విరహావశవికలచేత, శ్చరితోన్మాదంబు మోహసంజ్ఞం బరయన్,
సొరిది నచేతనచేతన, పరిచితి సరి యగుట నెఱుఁగఁబడుఁ జతురులకున్. ౮౦
ఉ. ఆతురపాటుతో నిలువుటద్దముదీప్తులు మాటు సేయుచో
నాతరుణీలలామ మనయాసలు గన్గొని 'పట్టిజాలి యీ
గోతుల కేల కేలఁ గొని క్రొన్నెల వెన్నెల మాయు టొప్ప నే
యీతతిఁ నన్నుచిన్నిపలు కెన్నరు విశ్వనృపాలుసన్నిధిన్. ౮౧

### మూర్ఛ

క. అనయము నెమ్మనమునఁ బ్రా,యనిసొమ్ములపేరు మూర్ఛ యనఁగాఁ బరఁగున్,
దనరెడు నింద్రియగుణవ,ర్తన వైకల్యమున నెఱుఁగఁ దగుఁ దజ్జ్ఞులకున్. ౮౨

చ. మృదులత నెన్ని యన్నమును మెచ్చఁడు విశ్వనరేంద్రశేఖరుం
డదె యొకలేఁటిబోటి నడయాడెడు నింతియ యింతి మోమునన్
వదలక నోమి నోమి యదనం గడ గానఁగ లేమ లేమకై
మదిఁ బడదే కదే కరుణ మారుఁడు మారుఁడు కాఁడె యెప్పుడున్. ౮౩

### ద్వాదశదశ

క. ద్వాదశదశయుం గలుగుఁ ద,లోదరికిం బ్రియుఁడు బహువిధోపాయములన్
సాదరుఁడు గాక తక్కిన, నాదశ యున్నట్లు చెప్పి రార్యులు కృతులన్. ౮౪

చ. తలిరులు తమ్ములుం గలువదండలు మాటికిఁ బాటి సేసె నా
వల వలరాజుతూపు లనవచ్చుట యెచ్చటఁ దోఁప దక్కటన్
జిలికిన చందనద్రవము చిక్కగ నిక్కడ కేఁగుదెంచితిన్
జలముల మేల మేల సతిచక్కటి విశ్వనృపాల, యిత్తఱిన్. ౮౫

చ. పొలఁతుక చూచురా యబలపోఁకలు ఱేకులు విచ్చి, చన్నుఁగ్రే
వలఁ బలుమాఱు గప్పెడు, నసస్మిత మొప్పఁగ దర్పణంబుతోఁ
బోలుచులలాటరేఖ గని బొట్టిడి సోలెడుఁ, గ్రాలువాలుఁజూ
పుల మరుతూపులం దెగడఁ బూనెడు విశ్వనృపాలుఁ బ్రాపునన్. ౮౬

ఇది విప్రలంభశృంగారద్వాదశకము.

క. ఇప్పుడు చెప్పిన వన్నియుఁ, నొప్పగు శృంగారరససదుపకరణము లై
చెప్పఁబడుచుండుఁ బలుకుల, చొప్పున భావములు గవితఁ జొనుపఁగవలయున్.

### నవరసములు

క. క్రమమున శృంగారము హా,స్యముఁ గరుణము రౌద్ర వీర సంజ్ఞంబులు ఘో
రము బీభత్సము నద్భుత, సమాఖ్య శాంతములు ననఁగఁ జను నవరసముల్. ౮౮

తే. అందు శృంగారరసవిశేషాంతరములు
వితతములు గాఁగ మున్నె భాషితము లయ్యె
నింక హాస్యాదిరసముల నెనిమిదింటి
వరుసఁ జెప్పెదఁ దెలియంగవలయుఁ గవులు. ౮౯

### హాస్యము

క. దృష్టవిభావాద్యుల్లా,సి, బుష్టం బగుహాస మందముగ హాస్య మగున్
శిష్టాలంబన మరయ వి,శిష్టవిదూషకజనాదిచేష్టిత మగుచున్. ౯౦

ఉ. కల్లుకుజుంబిల్లం, దెగడ్డుఁ గ్రామగవిం బ్రహసించు, పట్టెసం
కల్లపురాయి నవ్వు, శిబి కర్ణులచాగము నేవగించు, న

స్వల్పవదాన్యవిశ్వజనవల్లభుచే సిరి నొందు యక్షరా
ట్కల్పవిదూషకప్రతతి గర్వితరాజసభాంతరంబులన్. ౭౧
తే. రూపభాషితవికృతు లుద్దీపనములు
ముఖవికాసాదు లనుభావములు దలంప
నశ్రువైవర్ణ్య విస్వరతాదికములు
సాత్త్వికంబులు నాఁగ హాస్యమున కమరు. ౭౨
తే. అశ్రుసంపాత చపలతా హర్షణాదు
లడరు సంచారిభావంబు లనుసరించి;

హాస్యభేదములు

హాస్య మాఱుప్రకారంబు లైతనర్చు;
తత్స్వరూపంబు లెఱిఁగింతుఁ దగు నెఱుంగ. ౭౩
క. స్మితమును హాసితము నను నీ, ద్వితయము నుత్తమము నాఁగ దీపించుఁ దగన్;
స్మితము వికాసికపోలము, మితదర్శితరదన మైన మెఱయు హాసిత మై. ౭౪
క. విహాసితమును బ్రహాసితము, న్మహి రెండును మధ్యమములు మదిఁ బరికింపన్;
విహాసితము మృదులనినదము, ప్రహాసితము శిరఃప్రకంపపరిమిత మరయన్. ౭౫
క. అపహాసితము నతిహాసితము, నెపుడును నధమంబు లనఁగ నేపారు; శిర
శ్చపలము నశ్రుయుతంబును, నపహాసితము, మేను గదల నతిహాసిత మగున్. ౭౬

కరుణము

క. శోకము విభావముఖభా,వాకలనము చేతఁ గరుణ మను రస మయ్యెన్;
శోకాఱిన యతులితవిప, దాకులితాలంబభావ మనఁగాఁ బరఁగున్. ౭౭
మ. తనరం బుత్త్రకళత్త్రమిత్త్రమిళితార్థస్వాంతుఁ డై శాత్త్రవుం
డని భక్తిన్ బ్రణమిల్లినన్ బ్రకటరాజ్యశ్రీలు ప్రాపించుఁ జ
క్కని విశ్వేశ్వరచక్రవర్తికరుణం; గాకున్న నవైరి మా
త్స్యనిచందంబునఁ బాంథ్యుభంగి ద్రవిడక్షోణీశుభావంబునన్
జను దీనుం డయి హీనుఁ డై కృపణుఁ డై సంతప్తుఁ డై లుప్తుఁ డై. ౭౮
తే. అనిశకృతఖేదపర్యటనాదికములు
వరుస నుద్దీపనవిభావపరికరములు;
రూఢ పరిదేవన శ్వాస రోదనములు
పరఁగు ననుభావములు గాఁగఁ గరుణమునకు.
తే. స్తంభ వైస్వర్య బాష్పము లాస్త్రి త్త్వికములు;
మరణ సంభ్రమ దీనతో న్మాదములును
జాడ్యచింతాదులును నపస్మారగతియుఁ
బటువిషాదంబు సంచారిభావదశలు.

## రౌద్రము

క. క్రోధము రౌద్రరసం బగు, సాధువిభావాదికముల సంపుష్టం బై,
ద్వైవిధం బగు మాత్సర్య విరోధంబులఁ; దెలియఁ దగు నిరూపణవిధులన్. ౧౦౧

## మాత్సర్యరౌద్రము

మ. అని రోషించిన వీరభద్రుకరణి న్వ్యాపించుఁ, బ్రాపించి చ
య్యన రుద్రోద్ధతిఁ జెందుఁ, జెంది వికటోగ్రాటోపముల్ జూపుఁ, జూ
పి నటత్ర్యంబకులీలఁ బేర్చుఁ, బిదపన్ భీమాకృతిన్ జేకొనున్;
జను నే మార్కొన మత్సరాహితులకుం జాళుక్యవిశ్వేశ్వరున్. ౧౦౨

## విద్వేషరౌద్రము

శా. దృక్కేళిం గరవాలభైరవుఁడు విద్వేషించి విద్వేషులన్
జెక్కున్, జక్కడుచున్, బలంబు నెఱపుం, జెండాడు, ఖండించు, ను
ద్బ్రేక్కించుం, బడవైచు, నొంచుఁ, బోడ మాయించున్, బిశాచావలిం
జొక్కించున్ భటఘోటకామిషకృతస్థూలోపహారంబులన్. ౧౦౩

క. క్రమమున మాత్సర్యద్వేషము లాలంబన మనంగఁ జనుఁ, దద్భాషా
సముచితచేష్టాదికములు, రమణీయోద్దీపనములు రౌద్రంబునకున్. ౧౦౪

క. అనుభావంబులు వికృతన, యనరాగాధరవికంప నాదులు; ఘర్మ
స్వన గద్గద వైవర్ణ్య చలనములు సాత్త్వికము లం(దు) లక్షణవేదుల్. ౧౦౫

క. ఆయత మద చాపల్యా, సూయా గర్వములు హర్ష సులభోత్సాహ
స్థేయోభా వోగ్రతలును, బాయక సంచారు లనెడుభావము లరయన్. ౧౦౬

## వీరము

క. విహితవిభావాదులచేఁ, బ్రహితోత్సాహంబు వీరరస మనఁ బరఁగున్,
బహువితరణకరుణారణ, మహిమంబులఁ ద్రివిధ మగుచు మలయుం గృతులన్.

## దానవీరము

క. అతివితరణశూరతచేఁ, నతులబహిః ప్రాణ మైనయర్థము నర్థి
ప్రతతికి నొసఁగెడుసద్గుణ, చతురత యిల దానవీరసంజ్ఞం బడయున్. ౧౦౭

శా. అల్పార్థిం బోడ చూచినంతటనె విశ్వాధీశ్వరుం డిచ్చు సం
కల్పార్థంబులకంటె నర్థము నసంఖ్యాకంబుగా నున్న మ
త్కల్పానోకహకామధేనువులకుం గల్పించు జల్పాకవా
క్స్వల్పఖ్యాతి నడంచి యల్పమని యౌదార్యం బవార్యంబుగన్. ౧౦౮

## దయావీరము

క. అనువిలయంబున నైనను, బన గల్గు నుదారసారభాషాదుల సా
హస రచనయ కరుణాత్మక, రసవీరం బనఁగఁ బరఁగు రసికోత్సవ మై. ౧౧౦
చ. చతురచళుక్యనాయకుని చారుతర త్తరవారిధార న
ద్భుతపద మొంద వల్లభుఁడు పోయెడుఁ దోడనె కూడఁ బోయెదన్,
సుతు లనిశ స్తనంధయులు సు మ్మని దాదికిఁ జెప్పి ప్రజ్వల
చ్చితిశిఖియంకపీఠమును జెందె నరాతివధూటి పోరిలోన్. ౧౧౧

## యుద్ధవీరము

క. పేరుకొని పోరిలోన న,పారపరాక్రమము నుభయబలములు వొగడన్
దోరంబుగ విహరించు న,దారత రణవీర మనఁగఁ దనరుఁ గృతులన్. ౧౧౨
మ. అరుదారం బరగండభైరవుఁడు వీరాకారుఁ డై వైరిభూ
వరుఁ దుండించి ఘృతాచికిం బ్రియునిగా వాలించు, విద్వేషమ
ష్కరు దూలించి తిలోత్తమావిటునిఁగాఁ గల్పించు, నత్యంతమ
త్సరు రంభారమణీయుఁ జేయు నసిచే సంగ్రామరంగంబునన్. ౧౧౩
ఆ. దానవీరమునకుఁ దగుపాత్రమును, దయా
వీరమునకు దీనపూరుషుండు,
యుద్ధవీరమునకు బద్ధవైరంబు నా
లంబనములు భూతలంబునందు. ౧౧౪
క. దానస్తవనంబులుఁ బటు, దీనాలాపములు సమరదృప్తపటహాని
స్వానంబులు వరుసను సం,స్థానోద్దీపన విభావసంజ్ఞము లరయన్. ౧౧౫
ఆ. పటుముఖప్రసాదబాష్పశస్త్రాదులు
వరుసఁ దదనుభావవర్గ మండ్రు;
సాత్త్వికములు పులకసంఘాత వైవర్ణ్య
ఘర్మబిందువితతి క్రమముతోడ. ౧౧౬
క. క్షితి దానదయారణ సం,గతులను సంచారికములు గర్వ సదైన్యా
కృతి హర్షంబులు మొదలగు, వితతయథోచితనియోగవిధి నెఱుఁగఁ దగున్. ౧౧౭

## భయానకము

క. ఉక్తవిభావాదులఁ బ్ర,వ్యక్తం బగుభయమయగు భయానక మహితో
ద్రిక్తవ్యాఘ్రాదులు ని,ర్ణిక్తాలంబనము లనఁగ నియతము లయ్యెన్. ౧౧౮
చ. వితతభయానకం బయినవిశ్వనృపాలుపతాకవోలె మ
త్పతియు వరాహలాంఛనము దాల్చిన నున్నతి కెక్కి దండభా
సతయును నంబరాభరణసంపదయు న్గని యెల్లవైరులన్
మతి దెరలించు నంచు వెతమాయ లొనర్తురు భీరు లద్రులన్. ౧౧౯

తే. వలయు నుద్దీపనవిభావవర్గ మరయ
సత్త్వగజహయపటహనిస్వనము లంద్రు
కలుగు ననుభావములు సాత్త్వికములు దలఁప
భయ విమోహాదిసంచారిభావచయము. ౧౨౦

## బీభత్సము

క. వరుసవిభావాదులచేఁ, బెరుఁగు జుగుప్సయ తలంప బీభత్స మగున్
బరువడి రెండగు హేయా, చరణమున విరక్తివలనఁ జను నెఱుఁగంగన్. ౧౨౧

## జుగుప్సాబీభత్సము

చ. జరపక విశ్వనాథునకు సత్యము దప్పినరాజు రాజ్యసం
హారణము నొంది దీనుఁ డయి యార్తి నెనంగొను మేనిపుండ్లనుం
బురు వగురక్తపూరముల బ్రుంగి పయింబయి నంతకంతకున్
దొరఁచెడిపుర్వులం గెలికి తోడుచు వేఁడును రచ్చపట్టులన్. ౧౨౨

## వైరాగ్యబీభత్సము

ఉ. ఎప్పుడుఁ గాఱుచొంగలకు నెత్తినచిప్పయుఁ బోని మోవియున్
జిప్పిలి రోతఁగాఁ గడుపుచీలినకప్పయుఁబోని యచ్చటున్
దప్పక సొమ్ముగాఁ దనరఁ దప్పుల మాటల కర్జమంచు నో
రొప్పులు వల్కు శాత్రవుల నొల్లఁడు విశ్వనరేంద్రు డూఁకొనన్. ౧౨౩
తే. అతిజుగుప్సితములు నప్రియంబులును నా
లంబనములు, మదికి లాగు గాని
పూతిగంధవర్గములు తదుద్దీపనా
ఖ్యములు నాఁగ నెందు నతిశయిల్లు. ౧౨౪
క. వదనాక్షి ఘ్రాణ రద, చ్ఛద కూణన విధులపేరఁ జను ననుభావా
స్పదము లనంగాఁ, దదుచిత, సదమలపులకాదికములు సాత్త్వికము లగున్. ౧౨౫
తే. అందు సంచారిభావంబు లనఁగఁ బరఁగు
సమచిత్తోద్వేగనిర్వేదశంకనములు
భయ విషాదామయాహ్వయప్రభృతికములు
చతురు లెఱుఁగంగఁ దగు నంద్రు కృతులయందు. ౧౨౬

## అద్భుతము

క. జనితవిభావాదులచే, ననుగత మగు విస్మయంబ యద్భుత మనఁగాఁ
జను, నాలంబన మశ్రుత, వినుతచమత్కార మనఁగ విశ్రుత మయ్యెన్. ౧౨౭
మ. శశికాంతంబులు సంతతార్ద్రితఁ గనుం జక్రాచలాగ్రంబునన్,
భ్రశమం బొందు నితాంతసంతమసముం బాతాళగేహంబునన్,

భృశసంఫుల్లతఁ జేకొనుం గుముదినీబృందంబు మందాకినిన్,
విశదంబైన చళుక్యభూవిభుయశోవృద్ధిప్రభావంబునన్. ౧౨౮
తే. పరుస నుద్దీపనవిభావవర్గ మండ్రు
మేదురాశ్చర్యతరవర్ణనాదికములు,
చక్షు రానన గండ విస్ఫారణాదు
లడరు ననుభావములు నాఁగ నభిమతములు. ౧౨౯
క. పులక స్వేద ప్రమదము, లలవడు సాత్త్వికము లనఁగ, హర్షావేగా
దులు సంచారులు గాఁ జను, నలవడ యోజింపవలయు నద్భుతయోగతులన్. ౧౩౦

శాంతరసము

క. శమము విభావాదులచే, నమరం బరిపుష్టమైన నది శాంత మగున్,
సమకొను నాలంబన మన, నతులము శాశ్వతము నైనయజపద మరయన్. ౧౩౧
శా. దంభాచారము లుజ్జగించి రిపుగాఢక్రీడ నిర్జించి లో
శుంభద్విద్యలఁ జేర్చి సద్గుణములన్ శోభిల్లి శక్తిత్రయా
రంభం బొప్పఁగ రాజయోగవిమృఁ డై బ్రహ్మప్రబోధ స్థితిన్
శంభుశ్రీచరణార్చలం బ్రబలు విశ్వేశ్వరుం డెప్పుడున్. ౧౩౨
క. వేదాంతచతురసంభా, షాదితకౌతూహలంబు లుద్దీపనముల్
భేదేతరసమదర్శన, వాదము లనుభావములు శివప్రసరంబుల్. ౧౩౩
క. రోమాంచస్తంభాదులు, నేమపు సాత్త్వికము లండ్రు, నిర్వేదము వి
ద్యా మతి ధృత్యాదులు నభి, రామవ్యభిచారిభావరచనం జెందున్. ౧౩౪
సీ. శృంగార ముత్పలాంచితము విష్ణుఁడుగర్త, తెలుపుహాస్యము గణాధిపుఁడు వేఁడు,
కరుణ కాపోయంబు కాలుఁడు పతి, రౌద్ర మవ్యక్తరక్తంబు హరుఁడు విభుఁడు
వీరంబు గౌరంబు వృత్రారి పతి, భయా నకము ధూమ్రము మహాకాలుఁ డీశుఁ,
డసితంబు బీభత్స మధిపతి నంది, యద్భుతము హేమాభ మంబుజభవుండు
తే. భర్త, శాంతంబు నిర్మలస్ఫటికనిభము
పరఁగునధిదైవతము బరబ్రహ్మ మండ్రు;
వివిధరసశాస్త్రవేదు లై వెలయునట్టి
కవుల కివి యెల్ల నెఱుఁగుట కర్జమెపుడు. ౧౩౫
ఆ. ప్రథమరసము సామభవము వీరంబు ఋ,గ్వేదసంభవంబు, వెలయురౌద్ర
రస మథర్వనిగమరచితంబు బీభత్స, మది యజుఃప్రసూత మండ్రు బుధులు. ౧౩౬
తే. అది శృంగారజాతంబు హాస్యరసము, రూఢరౌద్రోద్భవంబు కారుణ్యరసము,
పుట్టె వీరంబువలన నద్భుతసమాఖ్య, మడరు బీభత్సమునను భయానకంబు. ౧౩౭
క. శాంతము సర్వోత్తరరుచి, మంతం, బట్లగుట వైరమైత్రులు లే, వీ
చింతన మెఱుఁగనికవి కవ, గంతవ్యం బగుసె రసవికాసప్రతిభల్. ౧౩౮

తే. మున్ను శృంగారబీభత్సములకు నొంట;
దరులు తమలోన వీరభయానకములు;
సమవిరోధంబు రౌద్రాద్భుతముల కెపుడు;
హాస్యకరుణంబులకుఁ బగ యనుదినంబు. ౧౩౯

చ. తమతమవంగడంబులకుఁ దప్పనిభావకదంబకంబుచే
నమరు రసంబు; లంగకము లన్నిటికంటెఁ బరిస్ఫుటాకృతిన్
బ్రమద మొనర్చు నెద్ది యది ప్రత్యయ మంగి; రసప్రవృద్ధికిన్
గ్రమమున నిత్తెఱం గెఱుఁగు కల్పన యొప్పుఁ గవిత్వసిద్ధికిన్. ౧౪౦

క. సుఘటితపదార్థభావా, లఘుతరరసవత్ప్రబంధలంపటుఁ బతి భూ
మఘవుఁ డని నుతి యొనర్తురు, రఘురామునిఁబోలెఁ బరశురామునిఁబోలెన్. ౧౪౧

ఉ. తోయజమిత్రతేజు గుణదోషవివేకనవీనభోజు వి
ద్యాయన కంటకారసికహర్త మహారథినీవిహర్త గో
పాయితబంధువర్గు బలభగ్నపరాచలదుర్గు నున్నమ
ద్రాయకటారిసాళువధురంధరు సత్ఫలవద్వసుంధరున్. ౧౪౨

క. నారీజనమారుఁ జమూ, వారీనిపతితవైరివారణు నానా
సూరిహితవితరణగుణున్, గౌరీపతిచరణకమలగంధానందున్. ౧౪౩

మాలిని. సకలనిగమవేదిన్ జారుసంగీతమోదిన్
సకరుణదృఢచిత్తున్ సత్వసంజాతవృత్తున్
నికటనిధిసమాజున్ నేతృసంపద్విడౌజున్
గుకవిజనవిదూరున్ గుంతితారాతివారున్. ౧౪౪

గద్యము—ఇది శ్రీమదుమారమణచరణారవిందవందన గోవిందామాత్యనందన వివిధ బుధవిధేయ విన్నకోట పెద్దయ నామధేయ రచితంబైన కావ్యాలంకార చూడామణి యను నలంకారశాస్త్రంబునందు రసప్రపంచప్రకటన సముద్దేశంబన్నది ద్వితీయోల్లాసము.

---

# తృతీయోల్లాసము.

క. శ్రీగోలాభీలాయత, గోలధ్వజుఁ గుపితయువతికుసుమధ్వజుఁ జి
న్మూలస్థిత వృషభధ్వజుఁ, దాలధ్వజు నుగ్రసమర తత్పరకేలిన్. ౧

శా. శృంగారాదిరసోదయంబునకు సంసిద్ధాస్పదం బైన త
ద్రంగన్నాయకనాయికానిచయముం దత్తద్గుణశ్రేణిచేఁ
బొం గారఁ న్వివరింతు నేర్పడ సముద్భూతప్రబోధాత్ము లె
ల్లం గేడింపక యాదరింపుఁడు, దృఢోల్లాసంబు శోభిల్లెడున్. ౨

## నాయకుఁడు

సీ. శిష్టకులీనత శీలంబు శాస్త్రార్థ వేదిత ప్రజ్ఞావివేకబుద్ధి
యౌవన ముత్సాహ మాత్మదృఢత్వంబు వినయంబు దక్షత వితరణంబు
శౌచంబు శౌర్యంబు జనతానురాగంబు సత్యంబు స్థైర్యంబు సత్ప్రియోక్తి
మానంబు తేజంబు మాధుర్యవృత్తంబు వాగ్మిత బహుకలావాసనాప్తి

తే. స్మృతి కృతజ్ఞత దూషణ మేళనంబు
ధార్మికత్వంబు సౌభాగ్యదశ యనంగ
వెలయుగుణములు విశ్వేశవిభుఁడపోలెఁ
దనరుభూపతి నాయకత్వము వహించు. ౩

## నాయకభేదములు

క. ధీరోదాత్తుండును మఱి, ధీరోద్ధతసంజ్ఞకుండు ధీరలలితుఁడున్
ధీరప్రశాంతుఁడును బెం,పారెడు నాయకులు నలుగు రయ్యైగతులన్. ౪

## ధీరోదాత్తుఁడు

క. ధీరుఁడు గంభీరుఁడు స,త్కారుణ్యుఁడు నన్వయంకృతస్తుతి నిరహం
కారుఁడు నగునాయకుఁ డిల, ధీరోదాత్తుండు నాఁగ ధృతిం బెంపారున్. ౫

ఉ. ప్రోయనివార్థి నెత్తురుల బ్రుంగనిరాముఁడు వంకవిల్లుగాఁ
జేయనిపైడికొండ తనుఁ జెప్ప మదింపనిపెద్ద సౌట్టిచోఁ
బాయనినిక్కువంబులకుఁ బట్టు ధరిత్రిఁ జళుక్యవిశ్వభూ
నాయకుఁ; డమ్మహాగుణసనాథు నుదాత్తత యొప్పు నెప్పుడున్. ౬

## ధీరోద్ధతుఁడు

క. అతికోపనుఁ డతిమత్సరుఁ, డతిగర్వసమేతుఁ డత్యహంకారబలా
న్వితుఁ డాత్మశ్లాఘాోదయ, చతురుఁడు ధీరోద్ధతుండు చంచలుఁడు మఱిన్. ౭

మ. ధర సర్వంకషగర్వముం బిరుదమాత్సర్యప్రవిధ్వంసముర్
బరభూపాలపలాయనప్రకటన ప్రౌఢంబుఁ గ్రోధోదయా
కరముం గ్రూరము నై చళుక్యవిభు నుగ్రవ్యగ్రకేతుస్థితాం
బరఖేలత్కరవాలభైరవసురూపం బొప్పుఁ బోరాటలన్. ౯

## ధీరలలితుఁడు

క. స్మరభీతుఁడు మానవతీ, పరవశుఁడును భోగలోలుపవ్రతుఁడును సుం
దరుఁడును నయ్యెడునాయకుఁ, డరయంగా ధీరలలితుఁ డన విలసిల్లున్. ౯

చ. అరు దగురాజ్యతంత్రము నయప్రియుఁ జేతికి నిచ్చి విశ్వ భూ
వరుఁ డఖిలాంగసుందరిగుం వారణయానయుం నిత్యదృఙ్మనో
హరయును నై తనర్చువిజయాంగనతోడిద లోక మై నిరం
తరము సుఖించుచుండు నవదర్పకుఁ డై సుభగత్వ మేర్పడన్. ౧౦

## ధీరశాంతుఁడు

క. సుభగుఁడు శుచియు వివేకియుఁ, నభిమానియు మృదువు సద్ద్విజాతులవంశ
ప్రభవుండును నగునాయకుఁ, డభిమతముగ ధీరశాంతుఁ డనఁబొగడొందుర్. ౧౧

ఉ. శ్రీయుతు లై యశేషసమచేతను లై వివిధాగమాదివి
ద్యాయతనంబు లై రసికు లై సుఖు లై తరుణీవిహారపు
ష్పాయుధు లై చరింతురు ధరామరు లట్టుల కాదె రాజనా
రాయణదేవుచేఁ బడిన నచ్చెరువే యభిరామసంపదల్. ౧౨

## శృంగారనాయకులు

క. ఈనలువురు రసనవకస,మానస్థానముల జననమహిమంబులకుర్
మానుగ శృంగారరసా, ధీనులు మఱి నలుగు రండ్రు తెలియఁగ వలయుర్. ౧౩

క. వనితావిహారణదశలం, దనుకూలుఁడు శఠుఁడు దక్షిణాఖ్యుఁడుధృష్టుం
డును నన నలుగురు నాయకు, లనయము శృంగారమునకు నర్హులు చెప్పన్. ౧౪

## అనుకూలుఁడు

క. ఏకవధూరక్తుండై, యేకొఱఁతయు లేక నుమసమీహితగతులన్
గైకొని మెలఁగెడు నాతఁ డ,నాకులుఁ డనుకూలనాయకాఖ్యం బడయుర్. ౧౫

శా. సద్రాగాన్వితగా నొనర్చుఁ గరసంచారోపచారంబులర్
భద్రశ్రీపరిలిప్తఁ జేయుఁ సుమనఃపర్యాప్తఁ గావించు యు
క్తద్రవ్యప్రతిపత్తిచే వసుమతింగాఁ జాలఁ బాలించు ని
ర్నిద్రప్రీతిఁ జళుక్యనాథుఁడు ధరిత్రీకాంత నెల్లప్పుడుర్. ౧౬

శఠుఁడు

క. ఒరు లెఱుఁగకుండ నప్రియ, కరుఁడు శఠుం డనఁగఁ బరఁగుఁ గడుఁ గపటకళా
కరుఁడు నిజప్రియవనితా, పరితాపప్రదుఁడు క్రియలఁ బరికింపంగన్. ౧౭

ఉ. వల్లభ యైనకీర్తిసతివార్తల నిమ్మల విఁచు విశ్వభూ
వల్లభుఁ డర్థ మర్థులకు వావిరి నిచ్చుట కీరసంఖ్య సం
ధిల్లదు లచ్చి కేయెడలఁ దీయపుఁజూపులలోనఁ గెంపు రం
జిల్లున కాక, ధీరులకుఁ జిత్తమునం దొకవింత కల్గునే. ౧౮

దక్షిణుఁడు

క. పెక్కండ్రు ప్రియలయందున్, జక్కని మొగమోట యొక్క చందంబున నిం
పెక్కిన దక్షిణనాయకుఁ, డక్కజ మెఱుఁగంగవలయు నది చతురులకున్. ౧౯

మ. అరు దెం తైనఁ జళుక్యవిశ్వవిభు సెయ్యం బొక్కచందంబునం
గర మొప్పారుచు నుండు సైంధవిపయిన్ గాంధారిపై నించు
ఘూర్జరిపై మాళవిపై వరాళికపయిన్ సౌరాష్ట్రిపై గౌడిపై
సరి నీమాట లరాతిరాజతనయా శంకామతిం జేయుచున్. ౨౦

ధృష్టుఁడు

క. స్పష్టాపరాధపిశునుఁడు, దృష్టాస్యారచితరతుఁడు ధృష్టుం డగు; సం
దష్టాధరాదిదర్శన, పుష్టవధూకోపుఁ డభయభూతుం డెపుడున్. ౨౧

చ. ఒరసి చళుక్యభూపతికి నోడినవైరికిఁ గాననంబులోఁ
గరిమదగంధము ల్గుటిలకంటకరేఖలు ఘర్మితాంగమున్
సురత వికారలీలఁ దలచూపినఁ దత్సతి యల్కఁ జెందెఁ; ద
ద్వరుఁడునుఁ దేటగాఁ దెలిపె; వక్రత నమ్మద యెన్ని చెప్పినన్. ౨౨

శృంగారనాయక సహాయులు

తే. పృథివి నేతత్సహాయులు పీఠమర్ద
విట విదూషక చేటక విదితనామ
లోలి నలువురు; వీరి యయ్యుచితగతులు
వలయుఁ దెలియంగఁ దద్గుణవర్తనముల. ౨౩

తే. పీఠమర్దుండు దగుఁ గార్యపేశలుండు
వాని కించుక తక్కువవాఁడు విటుఁడు
తొడఁగి నవ్వించునేని విదూషకుండు
చేటకుఁడు సంధికల్పనసిద్ధికరుఁడు. ౨౪

నాయికలు

శా. శృంగారప్రథమప్రభాసకము లై చెన్నారుశోభాదులన్
బొంగారం బ్రకటిల్లు నాయికల యందుద్భూతప్రకారంబులన్

రంగల్లక్షణలక్ష్యవృత్తిఁ గని లో రాగిల్లు టొప్పున్; మద
త్వంగస్నిరసవాదరోషముల చేతం గల్గునే సౌఖ్యముల్. ౨౫
క. నాయికలు స్వకీయయుఁ బర, కీయయు సాధారణియును గీర్తిత లగుదుర్
పాయక వారలవలన గు, ణాయత్తార్థములు గలుగు; నవి యెఱుఁగఁ దగున్. ౨౬

## స్వీయ

క. సతియును శీలార్జవసం, గతయుం గులవతియు నఖిలకల్యాణగుణా
న్వితయును లజ్జాళువు నగు, నతివను రసికులు స్వకీయ యందురు కృతులన్. ౨౭
క. కులవతియును శీలార్జవ, కలితగను సతియును నశేష కల్యాణగుణో
జ్జ్వలయును లజ్జాళువు లగు, నలినీలకచన్ స్వకీయ యందురు కృతులన్. ౨౮
చ. అలఘుచరిత్రలున్ శుభగుణాన్వితలున్ గురుబంధుమిత్రవ
త్సలలును దర్పహీనలును ధర్మవిధిజ్ఞలు రూపసంపదా
కలితలు నైనదారికలఁ గానిక లిత్తురు సంధివేళలన్
నలినహితేందువంశనరనాథులు విశ్వనరేంద్రభర్తకున్. ౨౯

## పరకీయ

క. పరకీయ రెండుదెఱఁగులు, కరపరిణీతయును బేరుగలకన్యయు నాఁ
బరిణీత రాగరసములఁ, బరికల్పిత గాదు సత్ప్రబంధములందున్. 30
ఆ. కన్య పరిణయాభికాంక్షచే రాగాంగ, మగుట రసమునందు నగు నుతింపఁ
బిన్నయయ్యుఁ దనకుఁ బెండ్లి యామాట లా, లించు నాలఁ గన్య లీలఁ బోలె. 3౧
ఉ. సాలకపాలభాగలును నంకురితస్తనబింబలున్ విక
ల్పాలసబాలలీలలును నల్పవివేకలు నైనవైరిభూ
పాలురముద్దుఁగన్నియల భాగ్యము నెన్నుదు రర్థి విశ్వభూ
పాలునిరాజ్యలక్ష్మికి సపత్నిక లయ్యెద రంచుఁ బ్రాశ్నికుల్. 3౨

## సాధారణనాయిక

క. సాధారణి యన గణిక క, ళాధారేయాత్మ కపటలంపట లీలా
మాధుర్యవిధాయిని దుర, గాధమనోవృత్తి దానిగతిఁ దెలియంగన్. 33
చ. అనిఁ బరగండభైరవభుజాసివడిం బడి పుణ్యమూర్తులై
వినుతగతిం జరించు బలుఁవీరులఁ గైకొని యేపు మీఱ ము
న్ననఁగి పెనంగి కూర్చుసువిటావలులన్ దొలఁగించి రప్సరో
వనితలు; పైఁడిపెట్టి విలువం గలవే వెలయాండ్రకూరుముల్. 3౪

## స్వీయాభేదములు

క. చతురస్వకీయగుణసం, గతి ముగ్ధయు మధ్యయుం బ్రగల్భయు ననఁగా
రతిపతితంత్రంబులచేఁ, బ్రతిపాదిత లైరి మూఁడుభంగుల వరుసన్. 3౫

## ముగ్ధ

క. జవ్వనము లోన నడుగిడ, మవ్వపుమది సిగ్గుచేత మరుని గెలిచి లో
నివ్వటిలఁ, గఱద లెఱుఁగని, యవ్వేలఁదుక ముగ్ధయనఁగ నభిమత యయ్యెన్. ౩౬

సీ. ఆత్మసేమంబున కట్టాడుచనుఁగవ యలఁతిపయ్యెదచాటు నాసపడఁగఁ
గన్నుఁగ్రేవలఁ గ్రాలఁగడఁగు వాలికచూడ్కి సోబగారుసిగ్గుతో సుడివడంగఁ
బోరిపోరి బొమలపైఁ బొలుపారునలకలు చేతికెంజాయతోఁ జెలిమిసేయ
నలకనైతోఁచు నెన్నడు మించునూఁగారు మాటున నొక్కింత మఱుఁగుపడఁగ

తే. నంగజుఁడు వేడ్క లోనఁ జిట్టాడ నగరు
ముగ్ధ డెందంబుఁ గనుఁగొని ముదము నొసఁగుఁ
జతురలీలల విశ్వేశచక్రవర్తి
యూష్మశరదాగమంబుల నుచితగతుల. ౩౭

## మధ్యనాయిక

క. సంపూర్ణయౌవనోచిత, సంపత్తియుఁ గామినియును సమలజ్జయుఁ బ్రే
రింపఁగ మోహోత్తరరతి, లంపటయు న్మధ్య యనెడులలన దలంపన్. ౩౮

సీ. ప్రస్ఫోన్నతసమాయతాంగవిస్ఫూర్తిపై నిబిడలావణ్యంబు నిట్టత్రోవ
నేపథ్యశృంగారనియమితరచనపైఁ దారుణ్యసంపత్తి దళుకులొత్త
మిళితరాగాభోగమృదుగల్లపాళిపై సమ్మదోద్రేకంబు జాలువాఱ
లాలితలజ్జావిలాసంబుపై సాంద్ర కందర్పదర్పంబు కందళింపఁ

తే. గోమరు మిగిలెడు మధ్యఁ గోర్కులకు నెల్ల
నెల్లయై యొప్పు విశ్వేశవల్లభుండు
భావజక్రీడఁ గవఁ గూడి పరిణమించు
విమలహేమంతశిశిరకాలములయందు. ౩౯

## ప్రగల్భనాయిక

క. అతిరూఢవయోభిమతయు, నతికామావేశమతియు నంగజవిద్యా
చతురయు నతిలీనమనో, గతియును నగువనిత తగుఁ బ్రగల్భ యనంగన్. ౪౦

సీ. పయ్యెదకొంగులోపలఁ బిక్కటిల్లెడు నెవ్వఁగుఁజన్నులనింపుసొంపు
తళుకుతో లజ్జకుఁ దల మీఱి క్రాలెడు నిడువాలుఁజూపుల నిశితగతియుఁ
బ్రణయానులాపసంపత్తిలోఁ గొంకక మున్నాడి యేతెంచు మొక్కలంబు
నొడికంపుఁజేఁతల యొఱ పెఱింగినవాత పీడ్పాటుపనిగల వెడఁగుదనముఁ

తే. గలిగి తమకించునెడలఁ బ్రగల్భఁ దగిలి
వేడ్క విహరించుఁ జాళుక్యవిశ్వవిభుఁడు
చారువర్షావసంతర్తుసమయములను
బాలితాఖిలరాజ్యవైభవ మెలర్ప. ౪౧

## ధీరాదినాయికాభేదములు

క. ఆరయ ముద్దియ వెలిగా, గారవమున మధ్యయును ప్రగల్భయు వరుసన్
ధీరయు ధీరాధీరయు, ధీరేతరయును ననంగ ద్రివిధాఖ్య లిలన్. ౪౨

### ధీర

క. తెల్లపుటపరాధము గల, వల్లభుఁ గని వినయమృదుల వక్రోక్తులచే
నుల్లసము దోఁపఁ బలికెడు, నల్లలనకుఁ బేరు ధీర యండ్రు రసజ్ఞుల్. ౪౩
చ. లసితము లైనలేఁజెమరులన్ జెలువారెడి మేనితావియున్
బొసఁగ విలోచనాంతములఁ బొంపిరివోయెడువింతరాగమున్
వసుమతి గారవించుచు శ్రమంపడ కుండిన నేల కల్గు నిం
పెసఁగఁగ నంచుఁ బల్కెఁ దరళేక్షణ యోర్తు చళుక్యవల్లభున్. ౪౪

### ధీరాధీర

క. నేరమి చేసినపతిఁ గ, న్నారం గని లోచనముల నశ్రువు లొలుకన్
దోరపువక్రోక్తులఁ దగ, ధీరాధీరాఖ్య పలుకు ధృతి కడ కొదవన్. ౪౫
చ. చతురత విశ్వభూవిభుఁడు జాదులు మాళవి కిచ్చె, నిచ్చినన్
బ్రతిథ వహించి లాటి పిదపం దన కిచ్చినపాటలంబులం
బతిపయిఁ బాఱఁ జిల్కి నవబాష్పకణంబులు రాల రోషభా
షిత యగు చుండె; నత్తెఱఁగు చిత్తమునం బరికించెనో కడే. ౪౬

### అధీర

క. అపరాధి యైనపతిపై, నుపచితరోషమున నశ్రు లొలుకఁగ నుద్య
ల్లపితము లుల్లసములుగా, నెప మిడుచు నధీర పలుకు నెయ్యము కలిమిన్. ౪౭
చ. ఒదవెడువేడ్కఁ దన్ను మును నూఱడఁ బల్కి మొఱంగి చన్నచ
క్కదనములు రోషబాష్పకణగద్గదభాషలచేతఁ జెప్పుచున్
ముదిత చళుక్యవల్లభునిమ్రోల: దనర్చుట చూచి నెచ్చెలుల్
మదనునిచేఁతకుం దరుణిమానములేఁతకు నొచ్చి రిచ్చలన్. ౪౮

### ప్రగల్భధీర

క. అలుక దలచూపకుండెసు, పలుకులుఁ జేఁతలును నచ్చుపఱుచుచు దయితున్
గలితాపరాధు మదిలో, నలయించుఁ బ్రగల్భధీర యర్హక్రియలన్. ౪౯
చ. వెలి నపరాంగనాప్తుఁ డగువిశ్వనృపాలునిఁ బ్రీతి చూపుచూ
పుల నలరింపదయ్యె మణిపుత్రికఁ జూచుట గారణంబు గాఁ,
జిలుకకు నత్తఱిం జదువు చెప్పుకతంబునఁ బల్కదయ్యెఁ, దో
య్యలి యెదు రేఁగదయ్యెఁ గలహంసికి నెన్నడఁ జూపుచుండుటన్. ౫౦

## ప్రగల్భధీరాధీర

క. కినుకయుఁ దాలిమియును జెం, దిన మాటల నాప్రగల్భధీరాధీరాం
గన యుల్లసములపెనఁకువ, తనముఁ బ్రసాదంబుఁ జూపుకగవరి దలఁపన్. ౫౧

మ. అతివా నాథుఁ జళుక్యనాథుఁచతురవ్యాపారముల్ విన్న సం
తతమోదంబు జనించు, నంతటన ధూర్తక్రీడ లాలించినన్
బ్రతిపన్నం బగుఁ గోప, మవ్వ డటు సోత్ప్రాసోక్తికిం జొచ్చినన్
హితమందస్మిత మబ్బు మోమునను ము, న్నీ కౌతుకం బెట్టిదో! ౫౨

## ప్రగల్భాధీర

క. కూరిమిపతి తన కోపము, వారించినఁ డోఁచి పిదప వచ్చి యతనిఁ దా
నూరార్చునది ప్రగల్భా, ధీర యనం బరఁగు రసికదృష్టికి నరయన్. ౫౩

శా. ఆపంచాయుధు పెంపు నాహిమకరాహంకార మాకోకిలా
టోపంబుం దరియింప లేక సతి నిందుంగార్మితో ధైర్యసీ
మాపర్యాప్తికి నెగ్గ గా మణిరణన్మంజీరపుంజీకృత
క్ష్మాపవ్రాతకిరీటు మ్రొక్కి నిలిచెం జాళుక్యవిశ్వేశ్వరున్. ౫౪

క. జ్యేష్ఠయు మధ్యాఖ్యయును గ, నిష్ఠయు ననఁ గృతులఁ బరఁగు నెలఁతలపను నీ
నిష్ఠితగుణములు వరుసఁ బ్ర, తిష్ఠితములు సరసగతులఁ దెలియఁగవలయున్. ౫౫

## అష్టవిధనాయికలు

తే. కలరు స్వాధీనపతికయుఁ ఖండితయును
బ్రోషితప్రియయును విరహోత్కలికయు
నాల నభిసారికయుఁ గలహాంతరితయు
సంప్రవాసిని వాసకసజ్జికయును. ౫౬

క. ఈయెనిమిది శృంగార వి, ధాయి దశాకలిత లైనతరుణుల తెఱఁగుల్
పాయక లక్షణలక్ష్యో, పాయంబులఁ దెలియవలయుఁ బ్రౌఢప్రతిభన్. ౫౭

## స్వాధీనభర్తృక

క. మధురానువర్తి యగు తన, యధిపతిచే నెప్పు డర్పితాభరణాదిన్
బ్రధిత యగుచుండు కోమలి, కథితస్వాధీనభర్తృకాసంజ్ఞ యిలన్. ౫౮

మ. ప్రతిపక్షప్రతిపాదితక్షతులు చూపన్ జెప్ప లే వెన్నఁడున్
బ్రతికాలస్వకృతోత్సవాభరణభద్రశ్రీవిమిశ్రక్రియా
చతురత్వం బలగారుచుండు నెపుడున్ జాళుక్యవిశ్వేశ్వరుం
బతిగా నోచిన రత్నగర్భయనులాభం బొప్పఁబో పృథ్విక్రిన్. ౫౯

## ఖండిత

క. రే యెల్ల నన్యసురత, శ్రేయస్కుఁడు కృతమనోజచిహ్నుఁడు నగున
న్నాయకుని పీడ నాడెడు, నాయంగన ఖండితాఖ్య యగుఁ బరికింపన్. ౬౦

శా. చారుస్పర్శసమీరసూచితతనూసౌరభ్య మింపారఁ గా
శ్మీరీసంగమశంసి యైనఁ గని గాసిల్లెం బ్రకాశాంగజా
కారుం డై విలసిల్లువిశ్వవిభుపైఁ గర్ణాటి గాశ్మీరితో
నారాజన్యుఁ డెఱుంగు టచ్చెరువె తద్వ్యాజమోహాఖేదంబులన్. ౬౧

## ప్రోషితభర్తృక

క. పతి పరదేశాంతర పరి, గతుఁ డై క్రమ్మఱక యచటఁ గడు మసలుటయున్
మతిఁ దుందుడుకుం జెందెడు, సతిఁ బ్రోషితభర్తృక యనఁ జను నండ్రు బుధుల్

ఉ. శ్రీశుఁ జళుక్యవిశ్వధరణీశు భజింపఁ దలంచి చన్న యా
త్మేశుఁడు వచ్చునంతకుఁ బురేందిరయుం బ్రభవించెఁ దోడుతో
నాశలమాయుపాటు మలినాంబరభావము నంగవర్ణసం
క్లేశవికారమున్ నిరవలేపతయున్ సుమనోవిముక్తియున్. ౬౩

## విరహోత్కంఠిత

క. పరుఁ డనురక్తుం డయ్యు ని, తర మగు పని గలిగి రాక తడయుటయు విభా
వరియందు నడలఁబొలఁతుక, విరహోత్కంఠిత యనంగ విశ్రుతి కెక్కున్. ౬౪

చ. నవరసగీతవాద్యనటనంబు రుచించిన రాక తక్కెనో,
వివిధకవిప్రబంధరసవీచులఁ దేలి తలంపఁ డయ్యెనో,
గవ యగురాచకార్యములు గల్గెనొ కాక, చళుక్య మేదినీ
ధవుఁ డిటు లేటికిం దడయుఁ దారలు వెల్లఁదనంబు గూరెడున్. ౬౫

## అభిసారిక

క. ముంగిటికై నడ సాగ న, పాంగము తిమిరంబె దిశల నడఁపఁగ దమితోఁ
జెంగట పతికడకుం జను, నంగన యభిసారికాహ్వయంబుం బడయున్. ౬౬

మ. క్రియ నుద్దామఘనాఘనాకలితముం గీలాలధారాళమున్
భయదోద్యచ్ఛతకోటిఘోషణము నై భాసిల్లఁ బోఁ గాటకోఁ
బ్రియలీలాచపలావలోకములు శోభిల్లం బ్రసన్నాకృతిన్
జయసీమంతిని వచ్చి మెచ్చి కలయుం జాళుక్యవిశ్వేశ్వరున్. ౬౭

## కలహాంతరిత

క. కలహాంతరిత యనంగా, వలవనిపొలయల్కఁ జేసి వల్లభుతోడం
బలుకక పిమ్మట మదిఁ గో, నలఁదురునెలఁతుకకు నామ మండ్రు రసజ్ఞుల్. ౬౮

చ తొలితొలి నల్గి విశ్వవిభుతో మనసెచ్చెలి; రిత్తయల్కయం
దెలియఁడ రాజు; దర్పకుఁడు తీపుల విల్లదె యెక్కువెట్టెఁ; గ్రొ
వ్వెన్నెల వాడ తెంచె; నింకఁ గరణీయము సఖ్యము సేయు నేర్పు తో
య్యలి యలికేందురేఖకును నవ్విభుపాదపయోజలక్ష్మికిన్. ౧౯

## విప్రలబ్ధ

క. పంచినయెడ కేతేరక, వంచించిన దయితుతో వివాదము సంపా
దించి చెలితోడ దుఃఖిత, దంచిత యగు విప్రలబ్ధ తత్పరబుద్ధిన్. ౨౦

శా. చాళుక్యక్షితినాథ ని పనుపునన్ సౌరాష్ట్రి యేతెంచె; నీ
వేలా జాలము సేసి రామికి మరుం డిష్వా సముం దాల్చె; నా
యాలాపంబులు నమ్మ వేనియును, రమ్మా చూతు కన్నీటిచే
జాలం బంకిలభాగ మైనవిలసత్సంకేతసద్మస్థలిన్. ౨౧

## వాసకసజ్జిక

క. భాసురుఁ డై పతి నగరికి, మాసరమున వచ్చు నెఱిఁగి మణిమండలవి
న్యాసాలంకృత యగు సతి, వాసకసజ్జిక యనంగ వల నై యొప్పున్. ౨౨

మ. పరిలేపస్ఫుటహేమకుంభకుచయున్ బ్రాలంబముక్తాఫలాం
బరవిభ్రాజితమూర్తియున్ వికచపుష్పస్రగ్వితానాంతర
స్ఫురితాకారయు నై వెలుంగు పురి సంశోభిల్లె విశ్వావనీ
వరుఁ డేతెంచె జయాప్తితో ననెడు నీవార్తావిశేషశ్రుతిన్. ౨౩

## దూతికలు

తే. వీరలకు దూతికలు ప్రతివేశినియును
జెలియు దాసియు ధాత్రియు శిల్పినియును
లింగినియుఁ గారువును వీరు లేక యున్నఁ
దాన యైనను నగుఁ బ్రియతంత్రములకు. ౨౪

క. శ్రీయుతు లగునీనాయక, నాయిక లిరువాగు, భాజనంబులు శృంగా
రాయతజననమునకు నివి, పో యెఱుఁగం దగినయవి సుబుద్ధుల కెల్లన్. ౨౫

సీ. రచితసహాయాంగరసపరివ్యక్తియుఁ బూజ్యాంగికరసానుపోషణంబుఁ
గానివిభావాదికష్టకల్పనమును శత్రుభూతరసాదిసంకరమును
సద్మకాలాదిరసప్రరోహణమును రసభావనామోచ్చరణపదంబు
ననుచితక్రమశాసనాగ్రహసంచారి భావానుబంధనప్రసరణంబు.

తే. షాడముభావరసాభాసములు దలంప
వీనిఁ బరికించి తొలఁగించి విశ్రుతముగఁ

గబ్బ మొనరించు సుకవిపుంగవులఁ గాని
యన్యు మెచ్చఁడు రాజనారాయణుండు. ౨౬

మ. చతురశ్రోత్రసుఖాకరామృతపరిష్యందంబు నందంబు నై
క్షితిఁ గావ్యప్రసరంబు వొల్చు నిఖిలక్షేమంకరస్ఫూర్తితోఁ
బ్రతిభావంతులు మెచ్చ లక్షణము నొప్పం జెప్పుదుం బూర్వక
ల్పితశాస్త్రానుగతంబు సంగతముగాఁ బ్రీతిప్రదవ్యక్తిచేన్. ౨౭

శా. దివ్యం బైనకృతిత్రయంబు వివిధోక్తిం బర్వశాస్త్రంబులన్
భవ్యం బైనపురాణవర్గమును వృత్తం బైనవిద్యాప్రపం
చవ్యాపారము నేమిటం గలిగి యక్షయ్యంబు లై పేర్చుఁ ద
త్కావ్యం బెరికి నింపుగా దెలిఁగిచం గల్పాంతరస్థాయి యై. ౨౮

క. సమయజ్ఞుఁడు సమచిత్తుఁడు, సమశబ్దార్థప్రయోగచతురుఁడు భావ
క్రమరసపోషణరచనా, కమనీయప్రతిభుఁ డీల సుకవి యనఁ బరగున్. ౨౯

సప్తవిధకవులు

తే. వాచి కార్థులు శిల్పిక రాచికులును
భూషణార్థియు మార్దవస్ఫురణకరుఁడు
నల వివేకియు ననఁగ సప్తాహ్వయములఁ
గవులు నెగడుదు రీహిత కావ్యములను. ౩౦

వాచికుఁడు

క. ఛలవర్ణగుచ్ఛపిచ్ఛిల, లలితపదాడంబరావలంబనకవితా
సులభవిరచనాచతురుం, డలవడు వాచికుఁడు నా నుదగ్రప్రౌఢిన్. ౩౧

ఆర్థుఁడు

క. మితశబ్ద మమేయ్య నర్థము, సతతవ్యాఖ్యానజాలసక్షమవిపుల
స్థితి నొప్పఁ గవిత సెప్పెడు, నతఁ డార్థుం డనఁగ నెగడు నార్యులసభలన్. ౩౨

శిల్పకుఁడు

క. మహితసుశబ్దార్థంబులు, బహువిధయమకార్థబంధబంధురరచనా
నిహితవిచిత్రము లై చన, విహరించున్ శిల్పకుండు విశ్రుతకృతులన్. ౩౩

రాచికుఁడు

క. ఒదవెడుకృతిపైఁ గలసొబ, గదలక యొండొంక నిష్ట మగు నంబ్బాఁకన్
మృదుమధురరచన సువిశా, రదుఁ డై సాగించునతఁడు రాచికుఁ డెందున్. ౩౪

## భూషణార్థి

క. తివుటపడి నొడువునప్పుడు, వివిధాలంకారసరణి విషువక చవి గా
నవహితుఁడై కృతిచెప్పెడు, కవి యెందును భూషణార్థి కడుఁ బొగడొందున్. ౭౫

## మార్దవానుగతుఁడు

క. సరళము లగుశబ్దములను, విరళము లగునర్థములను వీనులు కింపం
దరళత లేక రసౌఘము, లరుదుగఁ గృతి చెప్పు మార్దవానుగుఁ డెపుడున్. ౭౬

## వివేకి

క. శ్రుతశాస్త్రాలంకార, ప్రతిభుఁడు శబ్దాదిదోషపటుగుణఘటనా
చతురుఁడు వివేకి నాఁ జను, నతఁడు మహాకవిశతంబులందుఁ జయించున్. ౭౭

క. ఛందోలంకారాదుల, పొం దెఱిఁగిన నెద్ది లేక పొసఁగదు కవితా
సుందరత శక్తి యది యా, కందువఁ దగ నెఱుఁగువాఁడె కవివరుఁ డెందున్. ౭౮

తే. శక్తి వెలి యైన కావ్యోక్తి సాధనంబు
లెల్లఁ జీఁకటియింటిలో నిడినసరకు
లెన్ని ఋతువులుఁ గల్గిన నెట్లు పూచు
మహి వసంతాగమము లేక మావిమోక. ౭౯

చ. వినుతయశంబునం గలుగు విశ్రుతనాకనివాస; మయ్యశో
జననము శ్రవ్యకావ్యములసంగతి నొప్పగు; శ్రవ్యకావ్యముం
దనరుఁ గవిప్రభావమునఁ; దత్కవిసమ్మతి లేసి రాజు లే
పున విహరింప; రవ్విభులు పోయినజాడ లెఱుంగఁ బోలునే. ౮౦

## కావ్యభేదములు

తే. అట్లు కవికృత మైన కావ్యత్రయంబు
గద్యపద్యవిమిశ్రసంపాద్య మంద్రు,
నగరముఖ్యాష్టదశవర్ణనముల చేతఁ
బరఁగు నదియును భవ్యప్రబంధ మనఁగ. ౮౧

## అష్టాదశవర్ణనలు.

మ. పుర వారాశి మహీధర ర్తు శశభృ త్సూర్యోద యోద్యాన పు
ష్కరకేళీ మధుపాన మోహాన వియోగ క్షేమ యాన స్వయం
వరపుత్రోత్సవ మంత్ర దూత్య రణదోశ్శైవ్యాక్రాంతి సంకీర్తనా
కర మష్టాదశవర్ణనాన్వితము తత్కావ్యంబు భవ్యం బిలన్. ౮౨

## నగరవర్ణనము

క. దుర్గమ పరిఖా వరణ ని,సర్గబలానీక చతురచాతుర్వర్ణ్యా
నర్గళసంప ద్వన జల, వర్గస్తుతి వలయు నగర వర్ణనమునకున్. ౮౩

సీ. గంభీరపరిఖ నాగస్త్రీల కశ్రాంతకేళీవిహారదీర్ఘిక యనంగ
సుత్తాలసాల మన్యుల కబ్బి దివిఁ బ్రాకఁ జేసినదీర్ఘనిశ్శ్రేణి యనఁగఁ
జతురచాతుర్వర్ణ్య సంఘ మర్థులపాలిరాజితకల్పకారామ మనఁగ
భ్రాంతసుస్థిత మైన భవజూటవాహిని భుక్తిము క్తిప్రదస్ఫూర్తి యనఁగ

తే. నొప్పడును నొప్పరాజమహేంద్రవరము
ధరణిఁ గల్పించె నేరాజు తనదుపేర
నట్టి రాజమహేంద్రునియనుఁగుమనుమఁ
డెసఁగుఁ జాళుక్యవిశ్వనరేశ్వరుండు. ౯౪

## సముద్రవర్ణనము

క. సిరినెలవు, గురుసుధాప్తియు, నరుదారఁగ నజునితండ్రియల్లుఁడు, రత్నా
కరము దనపేరు, జలధికి, సరి గలరే యరయ ననుచుఁ జను వర్ణింపన్. ౯౫

మ. అతిగాంభీర్యము గోత్రగోపనము సత్త్వాటోపమాహాత్మ్యమున్
హితలక్ష్మీసదనత్వమున్ సతతవృద్ధిత ప్రభావంబు ను
న్నతసరోవ్వత్తరణీసనోదయము నానావాహినీసౌఖ్యశా
లితయుం బేర్చుఁ జళుక్యనాథునకుఁబోలెన్ జూడ నంభోధికిన్. ౯౬

## పర్వతవర్ణనము

క. అచలతయును నున్నతియును, ఖచరవినోదోచితియును గనకాది ఖనీ
రుచితయును మొదలుగాఁగల, ప్రచురతలు నుతింపవలయుఁ బర్వతమునకున్. ౯౭

మ. చెలువారున్ నవరత్నపాదకటకశ్రీచేత, గంధర్వమం
గళ నాదంబులతోడ నొప్పగు, నభంగస్థైర్యవృత్తిన్ మహా
బలు నైనం బ్రహసించు, భూభరణశోభం దాల్చి మి న్నందుచున్
గులశైలంబులపెంపు విశ్వవిభుతోఁ గూర్పం దగున్ ధీరతన్. ౯౮

## వసంతవర్ణనము

క. అంకురపల్లవపత్త్రస,మాంకితముకుళప్రసూనహారిఫలములన్
బొంకము లగువనములు ని,శ్శంకముగ నుతింపఁబడు వసంతమునందున్. ౯౯

మ. స్మరబాణంబులు వాఁడు లయ్యె, గుణవిస్ఫారంబు ఘోరంబుగా
నెరసెం, గీరము లంగజాతబిరుదావళికంబు గీర్తించె, మిం
చె రసాలాగ్నులు, పల్లవార్చులు దలిర్చెన్, విశ్వనాథావనీ
వరుతో నల్గుట చెల్లునే యనఁత యై వామాక్షి కీపట్టునన్. ౧౦౦

## గ్రీష్మవర్ణనము

క. ధారాగృహముల నవఘన, సారాదుల గంధసారసరసపటీరో
శీరవ్యజనాదుల నిం,పారఁగ వర్ణింపఁ దగు నిదాఘాగమమున్. ౧౦౧

శా. ధారామండిత సాలభంజికలచేతన్ జిత్రయంత్రోద్గళ
త్సారామోదతుషారపూరములు విస్తారంబులై పర్వఁ గాం
తారూఢేక్షణదీప్తితోడన చళుక్యాధీశుపైఁ జంద్రవం
శారాధ్యుం డని చంద్రికారసము నింపైఁ గ్రాలుచందంబునన్. ౧౦౨

## ప్రావృడ్వర్ణనము

క. తటిదటన మేఘపటలీ, ఘటితాంబరశక్రచాపకరకావ్రాత
స్ఫుటధారాసారాదివి,కటత నుతింపంగవలయు ఘనకాలమునన్. ౧౦౩

మ. చపలాలోకములుం బయోధరగరిష్ఠశ్రీయు సద్యోల్లస
ద్విపులానందము నంబరాభరణసద్వేషంబునుం గంకణ
స్థపుటారావము సొంపు మీఱఁ దగువర్షావేళ విశ్వేశ్వరా
ధిపు సేవించుప్రగల్భకామినిగతిన్ దీపించు భావింపఁగన్. ౧౦౪

## శరద్వర్ణనము

క. వెన్నెల సొంపును జుక్కల, చెన్నును దెలుపారుదెసలచెలువంబులు వి
చ్ఛిన్నము లగుజలదంబుల, సన్నుతి సేయంగవలయు శారదవేళన్. ౧౦౫

శా. సోమశ్రీలకు వన్నె వెట్టును, ఘనస్తోమంబునం బర్వునా
శామాలిన్యము నోలిఁ ద్రోచు, నవరాజద్రాజహంసావళిం
బ్రేమంబుం బచరించు మానసమునం బెంపై, శరద్విభ్రమం
బామోదప్రద యైనవిశ్వవిభు నుద్యత్కీర్తికిన్ సాటి యై. ౧౦౬

## హేమంత వర్ణనము

క. బలవత్కౌలీయక కం,బళఘనకౌశేయపట్టపటమాంజిష్ఠం
బులఁ జనదు సీతు యువతుల, వలిచన్నులఁ దక్క ననుచు వలయుం బొగడన్.

మ. తరుణీయౌవనగర్వజృంభితకుచోదగ్రోష్మగంధంబులన్
వరకాశ్మీరసాంకవాగురురసవ్యాసక్తులం బట్టికాం
బరమాంజిష్ఠపటాదులన్ హిమగతిం బ్రాపింప రీవిశ్వభూ
వరు మెచ్చించిన సత్కవీంద్రు లతులావాసంబులం దిమ్ములన్. ౧౦౮

## శిశిరవర్ణనము

క. భృశవిచ్ఛిన్నం బగు ది,గ్దశకంబును గమలరుహవితానముఁ బ్రాతః
ప్రశిథిలరవికరమును గా,శిశిరముఁ బొగడంగఁ దగు విశేషక్రియలన్. ౧౦౯

చ. వెరవున నాత్మవంశ్యుఁ డగువిశ్వనరేశ్వరుమీఁదిప్రీతిఁ జం
దురుఁడు తుషార సంహతుల దొడ్డుగఁ బంచిన వచ్చి యిచ్చుటన్
బరిగొనఁ బోలు నంచుఁ జెడి పాఱినవైరులు భీతిఁ గానలోఁ
జిరముగ నిల్వనేరరొ కదే యని చూతురు పంద లాత్మలన్. ౧౧౦

## చంద్రోదయ వర్ణనము

క. మండలశోభయుఁ గైరవ, షండవిలాసంబు జలధిసంజృంభణముల్
గొండొక వెన్నెలగ్రోలెడు, నండజముల విధునిపొడుపునం దగుఁ బొగడన్. ౧౧౧

మ. అదె శాద్రాకృతిఁ జూపెఁ జంద్రుఁడు, మయూఖాటోప మేపారె న
ల్లదె, మున్నాడెఁ జకోరసంఘ మదె జ్యోత్స్నాపానసంక్రీడకై;
యుదయుం డంగజుఁ డెట్లు గాఁగలఁడొ? నీయాలోకనేందీవరా
పదఁ దూలించెదు, చంద్రవంశజుని నొప్పం జూతు రమ్మా సఖీ. ౧౧౨

## సూర్యోదయ వర్ణనము

క. ఎచ్చటఁ జూచిన జగముల, నచ్చటన వెలుంగు ననియు నజ హరి హర తా
సచ్చతురుఁ డనియుమఱియును, నిచ్చలుఁ దగఁబొగడవలయు నినునుదయంబున్.

మ. కమలామోద మెలర్ప నేత్రసుఖదాకారంబు రంజిల్ల ను
త్తమవందారు శివంకరత్వ మెసఁగన్ ధర్మార్థకామక్రియా
దిమమూలం బన నొప్పుమిత్రుఁ డుదయోత్సేకప్రభావంబుచే;
సముఁ డద్దేవున కిందువంశజుఁడు తచ్చంచద్గుణశ్రేణులన్. ౧౧౪

## వనవిహార వర్ణనము

క. చారుతరచైత్రసంప,త్పూరితవిభవముల వేడ్కఁ బొంగుడుపడఁగా
నారీజనసహచరుఁ డై, యారామవిహార మొప్ప నధిపతి చేయున్. ౧౧౫

సీ. మానినీగండూషమధువులఁ బూచిన పొగడను సొబగొప్పఁ బొగడి పొగడి
నారీపదాహతి ననిచినకంకేలి పరువంబు నగ్గించి పలికి పలికి
లలనావలోకనంబులఁ బుష్పితం బగు తిలకంబుపైఁ జూడ్కి త్రిప్పి త్రిప్పి
వనితోపగూహనంబునఁ బేర్చుసురపొన్న మేలిపుణ్యమునకు మెచ్చి మెచ్చి
తే. మన్మథారామములపొంత మలసి మలసి
శుకపికాళివిహారంబు చూచి చూచి
సతులఁ దానుఁ జరించు వసంతవేళఁ
బ్రమదవనమున విశ్వభూపాలవరుఁడు. ౧౧౬

## జలవిహార వర్ణనము

క. నీరజములఁ జెంగలువలు, గైరవములు వీచికలును గరయంత్రపయో
ధారలు నావర్తంబులు, వారివిహారంబులందు వర్ణ్యము లరయన్. ౧౧౭

చ. వళులును వీచికావళులు వారిరుహంబులు వక్త్రపంక్తులున్
చెలు వగునాభులున్ సుడులుఁ జేతులు రక్తసరోరుహంబులున్
జలదలకంబులున్ మధుపజాలము వీడ్వడఁ గేలి సల్పి మిం
చులు గొనుచూడ్కులన్ సతులు మాతురు విశ్వనృపాలమన్మథున్. ౧౧౮

## మద్యపానవర్ణనము

క. సంబోధకరము మదనా, లంబనము నశేషరసవిలసితము నంత
ర్బింబితశవదనము నగు కాదంబరి నాపానమునకుఁ దగు నొడఁగూర్పన్. ౧౧౯

మ. అలినాదంబులు గానమానములుగా నాలప్తి గావించుఁ దో
య్యాలి యోర్తొక్కతె పాడు విశ్వవిభు నేఁడాదిప్రబంధంబులన్;
దెలివిం గైకొని యోర్తు సాంగముగ నర్తించుం; గళాసించు ను
గ్మలి యోర్తొక్కతె వ్రాలు సోలములతోఁ గాదంబరీగోష్ఠి చేన్. ౧౨౦

## సురతవర్ణనము

తే. తనరు నెనుబదినాల్గుబంధములయందు
నమగుఁ బ్రచ్ఛన్నమును బ్రకటము ననంగ
సురతములు రెండు; వానికి స్ఫురణసొంపు
వలయు వర్ణింప నిఖిలకావ్యములయందు. ౧౨౧

సీ. పొలయల్కఁ దలఁపులఁ బులకించుఁ, బులకించి బింకంపుఁ గౌఁగిళ్లఁ బిగి భజించు
మగుచిన్నె లున్నెడఁ బరికించుఁ, బరికించి చొక్కుఁ, జెమర్చినయొక్క లరయుఁ
దొలిప్రొద్దు చెలిచెవిఁ జిలికించుఁ, జిలికించి మురిపెంపుసిగ్గున మూరిఁబోవుఁ,
బంజరంబుపచిల్కఁ బలికించుఁ, బలికించి నొడువు లాలము లైననోరు నొక్క,
తే. సొబగుటడుగులలత్తుక చూచుఁ, జూచి
యరిగి శయనీయ మారయ నప్పళించు,
వెలఁది యొక్కర్తు చాళుక్యవిభుని చేత
భావజాతుని గెల్చినభావ మొప్ప. ౧౨౨

## విప్రలంభ వర్ణనము

క. అచ్చపువెన్నెలచేఁ గడు, నెచ్చుటలును మాన మెడలి పెడవిల్తునిచే
నొచ్చుటలును బ్రియుఁ దబ్బని, ముచ్చటలును విప్రలంభమునఁ జెప్పఁదగున్.

ఉ. ఎల్లిద మయ్యెఁ దాల్మి, తగ నెల్ల వివేకము వింత యయ్యె, మి
న్నెల్లను జంద్రుఁ డయ్యె, మన మెల్ల మనోభవుతూపు లయ్యె, మి
న్నెల్లను సన్న మయ్యెఁ, జెలు లెల్ల విరోధిను లైరి, విశ్వభూ
వల్లభుతోడియల్కఁ గరువంపుఁజలంబునఁ బువ్వుఁబోఁడికిన్. ౧౨౪

## ప్రయాణవర్ణనము

క. గజ రథ హయ సూచిత మగు, విజయమ్మున నుబ్బి నడచుచు విశ్రుతవివిధ
ధ్వజిని వినుతించు టెప్పుడు-భజనీయము సుకవి సత్ప్రబంధములందున్. ౧౨౫

మ. కర ముద్యత్కరవాలభైరవపతాకాఖేలనం బై పరి
స్ఫురదుగ్రాయుధదీప్తిపూరితనభోభూభాగ మై సంచర

త్తురగోద్ధూతరజోతిధూసరహరిత్కూలంబు లై యుద్ధతిం
బరిభాసిల్లఁ జళుక్యనాథుని చమూభద్రప్రయాణం బిలన్. ౧౨౬

## వివాహవర్ణనము

క. ప్రచురస్వయంవరోచిత, రచనలఁ గన్యావరాభిరమ్యక్రియలున్
విచితశుభాత్మకవిధులును, రుచిరవివాహంబులందు రూపింపఁ దగున్. ౧౨౭

ఉ. సంతతమంగళధ్వనులు చామర మౌక్తికపుండరీకముల్
వింతవిభూతి గా గురుకవిస్తుతివేళ వరించెఁ బొంత సా
మంతుల నుజగించి కడు మచ్చికనెచ్చెలు లైన నీతి వి
క్రాంతులు చూపఁ గోరి జయకన్యక వచ్చి చళుక్యవల్లభున్. ౧౨౮

## పుత్త్రోదయవర్ణనము

క మిత్త్రానందోదయము న,మిత్త్రత్రసనంబు శుభనిమిత్తంబును స
త్పాత్రకృతవితరణంబును, బుత్త్రోదయమందుఁ దద్ద పొగడఁగవలయున్. ౧౨౯

ఉ. చిత్రము పొర విశ్వవిభు చే ననిపుత్త్రికఁ గన్నపుత్త్రులు
ద్యత్త్రిదశాకృతిం బడసి యౌవనసంపదఁ జెంది మంగళా
మత్రము లై వెలుంగునెడ మంజులయుక్తిఁ దనర్చు దివ్యవా
దిత్రరవంబు నింపొదవుఁ దెమ్మెరలున్ సురపుష్పవృష్టియున్. ౧౩౦

## మంత్రవర్ణనము

క. అగవాక్షము నస్తంభము, నగుగూఢాభ్యంతరముల హర్మ్యాగ్రమహా
నగశృంగంబుల మంత్రము, దగు నొనరింపంగ ననుచుఁ దగు వర్ణింపన్. ౧౩౧

మ. అలుకం బోరికి నెమ్మిమైఁ దదలుచోఁ బ్రారంభణోపాయమున్
బలసంపత్తియు దేశకాలగతులున్ భంగప్రతీకారముఁ
ఫలసంసిద్ధియు నిర్ణయించు టనునీపంచాంగమంత్రక్రమం
బులు తర్కించుచళుక్యనాథు వెర వొప్పున్ బూజ్యరాజ్యక్రియన్. ౧౩౨

## దూత్యవర్ణనము

క. ప్రతిభయుఁ బరమంత్రవిభే, దితయునుఁ బలిరక్తియును దితిక్షయు నిర్ఘా
ర్ణతయును నవ్యసునీతియుఁ, జతురతయును దూత్యమునను జను నుతియింపన్.

శా. ఉత్తేజుం డగువిశ్వభూవిభుని దూతోద్యద్దారసమ్యగ్గుణో
త్పత్తిన్ విశ్రుత మైనసంధి గనుభూపశ్రేణియున్ దుర్మదా
యత్తస్వాంతత నిగ్రహించు నరనాథౌఘుం బె వర్తించు న
త్యుత్తుంగాచలచిత్రకూటములయందుం జెంది యశ్రాంతమున్. ౧౩౪

## సమరవర్ణనము

క. పటురథకరిహరిభటసం-ఘటితవ్యూహాదికములు ఘనఫలకాసి
స్ఫుటరుచులు విజయకారణ-గటహాడంబరముఁ బొగడఁబడుఁ బోరాటన్. ౧౩౫

మ. అమరాహీనరవంబు వీరసుభటాహంపూర్వికానాదముల్
విమలాస్త్రప్రతిఘాతనధ్వనులు నున్నిద్రంబులై పర్వ న
గ్రమవిశ్రాంతిక్ మెచ్చి నారదుఁడు న ర్తింపక్ మహాయోధనం
బమరుం జూడఁ జళుక్యవల్లభునికారాటోపముం జూపుచుక్. ౧౩౬

## దోర్వీర్య వర్ణనము

క. అరులఁ జనఁ దోలి యార్తుల. నరుదారం గాచి మాతులయడియాలముల్
బిరుదంబులఁ గైకొను నృన్నరపతివిజయంబు కీర్తనము సేయఁ దగుక్. ౧౩౭

ఉ. ఆచతురాశ్వసంఘము రణాంగణసంభవ, మా సువర్ణపే
టీచయ మాజి శత్రువులు డించి తొలంగిన వస్తుసంభృతం,
బీచతురంతయానములు యింతులు రాజతనూజ, లంచు మొ
నైచని విశ్వనాథువిజయంబు నుతింతురు పౌరకామినుల్. ౧౩౮

---

మ. ఇటు లష్టాదశవర్ణ నాకలిత మై యేపారు కావ్యంబు నం
తటఁ బాటించి తదర్థసంఘటనముం దర్కించి భావోదయ
స్ఫుటభేదంబు లెఱింగి తద్రసగతుల్ శోధించి యచ్చంపు మె
చ్చుటకుం దావల మై చళుక్యపతి సంశోభిల్లు నెల్లప్పుడున్. ౧౩౯

ఉ. రాజనరేంద్రవంశజుఁడు రాజపటీరసుధాసుధారక
భ్రాజితకీర్తి రామరఘురామపరాక్రమసంప్రవృత్తి యం
భోజహితప్రతాపుఁడు రిపుక్షితిభృత్కులిశంబు సత్కళా
భోజుఁడు దానధాత సురభూజుఁడు భూజనపోషణుం డిలక్. ౧౪౦

క. సుందరుఁ డభినవవిభవ పు,రందరుఁ డంధ్రేశ్వరాభిరాముఁడు రామా
కందర్పుఁ డమందయశ,శ్చందనపరిలిప్తదిగ్గజవ్రజుఁ డెపుడుక్. ౧౪౧

## మాలిని

అనఘసుకృతధర్ముం డార్యసంస్తుత్యశర్ముం
డనలసదృశతేజుం డగ్ర్యచాతుర్యభోజుం
డనిశరిపుశరణ్యుం డంధ్రభూపాగ్రగణ్యుం
డనుగతశివతంత్రుం డాప్తమంత్రుండు బుద్ధిక్. ౧౪౨

## గద్యము.

ఇది శ్రీమదుమారమణ చరణారవిందవందన గోవిందామాత్యనందన విబుధబుధవిధేయ
విష్ణుకోట పెద్దయనామధేయ విరచితంబైన కావ్యాలంకారచూడామణి
యనునలంకారశాస్త్రంబునందు నాయక నాయికావివిధవిశేషలక్షణ
ప్రబంధలక్షణోదాహరణసముద్దేశం బన
తృతీయోల్లాసము.

---

# చతుర్థోల్లాసము.

క. శ్రీవిశ్వేశ్వరకరుణా, శ్రీవిలసిత నిష్కళంక చిత్తుఁడు కీర్తి
శ్రీ విశద చక్రవాళుఁడు, శ్రీవిశ్వేశ్వర నరేంద్రశేఖరుఁ డొప్పున్. ౧

క. ఇత్తెఱఁగున నష్టాదశ: వృత్తం బగు కావ్య మొప్ప విరచింపఁ దగున్
మొత్త మగు నఖిలబలసంపత్తియుఁ గలవేళ సుకవి ప్రతిభ దలిర్పన్. ౨

క. కృతిముఖమున దేవ నమస్కృతి యొండె నభీష్టవస్తుకీర్తన మొండెన్
వితతాశీఃపద మొండెను, బ్రతిపాదింపంగవలయు భద్రాపేక్షన్. 3

మ. కవిసంసిద్ధపదంబు భావరసవిఖ్యాతంబు లోకోచిత
వ్యవహారంబు నుదాత్తనాయకము శ్రవ్యంబుం జతుర్వర్గ సం
భవసద్మంబును నైనకావ్య మిల నాచంద్రోద్భవస్థాయి యై
కవిసంస్ఫూర్తియు దాతృకీర్తియుఁ దగం గల్పించు నెల్లప్పుడున్. ౪

## కావ్యభేదములు

తే. అట్టికావ్యంబు త్రివిధ మై యతిశయిల్లు
నవనిఁ బద్యమయంబు గద్యాత్మకంబు;
పద్యమయ మొప్పు ఛందో నిబద్ధ మగుచు
గద్యమయ మొప్పు వాక్యసంకలిత మగుచు. ౫

క. ఆపద్యగద్యకృతములు, రూపకములు నాటకములు రూఢము లగు నా
రూపమ చంపూకావ్యత, ప్రాపించును, నాటకములు బహుళము లరయన్. ౬

తే. సర్గబంధంబు కావ్యంబు సంస్కృతమున,
బ్రాకృతంబున నాశ్వాసభాసురంబు,
నాటకము నెల్ల నంకసాధకములు,
గద్య ముచ్ఛ్వాస లంబకాంకంబ యండ్రు. ౭

క. ఇటువలెనె ముక్తకాది, స్ఫుటతరచాటుప్రబంధములలక్షణముల్
బటురతి నెఱుఁగుట సుయశో, ఘటనంబుల కెల్లఁ గుదురు కవినృపతులకున్. ౮

## ముక్తకాదులు

సీ. పరఁగు ముక్తక మేకపద్యంబు, పద్యద్వయంబు ద్వికము నాఁగ నలరు, మూఁడు
పద్యముల్ త్రికము నా భాసిల్లుఁ, బంచపద్యంబులు పంచరత్నంబు లరయ,

గజమాల పద్యాష్టకము, పద్యనవకంబు నవరత్నమాలిక, నలినమిత్ర
మాలిక పంద్రెండు మధురపద్యము, లిందు కళ షోడశశ్లోక కలిత యైన,

తే. సప్తవింశతి యైన నక్షత్రమాల,
తెలియ ముప్పది పద్యముల్ త్రింశదాఖ్య,
మపలఁ బంచాశదాహ్వయం బైదుపదులు,
శతక మన నొప్పు మఱి పద్యశతము గూడ. ౯

క. అష్టోత్తరశతపద్యము, లష్టోత్తరశతక మనఁగ నడరుఁ గవీంద్రుం
డిష్ట మగు సంఖ్యఁ జెప్పిన, దుష్టము గా దవియుఁ గర్ణతుష్టిని చేయున్. ౧౦

## ఉదాహరణ లక్షణము

క. ధరఁ జాటుకృతులలోనం, బరఁగు నుదాహరణ మనుప్రబంధము, తద్వి
స్తరలక్షణంబు బరువడిఁ, బరికింపఁగఁ దగు నశేషభాషాకవులున్. ౧౧

క. చతురశ్ర త్ర్యశ్రాది విశ్రుతయతి తాళములు గలుగుడళముల నెల్లన్
గృతగుచ్ఛానుప్రాసం, బతులితగతి నిలుపఁ దగు నుదాహరణలక్ష్మ్. ౧౨

క. సురభాషావిప్రాకృత, పరిభాషల నైన నితరభాషల నైనన్
విరచించుట యుక్త ముదాహరణ మిలాసురముఖాదు లగుపుణ్యులకున్. ౧౩

## విభక్తులకు మాఱుపేరులు

సీ. ప్రథమావిభక్తి చొప్పడు వాణి నాఁగ, రెండవయది ఝుట నాఁగ నతిశయిల్లుఁ,
గీర్తి మూఁడవవిభక్తికిఁ బేరు, నాలవయది దేవలాభిని యఁద్రు గృతులఁ,
బంచమి పాణి నాఁ బరఁగు, షష్ఠవిభక్తి పాటిల్లు సుకవులు మోటి నాఁగ,
సప్తమి ఘోటికాసంజ్ఞిత, సంబుద్ధి సరసావళీనామ; జగతి వీని

## విభక్తుల దేవతలు

తే. కయిన వేల్పులు వీరావళియును గీర్తి
మతి సుభగయును మఱి భోగమాలినియును
మహిఁ గళావతియును గాంతిమతియుఁ గమల
యును జయవతియు నాఁగను నొప్పు నెపుడు. ౧౪

క. ఈవిధి నష్టవిభక్త్యధి,దేవత లాత్మీయనామధేయసమము గా
భావింపఁ దగినశుభములఁ, గావింతురు కర్తృనాయకద్వయమునకున్. ౧౫

క. మును శుభగణవర్ణతఁ బ్రర్వినమాలిని యొండెఁ జండవృత్తము యొండెం
దనరింపవలయుఁ బ్రథమకు, ఘనకలికాష్టకతదర్ధ కలికాయుక్తిన్. ౧౬

క. ఇం బడరఁగఁ బ్రథమాదుల, సంబుద్ధ్యంతములనైన సరళవిభక్త్యా
లంబనపద్యంబుల బిరుదంబులు గలపౌరుషములు దగ నిడవలయున్. ౧౭

తే. కళిక యేతాళమునఁ బరిఘటిత యయ్యె
నుత్కళికయును దానన యుపవలయుం,

నంత్య చాతుర్థికోత్కళికాఖ్య చూడఁ
బడి చతుర్థియుఁ బోలెఁ జూపట్టవలయు. ౧౮

క. ఓజఃపదబహుళము వి,భ్రాజితపటుగౌడరీతిబంధురమును ని
చ్ఛాజాతరసవిభావ వి,రాజితమును గా నుదాహరణ మగుఁ జెప్పన్. ౧౯

క. నాయక విభవమునకుఁ గవి,నాయక చతురతకు భాజనం బగుపద్యం
బాయితము సేసి యిడఁ దగు, నాయతిగాఁ దుదలయం దుదాహరణలకున్. ౨౦

సద్ధళి

క. సంబుద్ధి విడిచి మును గల, సంబంధం బెడల కుండ సప్తవిభక్త్య
డంబర మడరించిన నొడి,కం బగు సద్ధళి యనంగఁ గవులకుఁ జెప్పన్. ౨౧

షద్ధళి విద్ధళి

తే. సరిపవిభక్తుల సంబుద్ధిసహిత గాఁగఁ
జెప్ప నొప్పారుఁ షద్ధళి సిద్ధమగుచు
ముక్తసంబుద్ధి విషమవిభక్తికలిత
మైనకృతి పేరు విద్ధళి యండ్రు బుధులు. ౨౨

కల్యాణి ఉత్ఫుల్లకము

క. కేవలకలికాసంగతిఁ, గావించినకృతికిఁ బేరు కల్యాణి యగున్
వావిరి నుత్ఫుల్లక మది, యానల నుత్కళికతోన యడికిన యేనిన్. ౨౩

తే. గ్రంథబాహుళ్య భీరుత్వకథన మిదియు,
ధర నుదాహరణాది భేదములు పెక్కు,
తెలియుఁ డొండెడ మఱికొన్ని తేటపఱుతుఁ
బటుపదార్థాప్తిఁ జాటుప్రబంధములను. ౨౪

బిరుదములు

క. బిరు శబ్దంబు విరోధో,త్కరము మహారాష్ట్రభాషఁ దత్ప్రదవిధులన్
బిరుదము లనఁ జను వానిన,ధర బిరుదావళి యొనర్పఁ దగు నండ్రు బుధుల్. ౨౫

చ. అతులకులక్రమాగతము లై భుజవిక్రమ సంభవంబు లై
ప్రతిపదసార్థకంబు లయి పార్థివకర్ణకఠోరకంబు లై
వితరణశబ్దపూర్వపృథివీవర చిహ్నము లై తనర్చు న
ద్భుతబిరుదాళిచేత బిరుదార్థము చెప్పుట యొప్పు నెప్పుడున్. ౨౬

క. వినయ భుజవిక్రమక్రమ, ఘనవితరణ రణవిహార కరు ణాది కళా
జనన స్థలు లగుగుణములఁ, బెను పొందఁగఁ జెప్పవలయుఁ బిరుదావళికిన్. ౨౭

క. సముచిత తాళదళమ్ములు, సమధిక పటుగౌడరీతి సందర్భములున్
సుమనోభాషం బొలుపుగ, నమరింపుఁడు కవులు ప్రాకృతాదుల నైనన్. ౨౮

తే. పద్యదళ వాక్య తద్దళ పరిసమాప్తి
గదురుపట్లను నెడ నెడఁ గలుగవలయు
ధీర గంభీర జయ దేవదేవ యనెడు
లలితసంబుద్ధివచనంబు లోలయవలయు. ౨౯

క. ఉచితవిభక్తికమును గుణ, రుచి రాలంకార రస నిరూఢము నాశీ
ర్వచనంబును నగుపద్యము, రచియింపఁగ వలయు మొదల రంజన మొప్పన్. ౩౦

## గుచ్ఛములు

క. మొనడగు దళములు నాలుగ, యొండెను షట్కంబ యొండె నుండఁగఁ దుదపై
నుండును గద్యము నెనిమిది, యొండెం బదియారు నొండె నురుగుచ్ఛము లై. ౩౧

క. ఇటఁ దగు నూతనయతిసంగతి దళములు నాలు గైనఁ గడ నాల్గైనన్
బెడఁ గగువర్ణావృత్తులు, వెడలింపఁగవలయు సంద్రు బిరుదావళికిన్. ౩౨

క. బంగరముగ నిట్లుతుల, స్కంధచతుష్కంబుచేతఁ గవి విభుని యశో
గంధాధివాసితాశా, సింధురముగ దీవనల విశేషింపఁ దగున్. ౩౩

## చక్రవాళము

క. పద్యం బొక్కటి మొదలను, గద్యాష్టక ముచితదీర్ఘగతిఁ గబ్బములన్
హృద్యదళాష్టక మిడిన స,ముద్యత మగుఁ జక్రవాళ మూహింపంగన్. ౩౪

తే. వరుస నాదిమపద్యాంతవర్ణయుగళ
మంత్యవాక్యాదిమాక్షరయమళకముగ
నిడి చతుస్స్కంధములయందు నిట్లు చెప్ప
నచ్చుమగఁ జక్రవాళత్వ మబ్బుఁ గృతికి. ౩౫

క. కవినామనాయకస్వ,స్తినచఃకవితాద్యపద్యశిఖరంబులఁ బ
ల్లవ మైనవర్ణయుగళం, బవిరళముగ నాద్యమునకు నాద్యశ్లగముల్. ౩౬

## గుచ్ఛతతి

క. తొలి తొలపద్యమునఁ జతుర్దళమును నట పల్లవద్వితయ మంతమునన్
గలుగునపద్యము నాలుగు, దళముల నన్నింట గుచ్ఛతతి యన వలయున్. ౩౭

క. కలయఁగ సంబుద్ధ్యంతర,ముల ననుపఁగవలయు నందముగ జయ జీవో
జ్జ్వల దేవాదిపదంబులు, నలి నిదుచతురుత్తరంబు నగుమా లైనన్. ౩౮

## చతుర్భద్రము

క. ఇదియె చతుర్భద్రం బగు, సదమలధర్మార్థకామసహితస్తుతులం
బొదివినగాని పద్యగీతుల, విదితం బగునేని శాస్త్రవిదులను చెప్పన్. ౩౯

## రగడ

క. సరి యా పదిరేకులచేఁ, బరువడి నుత్సాహవృత్తపదయుగళముచే
నిరవుగ వడిఁ బ్రాసంబుల, నరుదుగ రచియింప రగడ యగుఁ దగువృత్తిన్. ౮౦

## మంజరి

క. శృంగారప్రాయముగా, రంగద్ద్విదళిన ప్రాసంగ రచియింపంగా
శృంగారమంజరీకృతి, సంగత యగు సకలరాగ సంభృతరీతిన్. ౮౧

## దండకము

క. ఛందోభవలక్షణగణ, సందోహనిబద్ధ యగుచు శ్రవణానందా
మందానుప్రాసంబుల, నందం బగు దండకము మహాకవికృతులన్. ౮౨

క. ఇవి యెల్లను నానావిధ, కవికృతశాస్త్రములచేతఁ గల్పితములు, పె
క్కువిధంబులఁ జాటుకృతిప్రవరంబులు పరఁగు నెఱుఁగఁబడు నొండెడలన్. ౮౩

సీ. అపూర్వలక్షణోదాహరణావలి యుల్లంబునకు నింపు నొసఁగ దేని
బిరుదావళీముఖ్యపృథులప్రబంధౌఘములు దిగంతంబుల మ్రోయవేని
పటుచతుర్భద్రాదిభవ్యచాటూక్తులు నృపతులవీనులు నిండవేని
మధురార్థదండక మంజరీమంజుల బాధుల నింపుల మూరిఁ బుచ్చదేనిఁ

తే. గెరలి చని ముక్తకాదులు కీర్తిలతలఁ
జక్రవాళాద్రి మీఁదికిఁ జాఁపవేనిఁ
గడఁగి మెచ్చునె యొకపాటిగంతచాటు
చాటుకృతులకు విశ్వేశచక్రవర్తి. ౮౪

## ప్రాధాన్యములు

క. ఆరయ వస్తురసాలంకార ప్రాధాన్యవృత్తిఁ గబ్బంబులు పెం
పారుఁ ద్రివిధార్థఘటనల, ధీరులు పరికించి వానిఁ దెలియఁగవలయున్. ౮౫

## వస్తుప్రాధాన్యములు

క. వేడుక విశ్వేశుఁడు శివ, చూడామణికులమునందు సుస్థిరుఁ డగుటన్
జూడఁ గనకాద్రికపటం, గూడక యవ్వెండికొండ కొండిక యయ్యెన్. ౮౬

## రసప్రాధాన్యము

క. వలిచన్నులు నగుమొగములు, దెలిగన్నులు మేనిజిగులు తియ్యనిపలుకుల్
సలికపునడుములు మరుతూపులఁ బ్రోచుఁ జళుక్యవిభునిపాలఁతుల కెపుడున్. ౮౭

## అలంకారప్రాధాన్యము

క. తగ విశ్వేశ్వరుచే సిరి, నెగడిన సత్కవులు దాననిపుణతఁ గర్ణున్
నగుదురు, కల్పమహీజముఁ, దెగడుదు, రదలింతు రమరధేనువు నైనన్. ౮౮

స్ఫురణములు

తే. తనర శబ్దస్ఫురణము నర్థస్ఫురణము
నుభయవిస్ఫురణము నన నుల్లసిల్లు;
నిత్తెఱంగులు మూఁడును నెఱుఁగవలయుఁ
జారుశబ్దార్థగౌరవశక్తివలన. ౪౯

శబ్దస్ఫురణము

క. కంఠీరవకఠిన భీటా, కుంఠితకంఠార వావకుంఠితశరణ సో
ల్లుంఠనములు సురవనితో,త్కంఠం గావించు విశ్వధరణిపు సేనల్. ౫౦

అర్థస్ఫురణము

చ. తనరెడుఖడ్గధార మును ద్రావినవారి విరోధిభీరుశో
చనముల నుప్పతిల్లి కడుఁ జక్కనివాహిను లయ్యె; నైన న
య్యనువునఁ గ్రొత్తపెండ్లికొడుకై మది నుబ్బుచునుండు సాగరుం
డనిఁ గరవాలభైరవు మహత్త్వము చిత్రమ కాదె యెప్పుడున్. ౫౧

ఉభయస్ఫురణము

స్రగ్ధర

లాటీర్యాటీవరాటీలలితకుచతటీలగ్న పాటీరచర్చం
బాటించుం, జంద్రకాంతోపలములఁ గరఁచున్, బర్వి చక్రీప్రియం దా
ఘాటోద్యత్కైరవాసక్తములఁగ నదులం గట్టు గంధాను బంధిన్
జాటు శ్రీతోడ విశ్వేశ్వరుని సితయశశ్చంద్రికాసార మోలిన్. ౫౨

శయ్య

క. మృదుతరమై యొండొంటికిఁ, బదమిత్రత గలిగి పదములపలుకులలోనన్
బొదలెడు నర్థం బెచ్చట, నదలించి శయించు శయ్య యనఁగా నదియౌ. ౫౩

చ. చతురచళుక్య విశ్వవిభు చారుగుణంబు లరాతిరాజిరా
జితనయ హేతుభూతము, లశేషవిశేష విహార విక్రమో
చితరతు, లార్యచర్యలకు జీవిత, మంచితసంచితాగమా
తతమతి భారతీవదనదర్పణ, ముత్తమదర్పసంపదన్. ౫౪

పాకము

క. పాక మనంగా నర్థని,రాకులగంభీరయుక్తి, యటు మూఁడుగ
లోకమునఁ దెల్చు ద్రాక్షా, పాకంబును నారికేళపాకము ననఁగన్. ౫౫

ద్రాక్షాపాకము

క. బహిరంతః స్ఫురితార్థో, పహితరసప్రసర మగుచుఁ బద్యము సుఖసం
గ్రాహకద మెచ్చుట నదియౌ, సుహి ద్రాక్షా పాక మనఁగ మధురం బెపుడున్. ౫౬

శా. లీలామన్మథమంథరంబులుఁ గచాళీ లాలిత భ్రూలతా
కూలశ్రీలుఁ గపోల ఖేల దుచితాకూతానురాగంబులున్
సాలస్యంబులు నైనకౌతుకపరీతాలోకజాలంబులన్
బాలారత్నము కీలుకొల్పె మద మొప్పన్ విశ్వభూపాలుపై. ౫౭

### నారికేళపాకము

క. అంతర్గూఢార్థపర,స్వాంతం బగువాక్యగౌరవంబు మనీషా
వంతులకు నెక్కుఁ గవితా.భ్యంతరముల నారికేళపాక మనంగన్. ౫౮
శా. హృజ్జాతుండు నటుండు వోలె నదె విశ్వేశక్షమాభర్తకున్
లజ్జాకాండపటంబుచాటున వధూ లావణ్య లాస్యంబులన్
సజ్జాతంబులఁ జేసి చూపెను లసత్సారాంగహారాళిచేఁ
బజ్జం గొందఱు కామినీమణులు కుప్యద్దర్పలై చూడఁగన్. ౫౯

---

## అర్థవృత్తులు

ఆ. ముఖ్యలక్ష్యగౌణములును వ్యంగ్యంబు నా
నర్థవర్తనంబు లయ్యె నాల్గు
వానివలనఁ గలుగు వాచ్యభేదంబుల
నరసి తెలియవలయు నండ్రు బుధులు. ౬౦

### ముఖ్యార్థము

క. సువ్యక్తము సరళంబును, నవ్యాజము నైన యర్థ మగు ముఖ్య మనన్,
శ్రవ్యముగ నదియు జాతి, ద్రవ్య గుణ క్రియలచేతఁ దగు నాల్గనఁగన్ ౬౧

### లక్ష్యార్థము

ఆ. ఊహనీయ లక్షణోపేత మగునర్థ
మరయ లక్ష్య మనఁగ నతిశయిల్లు,
గంగయం దనంగ గంగా తటంబునఁ
గలిమిఁ జెప్పఁజాలు కారణమున. ౬౨

### గౌణార్థము

క. గుణ సాదృశ్యంబున నుల్బణ మగునర్థంబు గౌణభణితము, గడు భీ
షణహరి యానృపుఁ డన దద్గుణ మగువిక్రమము దెలియఁ దోఁచుట చేతన్. ౬౩

### వ్యంగ్యార్థము

ఆ. ముఖ్యలక్ష్యగౌణముల యర్థములఁ ద్రోచి
యితర మర్థ మెచట నింపు నొసఁగు
వ్యంగ్య మండ్రు, కైరవంబులు విరిసె నాఁ
గమలవైరిపొలుపు గానఁబడుట. ౬౪

## ధ్వని

క. పాకాదికృతవ్యంగ్య, వ్యాకీర్ణం బైన కావ్య మది యుత్తమ మై
చేకొనఁబడు మధురార్థ, శ్రీకము ధ్వని యనెడు నెపముచేఁ జెలు వొందున్. ౬౫

ఉ. ప్రీతిఁ జళుక్యవల్లభుఁడు పృథ్వి వహించి గుణాఢ్యుఁ డైనచో
శాతమదాష్టదంతులు వశావశతన్ జరియించె, శూలికిం
జేతుల భూషణస్ఫురణఁ జేకొనె, వార్ధులు గోత్రభూధర
వ్రాతము నిల్వ నయ్యెఁ, గడు వ్రాన్పడె నిర్జరపాదపంబులున్. ౬౬

## శక్తిగ్రాహకములు

సీ. విహితసంయోగంబు విప్రయోగంబును సామర్థ్యమును సాహచర్యకంబు
నర్థవిరోధ లిం గౌచిత్య చేష్టలు పరశబ్ద సన్నిధి ప్రకరణములు
దేశ కాల క్రమాదికములు శబ్దార్థ కలి తానవచ్ఛేదకల్పనములు
స్మృతి హేతుకములు విశేష వాక్యస్వర వ్యక్తులు నాఁగఁ బర్యాయగతుల
తే. నలరు నన్నింట నర్థంబు నవగమింపఁ
దగు ననేకార్థయుతము లై తనరుశబ్ద
సంతతుల కర్థసంధానచతురు లెల్ల;
నింకఁ దద్వృత్తు లెఱిఁగింతు నెఱుఁగవలయు. ౬౭

## కావ్యవృత్తులు

క. ధీరస్తుత కై శికియును, నారభటియు సాత్త్వతియును నట భారతియున్
జారుతరవృత్తు లివి శృంగారాదిరసంబులందుఁ గరణీయంబుల్. ౬౮

### కైశికి

తే. సకల సుకుమార మధురార్థ సరళ రచిత
కైశికీవృత్తి; శృంగార కరుణ రసము
లధికసుకుమారములు, వాని నగు నొనర్పఁ
గైశికీవృత్తిచేతన కవుల కెల్ల. ౬౯

మ. దళదిందీవరసుందరంబులును సంతత్కౌతుకాంకూరసం
వళితస్నేహములున్ బ్రసన్నములు నై వర్తిల్లు నాలోకనం
బు లుపేంద్రాత్మజు నిందువంశజుఁ గళాపూర్ణాత్మకుం జూచుచోఁ
బొలిచెం బొల్తికి సానురాగరససంపూర్ణంబు లై యత్తఱిన్. ౭౦

### ఆరభటి

క. ఆరభటీవృత్తి యనఁగ, నారూఢాభ్యుద్ధతార్థ, యత్యద్భుతము
ల్గా రౌద్రము బీభత్సము, నారభటీవృత్తిఁ జెప్ప నగు నీరెండున్. ౭౧

మ. అతిశుష్య త్పరగండభైరవ మహోద్యత్ఖడ్గ ముగ్రాకృతిన్
ప్రతిపక్షప్రకరంబు నొంచు నలచున్ భంగించు దండించు ను
ద్ధతి నుగ్గించు వధించు వ్రచ్చు యమదోర్దండ ప్రచండక్రియా
గతి రూపించు నటత్కబంధమయ సంగ్రామంబు భీమంబు గాన్. ౨౨

భారతి

తే. భారతీవృత్తి కైశికల్పనము చూడ
నర్థ మించుక సుకుమార మై తనర్చు;
నల్పమృదువులు హాస్య శాంతాద్భుతములు
భారతీవృత్తిచేఁ జెప్పఁబడు నవియును. ౨౩

మ. అతికందర్పము రూప, ముజ్జ్విత సుపర్వానోకహం బీగి, నిం
దితచంద్రద్యుతి కీర్తి, గర్హితసురాద్రిస్ఫూర్తి ధైర్యంబు, కుం
ఠితకంఠీరవ ముగ్రవిక్రమము, వర్ణింపం జళుక్యావనీ
పతి; కీయద్భుతవృత్త మేన్నృపులకున్ బాటిల్లునే యెచ్చటన్? ౨౪

సాత్త్వతి

తే. సాత్త్వతీవృత్తి నాఁగ నీషత్ప్రగల్భ
సార్థరూపిణి; వీర భయానకములు
నీమదుక్తిప్రగల్భసమీహితములు;
సాత్త్వతీవృత్తిచే వీని జరుపవలయు. ౨౫

మ. అతిదృప్యత్కరవాలభైరవపతాకాభీలకోలధ్వజా
కృతులం జూచినవీరు లుబ్బుదు రొగిన్ గీర్వాణలోకార్థు లై,
సతతత్రస్తులు దూలిపోదురు మహాశైలాగ్రకూటార్థు లై,
గతవిద్వేషులు విశ్వనాథ వినుతు ల్గావింతు రాత్మార్థు లై. ౨౬

---

కావ్యరీతులు

తే. అఖిల కావ్యంబులకు రీతు లాత్మ యండ్రు;
ప్రాణదశకంబు వానికిఁ బ్రాణ మరయ;
ధర నలంకారమతవిభేదముల నవియుఁ
బెక్కు, లౌక కొన్ని తగఁ గానిపింతుఁ దెలియ. ౨౭

క. ఈడిత లగు వైదర్భీ, గౌడీ పాంచాల లాటికా రీతులు కా
వ్యాడంబరకరణార్థ, క్రీడలఁ జతురాహ్వయములఁ గృతకృత్యల వేన్. ౨౮

గుణములు

క. క్రమమున నౌదార్యశ్లేషములును సుకుమారతా ప్రసాద మధురతా
సమ తార్థవ్యక్త్యోజస్సమాధి కాంతులును దగు దశప్రాణము లై. ౨౯

### ఉదారత

క. వినుతసుశబ్దార్థంబులఁ, దనరు గుణోత్కర్షణం బుదారత్వ మనన్
జను; నది పూరణబహుళత, ననఘశ్లాఘోదయమున నగుఁ గల్పింపన్. ౭౦

### శ్లేషము

క. అశిథిలపదబంధం బై, విశదాల్పప్రాణవర్ణవిస్పష్టం బై
కుశలగతి నొప్పు శ్లేషము, విశేషకావ్యముల కెల్ల విభవప్రద మై. ౭౧

### సుకుమారత

క. శ్రుతిసుఖకరవర్ణంబుల, నతికోమల మైనరచన మలవడు సుకుమా
రత నాఁగఁ, గ్లిష్టశాస్త్ర, స్మృతివాదపటిష్ఠనుతులఁ జేకొను నదియున్. ౭౨

క. లలిఁ బదములతో నర్థము, సలలిత మగు నెచట నది ప్రసాదము కృతులన్
వలిపపుఁబయ్యెదఁ గోనన్, దొలఁకాడెడువలుదచన్నుదోయిని బోలెన్. ౭౩

### మాధుర్యము

క. పటుబంధంబులు మృదుల, స్ఫుటవిన్యస్తాక్షరములుఁ బూరితరస సం
ఘటిత పదార్థంబులు నెచ్చట నగు మాధుర్య మనఁగఁ జను నది కృతులన్. ౭౪

### సమత

క. దొరఁకొన్నకొలఁది విడువక, చరణపదార్థములనడక సరి సాగెడు వి
స్ఫురణ యది సమత యనఁ జను;, నరయం గుకవులకు నంద దది పరికింపన్. ౭౫

### అర్థవ్యక్తి

క. తనరఁ గ్రియా కారక యోజన మస్తవ్యస్తసరణిఁ జనకుండ యథా
జనితాన్వయముగఁ జెప్పినఁ, గనదర్థవ్యక్తి నాఁగఁ గవితల నొప్పున్. ౭౬

### ఓజస్సు

క. ఓజోగుణ మనఁగా వి, భ్రాజిత మగుఁ బటుసమాసబాహుళ్యము రా
రాజదను ప్రాసాక్షర, భాజన మై యొప్పు శబ్దభాసురఫణితిన్. ౭౭

### సమాధి

క. స్థావరజంగమధర్మవి, భావితచరితములు వీడువడక రసార్థ
ప్రావిర్భావము లగుటయు, భావింప సమాధి యనఁగఁ బరఁగుం గృతులన్. ౭౮

### కాంతి

క. లోకవ్యతిరిక్తార్థ, శ్రీకలితయు నూతనప్రసిద్ధవిరచనా
పాక కమనీయయును నగు, నాకబ్బముసొబగు కాంతి యనఁ జనుఁ గృతులన్. ౭౯

---

## రీతుల లక్షణోదాహరణములు

### వైదర్భి

ఆ. ప్రాణదశక యుక్తి నల్ప ఘోషముల వర్గద్వితీయబహుత గలిగి ద్విత్రి
పదసమాస యైనఁ బరఁగు వైదర్భి సమాసరహిత యైన మధుర యండ్రు. ౯౦
చ. భుజమున విశ్వభూవరుఁడు భూభరముం దగఁ దాల్పఁ దాల్చినం
గజ భుజగేంద్రులున్ గుధర కచ్ఛప ఘోణులుఁ గామితక్రియా
భజనమునం జరింతు రని ప్రస్తుతులం బ్రసరించుచున్న యా
ద్విజ యజనంబులం ద్రిదశతృప్తి సమాప్తి వహించు నద్దివిన్. ౯౧

### గౌడి

క. ఘటితసమాసోద్భటపద, పటలయు నోజస్సుకాంతి భరితయు ఘోష
స్ఫుటవర్ణయు నిబిడార్థో, త్కటయును నా గౌడరీతి కల్పితకృతులన్. ౯౨
శా. శుభ్రాదభ్రపరిభ్రమత్పటుయశోజ్యోత్స్నాపరిత్రాసితా
తిభ్రష్టాధితమస్సమూహు లగుధాత్రీభర్తలం బోరిలో
విభ్రాజిల్లుచళుక్యవిశ్వవిభుదోర్విక్రాంతి పెంపొంది తా
నభ్రద్వీపవతీతరంగములతో నాడించుఁ గ్రీడాగతిన్. ౯౩

### పాంచాలి

క. పంచషపదకసమస్తతఁ, జంచన్మాధుర్యకాంతిసంచరదోజ
స్సంచితసుకుమారతలను, మించగుఁ బాంచాలరీతి మృదులాకృతి యై. ౯౪
మ. చతురోదారచళుక్యనాథకరశిక్షాజాత రేఖాసుధా
లతలం ద్రాలెడుచారుసాయకనటీలాస్యాంగహారాదులన్
బ్రతిగా నిచ్చటఁ జూచి తత్పరిచితిన్ బ్రాపించు శూరాదు ల
చ్ఛ్రుతరంభాపరినృత్యకృత్యముల నచ్చోఁ జూతు రచ్చంబుగన్. ౯౫

### లాటి

తే. ఏతదుక్తత్రిరీతిసమేత యగుచు
నల్ప ఘోషాక్షరములచే నతిశయిల్లి
తనరు సంయుక్త వర్ణముల్ దఱచు లేక
వెలసెనేనియు లాటికావృత్తి యండ్రు. ౯౬
మ. అనిశంబుం గరవాలభైరవుని పాదారాధనం బొప్పఁ జే
సినవారుం ద్రిదశాంగనాదయితు లై జీవింతు రిచ్చోటఁ జే
యనివారుం ద్రిదశాంగనాదయితు లై జీవింతు రచ్చోటఁ నం
చు నిరూపింతురు విశ్వనాథబిరుదస్తుత్యప్రభావం బిలన్. ౯౭
తే. తనరు శృంగార హాస్య శాంతములుఁ గృపయుఁ
దనరు మాధుర్యగుణమునఁ దగును జెప్ప

సద్భుతము రౌద్ర వీర భయానకములు
నమరు బీభత్సరసము నోజమునఁ జెప్ప. ౯౮

క. సకలరసములఁ బ్రసాద, ప్రకటితములఁ దక్కియున్న ప్రాణము లెల్లన్
సుకవుల కుచితనియోజ్యము, లకలంకత నెఱిఁగి యొనర సమరింప నగున్. ౯౯

క. ఇప్పగిది సులక్షణముల, విప్పగు కమనీయ కావ్యవితతులు నైకో
నెప్పుడు నీచిత్తమునన, చొప్పడు శీతాంబువంశచూడారత్నా! ౧౦౦

మ. మనుమోపేంద్రతనూజ సూరిజనతామందారభూమీజ భూ
జనరక్షాచతురత్త్రివర్గ హృదయాసన్నోల్లసద్భర్గ దు
ర్జనశిక్షాచణయుక్తదండ రిపురాజన్యాబ్జవేదండ చి
జ్జనితాశేషకళాభిరామ సమరస్థాణుప్రకారక్రమా! ౧౦౧

క. నందకపాణి పరాక్రమ, నందిమహాకాళతుల్యనవశైవకళా
నందోదయపద జగదభి, నందితసత్కీర్తి శోభనస్థిరమూర్తీ! ౧౦౨

మాలిని

చతురగుణగరిష్ఠా సర్వవిద్యావరిష్ఠా
శ్రుతివిహితచరిత్రా శూరసైన్యాళిజైత్రా
ధృతవిభవజయంతా ధీరవన్యావసంతా
వితతధృతినగేంద్రా విశ్వభూపాలచంద్రా. ౧౦౩

గద్యము

ఇది శ్రీమదుమారమణ చరణారవింద వందన గోవిందామాత్యనందన వివిధబుధ విధేయ
విన్నకోట పెద్దయనామధేయ విరచితంబైన కావ్యాలంకారచూడామణి
యను నలంకారశాస్త్రంబునం ద్రివిధకావ్యచాటుప్రబంధలక్షణ
వృత్తి రీతి ప్రముఖ నానావిధ విశేష సముద్దేశంబన్నది
చతుర్థోల్లాసము.

---

## పంచమోల్లాసము.

### అలంకారములు

క. శ్రీకాశీపతిపదనాళీకస్మృతిలోలచిత్త లీలావిజయ
శ్రీకర కులజలరాశిసుధాకర చాళుక్యవిశ్వధరణీనాథా! ౧

శా. కావ్యశ్రీల నలంకరించుట నలంకారంబులై చాల శ్రో
తవ్యార్థంబుల నొప్పి పూర్వకృతసందర్భంబులం బెక్కు లు
ద్భావ్యప్రోక్తుల నాఱు ముప్పదియు నై భాసిల్లు వానిం గవి
స్తవ్యాద్యుక్తపదస్వరూపములుగా సాగింతు శాస్త్రక్రియన్. ౨

వ. అది యెయ్యది యనఁగా—స్వభావాఖ్యానంబును, నుపమయు, రూపకంబును, దీపకంబును, నావృత్తియు, నాక్షేపంబును నర్థాంతరన్యాసంబును, వ్యతిరేకంబును, విభావనయు, సమాసోక్తియు, నతిశయోక్తియు, నుత్ప్రేక్షయు, హేతువును, నుదారంబును, సూక్ష్మంబును, లవంబును, క్రమంబును, ప్రేయస్కంబును, రసవంతంబును, నూర్జస్వియు, పర్యాయోక్తియు, సమాహితంబును, నుదాత్తంబును, నపహ్నుతియు, శ్లిష్టంబును, విశేషోక్తియు, దుల్యయోగితయు, విరోధంబును, నప్రస్తుతస్తుతియు, వ్యాజస్తుతియు, నిదర్శనంబును సహోక్తియు, పరివృత్తియు, నాశీర్వచనంబును, వక్రోక్తియు, భావికంబును, నన నర్థాలంకారంబులు షట్త్రింశత్ప్రకారంబులై వర్తిల్లుఁ దత్స్వరూపోదాహరణంబుల పరిపాటిం జెప్పుదు. నందు స్వభావాఖ్యానం బెట్టి దనిన. ౩

### స్వభావాఖ్యానము

క. జాతి గుణ ద్రవ్య క్రియ, లేతెఱఁగున నుండు నట్ల యింపుగఁ జెప్పన్
బ్రీతి స్వభావాఖ్యానము, జాతి యనం బరఁగు నదియు శాస్త్రజ్ఞులచేన్. ౪

శా. నీలశ్రీలఁ దనర్చి నిర్మలమునై నిస్తంద్రసౌరభ్యమై
చాలం బేశలరూపమై చులుకనై శాతోగ్రధారాగ్రరే
ఖాలంకారితమై దృఢత్సరుసముద్యన్మేఖలాబద్ధమై
వా లొప్పుం గరవాలభైరవజయావాలక్రియాశీలమై. ౫

క. జాతి గుణ ద్రవ్య క్రియ, లాతతజీవితము లందు రార్యులు శాస్త్ర
వ్రాతములకు సల్కావితా, జాతకములకు; వీనిఁ బొసఁగఁ జనుబో నొడువన్. ౬

### ఉపమ

క. గుణ ధర్మ కర్మముల నుల్బణ మయ్యెడువస్తువునకుఁ బరువడిఁ దుల్య
ప్రణయనముఁ జేయుం జెయ్యది, గణుతింతురు దాని నుపమగా బహువిధులన్. ౭

శా. చాళుక్యక్షితిపాలుఁ డొప్పు ననిలో శత్రుండునుంబోలె, దం
భోళిక్రీడఁ దనర్చు ఖడ్గ, మసుహృద్భూపాలకశ్రేణులుం
గూలుం గొండలభంగి, నంబరనటత్కోలధ్వజంబుం బొరిం
గ్రాలుం గాలవలాహకాకృతి, సురవ్రాతంబు గీర్తింపఁగన్. ౮

క. సతతప్రతిభోదయసంగతి నుపమానోపమేయకల్పనములయం
దలిచతురకవులతలఁపులఁ, బ్రతిపాద్యోపమలు పెక్కుభంగు లెఱుంగన్. ౯

క. లింగంబుల వచనంబుల, భంగులు హీనాధికతలపాటిఁగు వీడ్పొ
టుం గదిరిన నుపమకు నింపుం గలుగం జేయు నంద్రు బుధు లుచితోక్తిన్. ౧౦

తే. అరుగుచున్నాఁడు పేడివాఁ డతివపోలెఁ,
బలుకుచున్నది పురుషునిపగిది నింతి,
ప్రాణములు నాకు నీవఁ, దుపార్జితార్థ
మిన్నివిద్యలు నని నను నెసఁగు నుపమ. ౧౧

క. దేవా, నీ చందంబున, దేవేంద్రుం డొప్పు నచట దినకరుగతి ను
ర్వీవరుఁడు తేజమున సంభావితుఁడన నుపమ చెల్లుఁ బ్రౌఢప్రియమై. ౧౨

క. నిపుణులచెవి కెఱబఱ మగు, నుపమలు నొకకొన్ని గలవ యొక్కొకచోటన్
శుపవోలె జనుఁడు కృష్ణుఁడు, విపినంబునుబోలె వనధి విపులం బనఁగన్. ౧౩

ఆ. హంసివోలెఁ జంద్రుఁ డవదాతుఁడు, నభంబు
కొలఁకులట్లు సితము, కుక్కవోలె
నించు బంటు పతికి, నినుఁబోలె ఖద్యోత,
మనెడు నుపమ లపహాసనకరములు. ౧౪

సీ. సంకాశ నీకాశ సన్నిభ ప్రతిరూప తుల్య ప్రకాశాభ తులితములును
ప్రత్యనీక ప్రతిపక్ష సమాన ప్రతిద్వంద్వ నిభ సజాతీయములును
సదృశ సదృక్సమ సంవాది సప్రభ ప్రతిబింబజ కోపమా ప్రఖ్యములును
* పహాలక్షణ ప్రతిచ్ఛంద విరోధి సదృక్ష సవర్ణ సపక్షములును

ఆ. నుపమితానువాది యంత సరూప ప్రతి
నిధులు ననఁగఁ బెక్కువిధములైన
శబ్దములును నట్టి సత్క్రియాపదములుఁ
బొలుచుచోటఁ జెప్పఁ బొసఁగు నంద్రు. ౧౫

క. దొరయు గెడ జోడు పోలిక, సరి సంగడి యుద్ది యీడు సాటి పగిది నాఁ
గరణి యనఁ జాడ్పు చందం, బొరసు పరుసు నాఁగ నుపమ కొప్పం జెప్పన్. ౧౬

## రూపకము

క. ఉపమానంబునకును న,య్యుపమేయంబునకు రూపయోజన మేకో
ల్లపిత మయి వెలుఁగు నెచ్చటఁ, బ్రపంచితము రూపకంబు బహువిధలీలన్. ౧౭

---

* తద్వ శేకార్థ ప్రాంశత్వ సాధర్మ్యాను గూసకా భేదనిరూపణములు—పా.

ఉ. చారుచళుక్యవిశ్వనృపచంద్రుని నిర్మలకీర్తిచంద్రికా
సారముచే సుహృత్కుముదసంచయముల్ వికసిల్లు గర్వదు
ర్వారవిరోధివారిరుహవారములుం ముకుళించు నుల్లస
త్సూరిచకోరసంఘములు సొంపు వహించు ధరాతలంబునన్. ౧౮

వ. ఇది ప్రసిద్ధరూపకాలంకారం; బిందు భ్రాంతిమదలంకారంబునుం గల; దది యె ట్లనిన:— ౧౯

## భ్రాంతిమంతము

క. కవిసమ్మతి సారోప్య, ప్రవణానుభవంబు భ్రాంతిపద మగుఁ దత్సం
భవ మయ్యెడుదానికిఁ జేరఁగవిరళమఁగ భ్రాంతి మంత మనఁగాఁ బరఁగున్, ౨౦

క. చంద్రాన్వయుఁ డగువిశ్వన,రేంద్రుని సత్కీర్తిదీప్తు లేపారుటయున్
సాంద్రతరంబుగ నెల్లెడఁ, జంద్రశిలాతతులు పరఁగు సద్రవ లగుచున్. ౨౧

క. సుకవినిరూపణములచేఁ, బ్రకటిల్లుచు రూపకములు బహులాకృతులై
వికసిల్లు వాని తెఱఁగులు, వికటంబులు దెలియవలయు వివిధస్మృతులన్. ౨౨

## దీపకము

### ఆదిదీపకము

క. మొదలను నడుమను నొండెన్, గడిసి క్రియాపదము యొండెఁ గారక మొండెన్
బొదలి తదర్థము దెలిపెను, నది దీపకమనఁగఁ గృతుల నందం బెపుడున్. ౨౩

శా. కావించుం గులధర్మ మెప్పుడుఁ జళుక్యక్ష్మావిభుం డొప్పుగా
దేవశ్రేణి మదింప దిక్కరులు మోదింపన్ ధరాభారభృ
ద్గ్రావవ్రాతము సంతసిల్ల భుజగేంద్రప్రీతి సంధిల్ల న
వ్యావిర్భూతపృథుం డితం డనఁగ భవ్యశ్రీ వ్యక్తిశుఁ డై. ౨౪

### అంత్యదీపకము

క. నల నహుష భరత భానుజ, బలి బలిభేదులకు సాటి పాటి తులితుఁ డ
గ్గలికుఁడు గెడ సదృశుం డన, వెలయుం జాళుక్యవిశ్వవిభుఁ డెల్లెడలన్. ౨౫

### మధ్యదీపకము

మ. కవిసంఘంబునకున్ బటీర పటికా కస్తూరికా చేటికా
వివిధశ్రీల విభూతియున్ విజయమున్ విశ్వేశ్వరుం డిచ్చుఁ బో;
భువి సర్వజ్ఞుఁడు శంకరుండు నగుటన్ బోలించి శీలించినన్
భవనామస్తుతి భద్రదాయిని గదా భావింప నెవ్వారికిన్. ౨౬

## ఆవృత్తి

క. చెప్పినమాటయ పెక్కుగఁ, జెప్పుట యావృత్తి యనఁగ జెలు వగు; నదియున్
దప్పక మూఁడు తెఱంగులఁ, విప్పఁ బదార్థోభయానువృత్తులఁ బరఁగున్. ౨౭

### శబ్దావృత్తి

క. అరు లని విశ్వేశ్వరునకుఁ, దిరుగక క్రీడింతు రమరదిగ్గికలోఁ ద
త్పురవరపరిఖాతాయత, సరసులఁ గ్రీడించుఁ గ్రోడసంతతు లెపుడున్. ౨౮

### అర్థావృత్తి

క. శ్రీవిశ్వవిభుని వేఁడిన, యావిప్రులు విత్తవంతు లగుదురు, వారిన్
వావిరి నడిగినవారును, నావల ధనవంతు లగుదు రతిచిత్రముగాన్. ౨౯

### ఉభయావృత్తి

క. ధరణివరాహాంబపతి, ధరణి వరాహాంబవోలెఁ దాల్చిన నేకా
తురచరణ మైనధర్మము, కరిగతి నలు గాల నిలిచెఁ గలియుగవేళన్. ౩౦

### ఆక్షేపము

క. తొడఁగినకృతకృత్యంబుల, నడఁచునిషేధోక్తి దలఁప నాక్షేప మగున్
బెడఁ గగు సుకవులతలఁపుల,బడిఁ గాలత్రితయవిధుల బహుగతు లగుచున్. ౩౧

ఉ. 'వారక విశ్వభూవిభునివాలున కగ్గము గాకుఁ, దైలిరే
సేరస మబ్బు మిమ్ము వరియించినవేలుపుఁబువ్వుఁబోండ్లకున్
ధీరత మంటవెంట నరుదెంచినతెంపున మాకు,' నంచు వా
గ్వీరము వీరభార్య లెఱిఁగింతురు భర్తల కాహవంబునన్. ౩౨

### అర్థాంతరన్యాసము

తే. చెప్పఁ దొడఁగినయర్థసంసిద్ధికొఱకు
వేఱ యర్థము యోజించి వెలయఁ దెలుప
నదియ యర్థాంతరన్యాస మనఁగఁబరఁగుఁ
దలఁప నేర్చినఁ బెక్కుభేదముల నెగడు. ౩౩

మ. క్షమలో వేఁదనివారికేనియును విశ్వక్ష్మావిభుం డిచ్చు న
చ్చముగ్రై పొచ్చెము లేనిసంపదల శశ్వత్సర్వలోకాశ్రయ
త్వము, సైజంబుగ నట్ల కాదె తలఁపన్ వాంఛార్థహీనస్ఫుర
త్కమలోజ్జృంభణకల్పనంబు రవికిన్ గర్జంబు మిన్నందియున్. ౩౪

### వ్యతిరేకము

క. అమరఁగ శబ్దార్థంబులఁ, గ్రమతుల్యము లయ్యు భేదకథనముచే వ
ర్ణ్యము నలిరిక్తముఁ జేయుట, నమితవ్యతిరేక మనఁగ నగుఁ బలుకుబడిన్. ౩౫

మ. సుమనోరక్షణవైభవంబులను జిష్ణుత్వంబునం గ్రూరవి
క్రమవిద్విడ్బలమర్దనంబున సుధుర్యత్వంబు తుల్యంబపో,
యమరాధీశుఁడు గోత్రభంజనుఁడు గోత్రానందసంపాది వి
శ్వమహీపాలుఁడు, వీరికిన్ గుణకథా సాదృశ్య మేచందమో. ౩౬

## విభావన

తే. సహజ విఖ్యాత హేతువు జాఱ విడిచి
కారణాంతరకల్పనకథన మొండెఁ
గామవిహితస్వభావసంగతియ యొండె
సమరఁ బల్కు విభావన యనఁగఁ బరఁగు. 32

మ. స్ఫురదాధ్మాతకగాళకీలమును దంభోలిప్రభాభీలమున్
జల దస్పష్ట కృతాంతదండమును నై సంగ్రామరంగంబులోఁ
గరవాలంబు చళుక్యవల్లభుని చేఁ గ్రాలుం బరప్రాణసం
హరణక్రీడనదృష్టమృత్యురసనాహంకారఘోరంబుగన్. 3౮

## సమాసోక్తి

క. తగు వినిహితార్థగర్భిత, యగు నన్యార్థోక్తి గతి సమాసోక్తి యగున్
సుగమార్థగోపనము చే, నెగడిన నన్యాపదేశనియతిం బడయున్. 3౯

మ. స్ఫుటపున్నాగములం దొఱంగి కితవస్తోమంబుఁ బాటించి యు
త్కటపంకాంకితమూర్తులం గదిసి భద్రశ్రీలపైఁ గూర్మి దు
ర్ఘటముం జేసి సువర్ణముం దెగడి దుర్వర్ణంబు నర్థించి యే
చుటలం జెందిన మెచ్చునే నృపతులన్ సోమాన్వయుం డుర్వరన్. ౪౦

## అతిశయోక్తి

క. తనతలఁచిన యర్థము సొం,పున నింపున లోకవృత్తమున కతిశయిత
ధ్వని గలిగి కవులచెవులకు, నొనరినయది యతిశయోక్తి యొప్పగు గృతులన్. ౪౧
క. ఉల్లసితాలంకృతులకు, నెల్లఁ బరాయణము, కవుల కెలమి యనఁగ శ్లో
ఖిల్లుం, బెక్కుతెఱంగులఁ, జెల్లుం బోరి నేకపదము చే నొడఁగూర్పన్. ౪౨

మ. భరితార్తిం బరగండభైరవుని చే భగ్నాంగులై పాఱు త
త్పరిపంథి ప్రమదావలోకనగళ ద్బాష్పాంబుధారాపరం
పరపెల్లే మనిచెప్ప నంతయు జలాభావంబులై యుండు న
మ్మరుదేశంబు లనూపభూము లగు సీమామానహీనాకృతిన్. ౪3

## ఉత్ప్రేక్ష

క. అలవడ శబ్దార్థములకుఁ, జెలువంబగునన్యశక్తి సృజియించి సము
జ్జ్వల దుత్ప్రేక్షావ్యంజనములచే నుత్ప్రేక్ష యనఁగ మొనయుం గృతులన్. ౪౪
చ. కెరలు చళుక్యవిశ్వవిభుకేతువరాహము నన్యభీతికృ
ద్గురుతరకృత్య యందు రొకకొందఱు, కొందఱు వైరివాహినీ
నిరుపమమృత్యు వందు, రిట నే నయినన్ రిపురాజమండలా
హరణము సేయ వేఁడి పొలుపారెడిరాహువుగాఁ దలంచెదన్. ౪౫

క. గజభుజగాదుల దెసఁ గల, గజిబిజికిం గాక వీఁకఁ గొన్నది వోలెన్
భజియించి నిలిచె వలపటి, భుజమున విశ్వేశ్వరునకు భూసతి ప్రీతిన్. ౪౬

హేతువు

క. కారమును క్రియయును న ర్థారంభంబునకు బీజ మగు చేమిట నిం
పార నది హేతు వనఁ జను, భూరిప్రతిభావిశేషములఁ బెక్కు రయన్. ౪౭

శా. సంపల్లుంపటమందహాసములు సంజాతానుకంపాకళా
సంపన్నంబులు సాదరప్రియనయస్థానంబు లిద్ధక్రియా
సంపూర్ణంబులు నాఁగ విశ్వధరణీశ శ్రీకటాక్షాంశువుల్
సొంపుం బెంపును నింపు సేయు నెపుడున్ సూరీశ్వరశ్రేణికిన్. ౪౮

ఉదారము

క. ఆయాసోపార్జితము న,దేయమును మనోహరాభిధేయమ్మును శ్ర
ద్ధేయము నగుధన మొసఁగును, పాయ ముదారంబు నాఁగ నవనిం బర్వన్. ౪౯

శా. విశ్వేశావనిపాలపాలకునిచే విత్తాఢ్యులున్ సత్యభా
గశ్వారూఢులు నంబరాభరణచిహ్నాటోపులుం గామునీ
శశ్వత్సౌఖ్యసమగ్రమానసులునై చారుస్థితిన్ సత్కవుల్
నైశ్వర్యోన్నతిఁ బేర్తు రెప్పుడు తదౌదార్యం బవార్యంబుగన్. ౫౦

సూక్ష్మము

క. ఆకారేంగితకృత చే,ష్టాకల్పితసూక్ష్మగతుల సంలక్షిత మై
కైకొనఁ దగునంతర్గత, పాకాల్పత సూక్ష్మ మనఁగఁ బరఁగుం గృతులన్. ౫౧

ఉ. శ్రీల చళుక్యనాథుఁ డొసరించెను నేఁ డని గారవించుచో,
బాలకు లేఁతన వ్వధరపల్లవకాంతి నలంకరించె, వై
మాలపుసిగ్గు చూపులకు మాటుగఁ దోఁచెఁ, గుచోత్తరీయమున్
[illegible]డికంబు సేసెఁ, దిలకించిరి నెచ్చెలు లట్టిచేష్టలన్. ౫౨

లవము

తే. సూక్ష్మభావంబు విడువనిసొబగుతోడ
భావమునఁ దోఁచువస్తుగోపనము పేరు
లవము నాఁ జను; దేశకల్పనముతోడి
విమలినిందలు లవమున విస్తరిల్లు. ౫౩

చ. సుదతి యొకర్తు విశ్వవిభుఁ జూచి వడిం బులకించి లజ్జ లోఁ
గదిసిన నేర్పుతోడఁ జెలికత్తెల కిట్లను నింత యొప్పునే

మృదులపవనానిలం బనుగమించుమధువ్రతపంక్తితోన నిం
పొదవఁగ వీచె డిగ్గియలనుండి సరోజరజోవిలాసి యై. ౫౪

## క్రమము

క. ఉపమానము నుపమేయము, నుపమలఁ బరిపాటి తప్ప కుండఁగ నొడువన్
నిపుణత్వము క్రమ మనఁ జను, ప్రపటుప్రఖ్యాతశబ్దపంక్తుల చేతన్. ౫౫

ఉ. శ్రీరుచి వైభవోదయ శరీరవిలాసములందుఁ జూడఁగా
శౌరి శశాంక జంభరిపు శంబరశత్రులతోడ నెప్పుడున్
దోరపుటీడు జోడు సరి దోయి చళుక్యనరేంద్రుఁ డంచు నిం
పారఁగఁ జాటుసత్కృతు లుదారత మ్రోయు సభాంతరంబులన్. ౫౬

## ప్రేయము

క. ప్రేయోలంకారంబు వి,ధేయం బగుఁ బ్రియతరాభిధేయోక్తుల చే
నే యొగ్గు లేక కర్ణ ర,సాయన మై యుండెనేని సత్కవికృతులన్. ౫౭

మ. భవదుద్యత్కరుణాకటాక్షకిరణోత్పన్నంబు లస్మన్మహో
త్సవసంపత్ప్రకరంబు లెల్ల నని శస్తస్తోత్రులై విశ్వభూ
ధవు భూపాలగుణప్రకీర్తనలఁ బ్రీతస్వాంతులై కాంచి శా
త్రవు లర్చింతురు పాదపద్మముల నిర్యన్మౌళిరత్నద్యుతిన్. ౫౮

## రసవదలంకారములు

క. అసితం బగురత్నాది, ప్రసరణములఁ దేజరిల్లి ప్రథమరసాదుల్
పొసఁగఁ బడు నెచట నది వో,రసవదలంకార మనఁగ రసికుల కెక్కున్. ౫౯

## శృంగారరసము

చ. ఇల వలరాజురూపునకు నెక్కువ యయ్యెడువిశ్వమేదినీ
లలనునిరూపయౌవనవిలాసములం జెలిమాటు చేరి య
గ్గలికపుసిగ్గు వేడుకల క్రందున కడ్డపడంగ నిమ్ములన్
మెలఁతుక వాలుఁజూపులకు మేపులు వెట్టెడుఁ జూచితే సఖీ! ౬౦

## హాస్యరసము

క. లీలాచారుల బహుకో,లీనాత్ముల సతతసవ్యలీకులఁ జూడం
బూనెడువిశ్వేశ్వరుని న,వీనదరస్మితము లచ్చువెన్నెలఁ బోలున్. ౬౧

## కరుణరసము

క. అనిఁ దృణము గఱచి జేయని, నినదించుచుఁ బొరలు విమతనికరముఁ గరుణన్
గనుఁగొని కాచుట సైజము, గొనకొని యరిరాయగండగోపాలునకున్. ౬౨

## రౌద్రరసము

క. రుద్రుం డగు విమతనరో,పద్రవకరణములఁ గుపితబలభద్రుఁడగున్,
ముద్రణితకదనగతి నున్నిద్రాకృతి విశ్వమేదినీపతి చూడన్. ౬౩

## వీరరసము

క. అరివీరుల నమరావతి, కరిగించుచు వివిధధనము లర్థి వరుల కై
యొసవడి నొసఁగుచుఁ బరగెడు, నిరతోత్సాహంబు విశ్వనృపునక యొప్పున్. ౬౪

## భయానకరసము

క. రిపునృపులు విశ్వనాథ, ప్రపటుధ్వజదంష్ట్రిఁ జూచి పరఁగినభీతిన్
విపినవరాహంబుల నిల, నిపుడుం గనుఁగొనఁగ వెఱతు రట్టితలఁపులో. ౬౫

## బీభత్సరసము

మ. అతిదృప్యత్పరగండభైరవభుజోద్యత్ఖడ్గకృత్తాహిత
చ్యుతభూరిక్షతజప్రవాహములలో శుండాలరుండావలీ
కృతలీలాచరయానపాత్రములలోఁ గ్రీడించు నాగౌఘధన
క్షితి భూతంబులు మజ్జమాంసరసమస్తిష్కప్రమత్తంబు లై. ౬౬

## అద్భుతరసము

క. సమధిక మగు నచ్చెరువు వచ్చముగా విశ్వేశుదానజలధారాపూ
రముచేతఁ జేతి కందును, విమలాంబరకనకహారులు విద్వత్తతికిన్. ౬౭

## శాంతరసము

క. విశ్వేశుమహిమ విని కని, విశ్వంభర విడిచి మదము వీడ్కొని విమతుల్
శశ్వద్దమశమయుక్తి ననశ్వరు లై నిలుతు రమరనగముల నదులన్. ౬౮

## ఊర్జస్వి

క. అతులితబలపదహంకృతి, యుత మగువాక్యంబు దలఁప నూర్జస్వి యగున్
బ్రతిభటతర్జనగర్జన, వితతాక్షేపములచేత విస్ఫుట మెపుడున్. ౬౯

మ. కపటద్విట్కరవాల భైరవుఁడు ఖడ్గాఖడ్గిసంక్రీడలన్
గుపితాటోపనిరూఢి నుగ్రరిపురక్షోరాజనారాయణుం
డపరాపిష్కృతరుద్రుఁ డన్యపురదాహప్రౌఢిచే విశ్వభూ
మిపుఁ డమ్మేటి నెదుర్చుటల్ జమునితో మేలంబు గావించుటల్. ౭౦

## పర్యాయోక్తి

క. కార్యార్థ క్షప్తిచేఁ ద,త్కార్యార్థప్రాప్తిఁ గొఱకు గల్పించిన మా
ధుర్యయుతభాషితం బది, పర్యాయోక్తంబు నాఁగఁ బరఁగుం గవిత్వన్. ౭౧

చ. సురుచిరరత్నకీలితము సూతము బన్ను సరంబు సూపు, క
ప్పురపుఁగరండమున్ దెఱచి పుచ్చు వెలుంగున, నంచు విశ్వభూ
వరుఁ డొకయింతిఁ బల్కుటయు వచ్చిననెచ్చెలు లంతటంతటన్
సురుచిరసాలభంజికలచొక్కపుజోటులువోలెఁ జూడఁగన్. ౭౨

## సమాహితము

తే. కడఁకతో మున్ను దొరకొన్నకర్జమునకు, సాధనము దైవవశమునఁ జాగెనేని
యది సమాహిత మని చెప్ప నతిశయిల్లుఁ, గార్యకర్తకు నానందకరణ మగుచు. ౭౩

ఉ. మానిని విశ్వనాథుపదమంజరులున్ దనఫాలపట్టమున్
మానుగఁ గూర్తు నంచు నభిమానము మానఁ దలంచుచోట న
మ్మానవనాథుఁ డచ్చ మగుమక్కువ నచ్చటి కేఁగుదెంచి త
త్మానశరాసనాస్త్రములఁ జూఱఁగొనుం గరుణాసమేతుఁ డై. ౭౪

## ఉదాత్తము

క. అతులైశ్వర్యాశ్రయముల, వితతత్వ ముదాత్త మనఁగ విశ్రుత మగు నం
చితసంపద్బహుళము నూర్జితపదమును నగుచుఁ గార్యరీతులయందున్. ౭౫

శా. వంశం బీశ్వరమౌళి మండనమహోఽవార్యంబు, నిర్నిద్రని
స్త్రింశం బింద్రపురస్థితాహితసుతిశ్రీకంబు, చక్రాచల
ప్రాంశుధ్వాంతనిహంత్రి కీర్తి, వినమద్రాజన్యకోటీరర
త్నాంశూదంచిత మంఘ్రియుగ్మము, చళుక్యస్వామి కెల్లప్పుడున్. ౭౬

## అపహ్నుతి

క. కలయర్థనిరసనంబున, నలవడునన్యప్రకార మగునర్థము చే
వెలయు నపహ్నుతి యనఁగాఁ, బలికెద వెరవులను బెక్కుపాకము లగుచున్. ౭౭

మ. ఘనమేఘం బది వాజిగా దతఁడు నిక్కం బింద్రుఁ డారోహకుం
డనరా దంగమరీచి గాద ది తటిద్వ్యాపార ముద్యత్ఖుర
ధ్వని గా దంబుదఘోషణం బది ధరన్ దక్కొంట నీసొంపు లే
దని భావింతురు విశ్వభూవిభుని యశ్వారోహణక్రీడలన్. ౭౮

## శ్లిష్టము

క. ఏకార్థోక్తం బయ్యు న, నేకార్థము చిలుఁకుచుండు నెయ్యది యదివో
లోకమున శ్లిష్టమనఁగాఁ, గైకొనఁ దగుఁ బదవిచిత్రకల్పనవిధులన్. ౭౯

మ. మరుదుత్ఖేలదశోకపల్లవయు సమ్యక్పత్త్రసందోహయున్
భరితామోదయు జృంభమాణ సుమనోభద్రప్రదేశంబునై
యరుదై యొప్పెడువిశ్వభూపవిపులోద్యానావళిం జూడఁ ద
త్పురిరమ్యం బోలెఁ దనర్చె నింతి మహిళా పున్నాగపూగంబులన్. ౮౦

## విశేషోక్తి

క. జాతిక్రియాగుణాదుల, యాతతహీనత్వకథన మలవడు నెచటన్
బ్రీతివిషయేతరార్థ, స్ఫీతతకై యదియ తగు విశేషోక్తి యనన్. ౧౯౧

మ. చటులక్రోడపతాక యెత్తరు బృహత్సైన్యంబు పైఁ ద్రోవ రు
ద్భటనిస్సాణరవం బెలర్ప రతిదృప్యద్దండగోపాలు భ్రూ
కుటిమాత్రోదితచేష్టచేతన రిపుక్షోణీశు లంతంతటన్
స్ఫుటజూటంబులు దాల్తు రెక్కడ గదా భూరిప్రభావం బిలన్. ౧౯౨

## తుల్యయోగిత

క. ఖ్యాతగుణంబులచే నుద్యోతితసదృశోక్తి తుల్యయోగిత యగుఁ బ్ర
స్ఫీతస్తుతి నిందనములు, జాతీయముగాఁగఁ జెప్పఁ జను నండ్రు బుధుల్. ౧౯౩

శా. కాలవ్యాలముఁ గాలకూటమును నిర్ఘాతంబు ఘోరానల
జ్వాలాజాలము నీకృపాణమును దుర్వారంబు లుగ్రక్రియా
లోలక్రీడల నంచు నెన్నుదురు భూలోకాదిలోకంబులన్
జాళుక్యాన్వయవిశ్వభూప సమిదిజ్యాశీలమంత్రోజ్జ్వలా! ౧౯౪

## విరోధము

క. తమలో నొంటను రెంటఁ బదములకు సంభావితార్థ దర్శన మెచటన్
గ్రమమున విరుద్ధ మగు నది, యమరు విరోధంబు నాఁగ నయ్యెయెడలన్. ౧౯౫

చ. అనిమొన విశ్వభూవిభునిహస్తకృపాణము చంద్రహాస మ
య్యును మఱి చిత్రభాను వన నుజ్జ్వల మయ్యెడుచోట నప్సరో
వనితలచన్నులం బులకవర్గము నెక్కొను వైరిభీరు లో
చనముల నశ్రువారములు సొల్పడు నందును నిందుసుం బొరిన్. ౧౯౬

## అప్రస్తుతస్థితి

తే. వివిధసేవాదికంబుల విసువుచేత, నడరి యప్రస్తుతస్తుతి యనఁగ బరఁగు;
ననుచితార్థప్రశంసనమయ్యు నదియు, నొనరనొక్కొక్కచోటున నొప్పనొసఁగు.

చ. కస వశనంబు పేయ ముదకంబు విహారము గానలోపలన్
వసుమతి శయ్యప ట్టొరులవంకఁ జరింపమి సంతసం బిలన్
బసులకు నెల్ల వృత్తి, జనపంక్తుల కైన నభీప్సి తేందిరా
వసుమతి యైన విశ్వజనవల్లభుదృష్టియ వృత్తి నిచ్చలున్. ౧౯౮

## వ్యాజస్తుతి

క. వ్యాజస్తుతి యనఁగఁ బరిభ్రాజిత మగు నిందపోలె బ్రణుతింపంగాఁ
దేజం బెసఁగెడు కథనము, రాజిల్లెడు మధురవచనరచనలచేతన్. ౧౯౯

ఉ. ఈతఁ డుపేంద్రపుత్త్రుఁ డటె యింతుల నేఁపక యేలమాను? ప్ర
ఖ్యాత వినూత్న భద్రుఁ డటె కాంతల నేఁపక యేల తక్కు? వి
ద్యోతకళాధరుం డటె వధూటుల నేఁపక యేల యుండు నే
రీతి? నటంచు విశ్వవిభుఁ బ్రీతి నుతింపుదు రంగనాజనుల్. ౯౦

## నిదర్శనము

క. తిర మగునొకయర్థముతో, సరి యగునర్థాంతరంబు సమకొల్పి తగన్
బర మైన నపర మైనను, ధరణి నిరూపింపఁగా నిదర్శన మయ్యెన్. ౯౧

ఉ. ఇవ్వసుధం గవిప్రవరు లెచ్చట నుండియుఁ జెంద కుండినన్
మవ్వ మెలర్ప విశ్వనృపమన్మథుఁ డిచ్చు నభీష్టసంపదల్
నివ్వటిలంగ, నత్తెఱఁగు నిశ్చితకృత్యము, యాక తక్కునే
దవ్వులనుండి యైన రవి తమ్ముల కిమ్ముల నవ్వికాసముల్. ౯౨

## సహోక్తి

క. సమగుణధర్మము లగుభావములఁ గ్రియాసదృశ యగుచు నచనార్థముతో
నమరిన సహోక్తి యనఁ జను, సముచితచతురార్థశబ్దసంఘటనమునన్. ౯౩

చ. వసుధ జిగీషఁ జైనళళివంశ్యుని కీర్తులతోన చంద్రికా
విసరము సాఁగె దిక్కులను, విభ్రమదశ్వఖురోన్నమద్రజః
ప్రసరములోన తోయజపరాగము వ్రాఁకె నభంబు, మిత్త్రమా
నసపరిశుద్ధితోన మలినత్వము వీడ్కొనె వారిపూరముల్. ౯౪

## పరివృత్తి

క. సరి నన్యోన్యార్థములం, బరువడితో మార్చుకొనుట పరివృత్తి యనం
బరఁగుం బలికెడువెరవుల;, నరయనలంకారకరణ మగుసత్కృతులన్. ౯౫

శా. సవ్యాసవ్యవిఘాతశాలి యగు నీ చాళుక్య విశ్వేశు నా
స్తవ్యావల్గదసిప్రభావము ప్రశస్తప్రౌఢి దీపింపఁగా
భవ్యాంగంబుల నాహరించి యనిలో భద్రక్రియాపాది యై
దివ్యాంగంబుల నిచ్చుఁ జేర్చి మదవద్వీరాహితశ్రేణికిన్. ౯౬

## ఆశీర్వచనము

క. ఆశీర్వచన మనంగా, నాశాస్యపదార్థసమ్యగాశంసన మి
ద్ధాశయమున భద్రములకుఁ బ్రకాశింపఁగఁ దగు నశేష కావ్యముఖములన్. ౯౭

ఉ. వేలుపుటిల్లువిల్లు వెడ వీఁకలపోకలనారి, రెండుచే
దోల వెలుంగుతూ పెచటఁ దోలినఁ బాఱని తేరు మాటలై
గ్రాలెడు తేజు లెవ్వనికిఁ గల్గు నతండు చళుక్యవిశ్వభూ
పాలుమనంబునం బరవిభంజనుఁ డై విహరించుచుండెడున్. ౯౮

### వక్రోక్తి

తే. స్తుతియు నభయంబుగా మున్ను దోఁచి పిదపఁ
దోడులో వంకవంకయై దొరకుపలుకు
కవులు వక్రోక్తి యన నొప్పుఁ గబ్బములను
గల్పనీయార్థ వశమున గానవలయు. ౯౯

మ. పరపుష్టంబులు కోకిలంబు లనిశభ్రాంతుండు చంద్రుండు క్రో
వ్విరు లస్త్రంబు లనంగుఁ డంగభవుఁ డీవీతెండ్లు నిన్నేఁచ ను
ర్వరఁగో నెంతటివారు? వారక సఖుల్ వారింపఁగాఁ బోయి సుం
దరి విశ్వేశ్వరుఁ జూచి, తద్విభుమహత్త్వం బీదశాభేదముల్. ౧౦౦

### సంకరము

క. వివిధాలంకృతి సమ్మతిఁ, జవిగా నొనగించు నర్థసంగతిచేతన్
సవర నయి కర్ణముల కుత్సవపద మగుకబ్బ మరయ సంకర మయ్యెన్. ౧౦౧

మ ఆనిలోనం గరవాలభైరవుఁడు వీరారాతులం గూల్చు న
ర్జునుఁ డీతం డనఁగా, సురాంగనలకున్ శూరాహిత శ్రేణికిన్
దనరించుం దగులంబు లచ్చుపడ నుద్యద్రాజకందర్పుఁ డై,
ఘనకీలాలము లుబ్బఁ జేయు ఘనవిఖ్యాతిం బ్రపూర్ణంబుగాన్. ౧౦౨

### భావికము

తే. భావ మనఁగను గవియభిప్రాయ మంద్రు,
భావభేదనియుక్తంబు భావికంబు
వివిధరూపప్రబంధోక్తివిషయగుణము;
దగు వివేకింప సూక్ష్మ సందర్శనమున. ౧౦౩

చ. వివిధపదార్థభావరసవృత్తుల రీతులఁ గావ్యపాకసం
భవ మగుసూక్ష్మ బంధమునఁ బర్వునలంకృతు లెల్లఁ జూచి స
త్కవులవివేక మెల్లఁ బొడ గానఁగ నేర్చుచటుక్యవిశ్వభూ
ధవుఁ డనుమాట లొజ్జల వి దర్ప మెలర్ప సభాంతరంబులన్. ౧౦౪

ఉ. చంద్రకులాగ్రగణ్యుడు ప్రశంసితపుణ్యుఁడు సత్యధీహరి
శ్చంద్రుఁడు శైవతంత్రవిలసద్వృషభేంద్రుఁడు నీతితత్త్వని
స్తంద్రుఁడు శౌర్యలోలుఁడు బుధప్రియశీలుఁడు భూరివిక్రమో
పేంద్రుం డుపేంద్రనందనుఁడు భీమపబానిశవందనుం డిలన్. ౧౦౫

క. గంధర్వకళావిదుఁ డరి, గంధద్విపమదవిమర్దకంఠీరవుఁ డు
ద్బంధురవరాహకేతుఁడు, బంధుపయోరాశికుముదబాంధవుఁ డెపుడున్. ౧౦౬

## మాలిని

అహితనగరరుద్రుం డంగనాసంఘభద్రుం
డహిమకిరణతేజుం డర్చ్యవిద్వత్సమాజుం
డహసితకులశీలుం డర్థివర్గానుకూలుం
డహరహరుదితార్థుం డాజిపార్థుండు శక్తిన్. ౧౦౭

గద్యము

ఇది శ్రీమదుమారమణ చరణారవిందవందన గోవిందామాత్యనందన వివిధ బుధవిధేయ విన్నకోట పెద్దయనామధేయ విరచితం బైనకావ్యాలంకార చూడామణి యను నలంకారశాస్త్రంబునందు నర్థాలంకారసముద్దేశం బన్నది పంచమోల్లాసము.

---

# షష్ఠోల్లాసము

## శబ్దాలంకారములు

క. శ్రీశుఁడు హృదయాంతరిత గిరీశుఁడు పదవినమదరినరేశుఁడు విజయా
ధీశుండు విజయతత్పర, వేశుఁడు చాళుక్యవంశవిశ్వేశుఁ డిలన్. ౧

క. శీలింపవలయు మది శ, బ్దాలంకారంబు లైనయమకాదివిచి
త్రాలిఖితబంధభేదము, లోలిన యొకకొన్ని వాని నొనరింతుఁ దగన్. ౨

క. కలయఁబడి రూపకాదుల, కలవడు సంసృష్టిసంకరాఖ్యలు కృతులన్
విలసితమణికనకమరీ, చులను మిశ్రమును బోలె శోభాధికతన్. ౩

## శబ్దసంసృష్టి

క. తిలతండులములు సరి సరిఁ, గలసినగతి రూపకాదికంబులు తమలో
పల బెరసి యుండు నెచ్చట, లలి నది సంసృష్టి యను నలంకృతి యయ్యెన్. ౪

తే. వృత్త్యనుప్రాసపదసమావృత్త మైన, శబ్దసంసృష్ట్యలంకారసంజ్ఞితంబు
వినుమర్దళమంజులధ్వనియుఁ బోలెఁ, గర్ణములకెప్డు నానందకరణ మగును. ౫

చ. గుహ భృగురామ రామ సమకోపవిభూషితవిశ్వభూమిభృ
ద్బహుబలబాహురాహువు కృపాణముఖోద్ధతిఁ జేర్చి తత్సమి
త్సహి విహరించుచో నహితమండల మైందవమండలంబుగా
విహితవివేకు లై గగనవీథిఁ దలంతురు వేల్పు లాత్మలన్. ౬

## క్షీరనీరన్యాయసంకరము

తే. పాలు నీరును గలసి యేర్పడకయున్న
కరణిఁ దద్రూపకాదులు బెరయు నెచట
దొరసి యది క్షీరనీరసంకరము నాఁగఁ
గబ్బముల నుండు నంగాంగికముల చేత. ౭

శా. సత్రాచారము చెప్ప నొప్పు నిల విశ్వస్వామి కెట్టన్న న
ద్ధాత్రీశాధ్వరభోజనంబులను దక్షగ్దాహతారిప్రియా
మత్రక్రీడల నిత్యదానముల సమ్యక్ప్రీతి వర్తింతు రా
సుత్రామాదులు నప్సరోగణములున్ సూరీంద్రులుం దద్దయున్. ౮

## నరసింహసంకరము

క. లసితాలంకృతిసంధులు, గసిబిసి యై చెదరకుండఁ గల్పించినఁ బొం
దెసఁగెడు సంయోగం బది, రసికులు నరసింహసంకరం బనఁబరఁగున్ ౯

మ. పసితో దగ్గుఁడు విశ్వనాథుఁ డనిలోఁ బర్జన్యుచందంబునన్
గనుపట్టం బటహారవంబు మొరయం గర్జోపమానోద్ధతిన్
దనరించున్ రుధిరాపగానికరముం దద్యోధబాహుభ్రమ
ద్ఘనకోదండపయోధరప్రవిగళత్కాండావళీవర్షముల్. ౧౦

క. ఒక తెఱఁ గిది శబ్దార్థ, ప్రకటనములసంకరములు బహువిధము లిలన్
సుకవులు ప్రతిభాభణితుల, సకలంబు నెఱుంగవలయు శాస్త్రములందున్. ౧౧

## అనుప్రాసములు

ఆ. ఛేక వృత్తి లాట సిద్ధంబులగు నను
ప్రాసములు ధరిత్రిఁ బరఁగు మూఁడు
లలితవృత్తి: వానిలక్షణోదాహర
ణములు తెలియవలయు యమకవిధుల. ౧౨

## ఛేకానుప్రాసము

క. ఛేకాను ప్రాసం బనఁ, నాకర్ణిత మగుచునొప్పు నర్థము వేఱై
చేకొన్నవ్రాల యొప్పటి, చేకొనఁబడు నేనిఁ గృతుల సిరులకు నెలవై. ౧౩

క. కందర్పదర్పదము లగు, సుందరరతిహాసరుచుల సుందరి యందం
బందముగూరఁగ శంకర, వందారూదారు విశ్వవరు నర్చించెన్. ౧౪

## వృత్త్యనుపాసము

తే. ఒకటి రెండును మూఁడునై యొలయువ్రాలు
పద్యమున నచ్చటచ్చటఁ బరఁగునేని
వృత్త్యనుప్రాస మన నది విస్తరిల్లు
లలితరీతుల కెల్ల విలాస మగుచు. ౧౫

ఉ. చొక్కపుటుక్కు క్రిక్కిఱిసి స్రుక్కన పెక్కుక నక్కజంపుట
న్నెక్కుక చక్కనై బ్రమకునిక్క నెఱింగితి రేవి శాత్రవుల్
మొక్కల మేది మ్రక్కె యని మ్రొక్కుదు, మ్రొక్కక నిక్కుచున్న మీ
టెక్కులు చక్కఁబెట్టు విఘటించి చళుక్యనరేంద్రుఁ డిక్కడన్. ౧౬

## లాటానుప్రాసము

క. పాటిఁ జెప్పిన శబ్దము, చాటుగతిన్ సొరిదిఁ బల్కు చక్కఁద మర్థా
ఘాటోత్కర్షము చేసిన, లాటానుప్రాస మనఁగ లలితం బయ్యెన్. ౧౭

చ. ధరణిఁ జళుక్యవిశ్వవిభుదానము దానము కీర్తి కీర్తి ధీ
కరనుగువాలు వాలు రణగర్వము గర్వము గాక కల్పితే
తరనృపనామధారకులదానము దానమె కీర్తి కీర్తి యే
కరమున వాలు వాలె రణగర్వము గర్వమె పౌరుషక్రియన్. ౧౮

## శృంఖలన్యాయబంధము

క. మొదలిపదం బటమీఁదటి, పదయుక్తికి హేతు వగుచుఁ బరువడిఁ గలయన్
దుదపదముతోడ నడిచిన, నది శృంఖలమాలబంధనాఖ్యం బెరయున్. ౧౯

చ. ధరణి శ్రుతంబుచే నఖిలధర్మము ధర్మముచేత నర్థసు
స్థిరతయు నర్థసుస్థిరతచేత బలోదయముల్ బలోదయా
చరణముచే జయావహము సంపదయుం బ్రభవించు విశ్వభూ
వరునకు, నీతిమార్గమున వావిన చేరవె నిత్యభద్రముల్. ౨౦

## ఏకావళి

తే. ఆదిశబ్దంబునకు మీఁద నడరుపదము
దగువిశేషణములతోడఁ దగిలి వరుస
గొలుసుగాని యర్థసంగతిఁ గూడెనేని
యదియు నేకావళీసంజ్ఞ నడరు నండ్రు. ౨౧

చ. మదిఁ దలపోయ విశ్వవిభుమంజులభాషలు సర్వసంపదా
స్పదములు సర్వసంపదలు సజ్జనసేవ్యలు సజ్జనౌఘముల్
బొదలు విభూతియుక్తము విభూతియు నిత్యసమృద్ధ యిట్టిభ
ద్రదభరితానుభావ మొకరాజునకుం గలుగంగ నేర్చునే. ౨౨

## ప్రతిషేధబంధము

తే. ఇవియె కవితలఁ దగఁ జెప్ప నెఱిఁగెనేని
బరఁగు బ్రతిషేధశృంఖలబంధ మనఁగఁ
బదము పదమునఁ బ్రతిషేధఫణితి గలిగి
పటుపదాలంకృతులచేతఁ బాటి యగుచు. ౨౩

తే. ఎచటఁ బ్రజ లూర్జితశ్రీల నెసక మెసఁగ
రది దలంపఁగ నెపుడు రాజ్యంబు గాదు,
విశ్వభూవిభుఁ డేరికి విభుఁడు గాఁడు
పట్టి చూడంగ వారలు ప్రజలు గారు. ౨౪

## మాలాదీపకము

క. మొదలిపదంబుననుండియు, నుదయోత్కర్షంబు లుత్తరోత్తరముగ నిం
పొదవఁగఁ బరువడి నెలకొను, నది మాలాదీపికాఖ్య మనఁ జను గృతులన్. ౨౫

చ. ప్రకటిత మైనవిశ్వవిభు పాణిఁ బుట్టె వితీర్ణి, యా వితీ
ర్ణిఁ గసిఁజకీర్తి గల్గె, నతినిర్మలకీర్తికి నుద్భవించె నీ
సకలవికర్ణవిశ్రుతులు సజ్జనకర్ణవిభూషణంబులై, ౨౬
కొమకనికి నేల యబ్బు నిటు లొప్పెడు నుత్తమనిత్యసంపదల్.

## సారాలంకారము

తే. పలుకుపలుకున నుత్కర్ష బంధసిద్ధి, యుత్తరోత్తరసారమై యొప్పి నమరు,
నయ్యలంకృతి సారనామాఖ్యఁ జెందుఁ, జెవులకింపుగ సుకవులు చెప్పిరేని. ౨౭
క. దేవతలకు వరుఁడు మహా, దేవుం డద్దేవునాశిరముకు జరియించుక
జైవాతృకుఁ డాతనికుల, పావనుఁడు చళుక్యవిశ్వపతి యిల నొప్పున్. ౨౮

## యమకములు

క. యమకాదిచిత్రబంధ, క్రమములు బహులములు, వాని గతి భాషాకా
వ్యములకు నుచితములై చన, నమరింతుం గొన్ని వరుసఁ దగుఁ దెలియంగన్. ౨౯
క. వచ్చినవర్ణంబులు కడు, నచ్చములై మొదల నడుమ నంతమునఁ గవుల్
మెచ్చఁ దదర్థము లలవడి, యచ్చెరువులు గాఁగఁ జెప్ప నగు యమకంబుల్. ౩౦
ఆ. ఆది మధ్యాంత గోచరాఖ్యత్రయంబు
నాదిమధ్యగతంబు మధ్యాంతగతము
వరుస నాద్యంతగతము సర్వగము ననఁగ
యమకములు సప్తవిధముల నమరు నండ్రు. ౩౧

## ఆది యమకము

తే. ఉక్తశబ్దంబు తుదశబ్ద ముక్తశబ్ద
విధమునఁ దోఁచి యర్థంబు వేఱె యగుచు
వీనులకు నింపు సొంపును నీనెనేని
నాదియమకంబు నాఁ జను నండ్రు బుధులు. ౩౨
క. వాసవవాసవధూ సువి, లాసములం దెగడి తెగడులలనలమనముల్
వాసించు నాత్మగుణముల, భాసురుఁ డగువిశ్వవిభునిపటువిక్రమముల్. ౩౩

## మధ్య యమకము

క. హృద్యార్థంబై పరఁగెడు, పద్యమునకు నిట్లు యమకబంధము నడుమం
బ్రద్యోతించిన నది యన, వద్యంబుగ మధ్యయమకవైభవ మెసఁగున్. ౩౪
క. శ్రీకీర్తిచంద్రికల విద్యాకైరవవితతు లలరఁ దలకొలిపెడు నీ
చీకుల పోకులపోరుమ, మాకుముదహితాన్వవాయుఁ డగు భూపతికిన్. ౩౫

## అంత్య యమకము

క. పాదము లుక్తక్రమ సం, పాదితగతి నొప్ప తుదను భావాలంకా
రోదయకరమై యమకం, బాదృత మగునేని యంత్యయమకం బయ్యెన్. ౩౬
తే. లీలఁ జాళుక్య విశ్వభూపాలవరుని
విజయలక్ష్మీకరగ్రాహవేళలందుఁ
జెవుల కింపుగఁ దొడరి ఘోషింపఁ దొడఁగె
గటుల కళ్యాణకళ్యాణగౌరవములు. ౩౭

ఆదిమధ్యయమకము

క. పరపురఁ బద్మాకర మన, బరికల్పిత మగుచుఁ బరఁగుఁ బద్మాకర మై
ధర నెగడు విశ్వభూవరు, వర సదనము బుధులపాలివైభవ పదమై. ౩౮

మధ్యాంత్యయమకము

క. పరగండభైరవుని యరి, వరులును ముక్తాతపత్త్రవైభవు లెపుడున్
పరగండభైరవుని కవి, వరులును ముక్తాతపత్త్రవైభవు లెపుడున్. ౩౯

ఆద్యంత్య యమకము

క. హరిదంబరవిక్రముఁ డనఁ, బరఁగుం జాళుక్యవిశ్వపార్థివుఁ డనుచున్
బొరిఁ బొగడుదు రరినృపతులు, హరిదంబరవిక్రమప్రయత్నయశస్కున్. ౪౦

సర్వయమకము

క. వనవర్గనివసదహితుఁడు, వనవర్గప్రీతదివిజవల్లభుఁడు సకృ
ద్వనవర్గశివవయస్యుఁడు, వనవర్గారుఁ డండు విశ్వవసుధేశుఁ డిలన్. ౪౧

పాదత్రయ యమకము

శా. శస్త్రోదంచితుఁ డైన యవ్విభు విపక్షశ్రేణికి న్విభ్రమ
త్సవ్యస్త్రీతస్ఫుటకంకణధ్వని రణస్థానంబున న్విభ్రమ
త్సవ్యస్త్రీతస్ఫుటకంకణధ్వని మరుత్సౌధంబుల న్విభ్రమ
త్సవ్యస్త్రీతస్ఫుటకంకణధ్వని సరిత్సంగంబులం జేతుఱున్. ౪౨

ద్వితీయోపమానగోపనము

సీ. విద్యావిభూతి వివేకసంపన్నత వాణీశ వాణీశ వైభవంబు
శౌచ ప్రతాపాతిసత్త్వసమగ్రత శిఖిమిత్ర శిఖిమిత్ర శీలనంబు
గాంభీర్య భోగ రంగద్రత్నసామగ్రి జలధీంద్ర జలధీంద్ర విలసనంబు
విక్రమ సౌందర్య విపులదర్పోన్నతి బలభద్ర బలభద్ర బంధురంబు
తే. దాల్చి వెలుఁగొందు విష్ణువర్ధనకులాబ్ధి
చంద్రుతో విశ్వభూపాలచంద్రుతోడ
చంద్రధరపాదభక్తినిస్తంద్రుతోడ
నితరనృపునకుఁ దుల్యత్వ మెట్లు గల్గు. ౪౩

నిరోష్ఠ్యము

క. పంచమ వర్గాక్షరములు, వంచించి హితోచితార్థవంతంబులు గా
వించినకబ్బము వీనుల, కంచిత మై యది నిరోష్ఠ్య మన నొప్పారున్. ౪౪

శా. చాళుక్యక్షితినాథునూర్జితయశస్సంక్రాంతిచేఁ దూలు లో
కాలోకాద్రిఁ దనర్చుచీఁకటులు, కైలాసోల్లసద్దీధితుల్

సాలం దెల్లనిచాయపలం దనరు, నాశాదంతు లంతంతకున్
గాలాకారత నుజ్జగించు ననుచుం గాంక్షింతు రత్యుక్తులన్. ౪౫

### గూఢ చతుర్థము

క. మొదలిచరణత్రయములోఁ, బదిలముగాఁ గవిత నంత్యభాగాక్షరముల్
గదియం గ్రమమున నిల్పిన, నది గూఢచతుర్థ మనఁగ నద్భుత మయ్యెన్. ౪౬

చ. చతురుఁ బరార్థ్యశీలుఁ గవిశశ్వదభీప్సితభూరిదానదున్
వితతభుజానిసర్గబలు విక్రమసన్నుతి సేవితోదయున్
మతి కెను రెల్ల సేసికొని మాన్యుల కాలము కాని మానులై
చతురులు విశ్వభూవిభుని సన్నుతి సేయుదు రెల్ల కాలమున్. ౪౭

### చతుర్విధకందము

తే. ప్రథమకందంబు రెండవపాదయుగము
నందు రెండవ గణవర్ణ మాదిగాఁగఁ
గడయు మొదలును వరుసతోఁ గలిపి చదువ
నగుఁ జతుర్విధకంద మై యార్యసభల. ౪౮

### మొదటికందము

క. చాళుక్య విశ్వవిభునకు, వాలున్ బుధనుతియు సుగుణ వర్గము నిధులున్
జాలుటయు నీతినిరతియు, మేలున్ మధురతయు నీగి మీఱినవిధమున్. ౪౯

### రెండవకందము

క. బుధనుతియు సుగుణవర్గము, నిధులుం జాలుటయు నీతినిరతియు మేలున్
మధురతయుం నీగి మీఱిన, విధముం జాళుక్య విశ్వవిభునకు వాలున్. ౫౦

### మూఁడవకందము

క. చాలుటయు నీతినిరతియు, మేలును మధురతయు నీగి మీఱినవిధమున్
జాళుక్యవిశ్వవిభునకు, వాలున్ బుధనుతియు సుగుణవర్గము నిధులున్. ౫౧

### చతుర్థకందము

క. మధురతయుం నీగి మీఱిన, విధముం జాళుక్యవిశ్వవిభునకు వాలున్
బుధనుతియుం సుగుణవర్గము, నిధులున్ జాలుటయు నీతినిరతియు మేలున్. ౫౨

---

క. సరసిజముఁ గందయుగళము, నరి మొదలినవాక్షరముల నమన్వృత్తముఁ, ద
త్సరమున మణిగణనికరము, వెరవున రచియింపఁ బంచవిధవృత్త మగున్. ౫౩

సరసిజవృత్తము

శ్రీవిశ్వేశక్ష్మావరు సేవాశ్రితులు వాగడుదురు సిరి వరఁగుటకై
ధీవిద్యాసంభావితదేవున్ ధృతియుతు హితజనదివసదినకరున్
శ్రీవర్ణింతున్ భావనజీవున్ జితరిపు శశికులశిఖరిమృగపతిన్
భావోదంచద్భావితభావున్ బ్రతిదినసముదితబహుతరవిభవున్. ౫౪

ప్రథమకందము

శ్రీవిశ్వేశక్ష్మావరు, సేవాశ్రితులు వాగడుదురు సిరి వరఁగుటకై
ధీవిద్యాసంభావిత, దేవున్ ధృతియుతు హితజనదివసదినకరున్. ౫౫

ద్వితీయకందము

శ్రీవర్ణింతున్ భావన, జీవున్ జితరిపు శశికులశిఖరిమృగపతిన్
భావోదంచద్భావిత, భావున్ బ్రతిదినసముదితబహుతరవిభవున్. ౫౬

ననాక్షరవృత్తము

శ్రీవిశ్వేశక్ష్మావరు సేవా, ధీవిద్యాసంభావితదేవున్
శ్రీవర్ణింతున్ భావనజీవున్, భావోదంచద్భావితభావున్. ౫౭

మణిగణనికరము

శ్రితులు వాగడుదురు శిరి వరఁగుటకై, ధృతియుతు హితజనదివసదినకరున్
జితరిపు శశికులశిఖరిమృగపతిన్, బ్రతిదినసముదితబహుతరవిభవున్. ౫౮

---

క. తలకట్లు బోడలుం గొమ్ములు గలకర్ణములతోడి ముఖ్యపదములన్
గలకబ్బము హ్రస్వస్వర, కలితం బగుఁ గృతుల నరయఁ గవియనుమతులన్. ౫౯

తలకట్లు

క. వనదఘనవర్యచర్యక, మనవరత ప్రసర దయ నయ క్రమ మఘమ
ర్దనకర మనత మనః కంపన మరయ శశధరవంశభవమహా మరయన్. ౬౦

బోడలు

క. స్థితి నిలిచిరి సిరి నించిరి, ధితి మించి విరించివిధికిఁ దివిరిరి శ్రితి ని
ర్మితికి నిలియిచ్చిరి మితిని, క్షితి నిగిడిరి గిరిపతాకిచెంగటినిమతుల్. ౬౧

కొమ్ములు

క. ఉరుగుణులుఁ గురులుఁ గుకురులు
గురులును బుణ్యులును బుధులుఁ గుతుకులు శ్రుతులున్
సురుచులు సుముఖులు సుఖులును
బురునుతు లుడురాజవంశ్యుఁ బూన్పుదు రెపుడున్. ౬౨

### సరిగమపధనులు

క. నీసరి పని నీసరి ధని, నీసరిమాధారిగరిమ నీసరిగా శ్రీ
నీసరిగా నిగమాగమ, గోసారులునుం జళుక్యకులవిశ్వేశా. ౬౩

### గోమూత్రికాబంధము

తే. వర్ణములు నాల్గుపంక్తుల వరుస వ్రాసి
మూలలం దోలి గోమూత్రలీలఁ జదువ
నుక్తపద్యంబు దా నగు చుండెనేని
దనరు గోమూత్రికాఖ్యబంధంబు నాఁగ. ౬౪

### మాలిని

వివిధ నయ విధిజ్ఞున్ విద్ధవీరారిగర్వున్
భువి ధనద విధిజ్ఞున్ బుద్ధసారాభిగమ్యున్
ప్రవరగుణ గరిష్ఠున్ ధాతవిశ్వేశుఁ గాంతున్
ధవళగుణగరిష్ఠున్ ధాత విశ్వేశుఁ గాంచున్. ౬౫

### చక్రబంధము

తే. వలయనవకంబు నాలు రేఖలు లిఖించి
యందు శార్దూల విక్రీడితాక్షరములు
పెట్టి నడుచుట్లఁ గవి కృతి పేళ్లు రెండు
చక్రబంధంబునకు నిడి చదువవలయు. ౬౬

శా. చిత్తోపేక్షణికస్వరోత్తమగుణున్ శ్రీలంపటున్ సత్క్రియా
విత్తోద్దండును విశ్వభూరమణు సర్వోత్కృత్యసత్కృత్యదున్
విత్తాయత్తమతాగ్రధిజ్ఞు మహితున్ వీతిక్రమాతిప్రియా
యత్తుం జూచి వినున్ విశేషవిదుఁగా యాచింపుదున్ దుర్జయా. ౬౭

### కుండలిబంధము

క. ఎనుబది పదములుగాఁ బెనఁ, గొని యుపదేశమునఁ దెలియఁ గుండలిబంధం
బనఁజను దత్పదములఁ జక్కని వ్రాలిడి వరుసఁ జదువఁ గబ్బం బమరున్. ౬౮

మ. సతతోద్యత్కరవాలభైరవు విరాజద్రాజతేజస్కుఁ జి
ద్గతసత్యవ్రతపూతకార్య్య వరదున్ దత్కోలఖేలధ్వజ
ప్రతిభీతద్విడధీశనుత్యచరణున్ భావార్థసారజ్ఞు న
చ్ఛ్రితసారస్వతభూతిసారవిషయున్ జింతింతు సంతుష్టితోన్. ౬౯

### ఖడ్గబంధము

క. తరతరమ పూసనుండియుఁ, బరుజులు దట్టాడి మధ్యపద్ధతి ధారా
పరివృతి నుపదేశ క్రమ, పరిచితిఁ బతియింప ఖడ్గబంధం బయ్యెన్. ౭౦

క. సమరమహీ వసుధమత్సమ, సముధికతం ద్రుంచు విమతశత్రులఁ లీలన్
హిమకరుక్కులుఁడు మరుత్వ, త్సమసత్త్వతఁ బేర్చుచుండు సర్వజగములన్. ౭౧

ఆ. ప్రథమ యమక చిత్రబంధాదు లొకకొన్ని
తెలుపఁ బడియె బుధులు తెలియవలయు
నుర్విఁ బద్మబంధ సర్వతోభద్రాదు
లంధ్రభాషఁ జెప్ప నరిది యండ్రు. ౭౨

పదదోషములు

మ. ప్రతిభాకంపన మబ్బినం గవులచేఁ బాటిల్లు శబ్దార్థసం
గతదోషంబులు కొన్ని, కొన్ని ధర సత్కావ్యంబులం దైన ను
త్థితవేగాకులితాపగావితతిలో డిండీరపిండాకృతిన్,
ధృతి సందర్భముచోట వానిఁ దగ జింతింపం దగున్ సత్కవుల్. ౭౩

క. పద వాక్యార్థ త్రితయ స, ముదితములై వివిధదోషములు చెవి కసుఖా
స్పదము లగు; వాని తెలుఁగులు, మది సుకవుల కెఱుఁగవలయు మఱుపక యెపుడున్.

సీ. అప్రయుక్తము నపుష్టార్థకంబును నసమర్థకంబును నిరర్థావ్యయంబు
నపసంస్కృతంబు నేయార్థంబు సందిగ్ధనష్టప్రయోజనక్లిష్టములును
గాఢపరిక్లిష్ట గూఢార్థకంబులు నప్రతీతికము నన్యార్థకంబు
నవిమృష్టకవిధేయకాంశంబు నశ్లీల పరుష విరుద్ధార్థభాషితములు

తే. ననఁగఁ బదియేడువిధము లై యతిశయిల్లుఁ
గావ్యముల దోషములు పదగతము లగుచు;
వాని నెఱుఁగక రచియించు వట్టికవుల
వేడ్క మెచ్చఁడు చాళుక్యవిశ్వవిభుఁడు. ౭౪

అప్రయుక్తము

క. దైవతుఁడు గాచుఁ గడుసం,భావన నన నప్రయుక్తి పదమునఁ బరఁగున్
వావిరిఁ బుల్లింగత్వము, దైవతపదమునకుఁ దఱచు దనరక యునికిన్. ౭౬

అపుష్టార్థము

ఆ. జగతి నెనిమిదింటిసగములో సగ మగు
భుజము లాహవములఁ బొల్లు లగునె
భూపతులకు నన నపుష్టార్థ, మర్థార్థ
పదము లర్థపుష్టిపదము గామి. ౭౭

## అసమర్థము

క. జనపతి వనధర పరివృత, యనఁ జనుధర నేలె ననఁగ నసమర్థ మగున్
వనధిః నీవనధరపద, మొనరించుట శబ్దసంపదూనత యగుటన్. ౭౮

## అనర్థకము

క. నలి నొప్పెఁ బురుషుఁ డోగిఁ గడు, నలవడియెం బడఁతి యన ననర్థక మయ్యెన్
నలి ననియెడునది యొగినన్, పలుకును బూరణము లంధ్రభాషను నగుటన్. ౭౯

## అపసంస్కృతము

క. స్పరిశన మతివకు నీకను, దరిశనము మనోహరంబు దరుణికి ననఁగా
ధర నపసంస్కృత మగుఁ దద్గురుత్వ మాద్యక్షరములఁ గూడక యునికిన్. ౮౦

## నేయార్థము

క. వరునిఁ జయిఁ గూర్మి వనితకు, నిరవగ్రహ మెప్డు ననిన నేయార్థ మగున్
నిరవగ్రహశబ్దార్థము, తిరముగ నేతవ్యసరణిఁ దెలియుటచేతన్. ౮౧

## సందిగ్ధము

క. అవనీభృత్కటకం బాస్రవపద మెల్లపుడు ననిన సందిగ్ధార్థం
బవిరళ మగు నగకట మా, నవపతిపుర సంశయంబు నరుల కొదవుటన్. ౮౨

## అప్రయోజనసంశ్లిష్టము

తే. అప్రయోజనసంశ్లిష్ట మగు సమీర, ణాశనారాతికృతకేతనాగ్రజన్మ
శత్రుశకటముల నిల్తురు శత్రు లనిన, నేతదర్థంబు గిరులను నేఁగి రనుట. ౮౩

## క్లిష్టగూఢార్థము

తే. క్షతజ కంజేక్షణలు శ్యామకల్లకటులు, ఘనవిదగ్ధాత్మికలుఁ బురికాంతఁ లనఁగ
క్లిష్టగూఢార్థ మనఁ జనుఁ గ్లేశసరణిఁ, దత్తదర్థంబు నెఱిఁగెడి తలఁపుచేత. ౮౪

## అప్రతీతికము

క. క్షితి బాడబులకు మన్న్య, స్థితి యుచిత మనంగ నప్రతీతిక మగు వి
శ్రుతబాడబమన్న్యులకు, వితతార్థము లెందుఁ బెక్కువిధము లగుటచేన్. ౮౫

## అన్యార్థము

క. ఆదట నింద్రుని జగదా, హ్లాదంబున జంద్రుఁ డనిన నన్యార్థము సం
పాదిల్లు నియతనామ, ప్రాదుర్భావముల నెన్నఁబడ కుండుటచేన్. ౮౬

## అవిమృష్టవిధేయాంశము

క. ఉవిదకు మొలనూలు వనో, భవు రెండవనారివోలెఁ బరఁగె ననంగా
నవిమృష్టవిధేయాంశం, బవు నతనికి రెండునారు లడరక యునికిన్. ౮౭

## అశ్లీలము

క. వ్రీడామంగళ పత్సలు, దోడుగ నశ్లీల మనెడుదోషము మూఁడై
జాడపడు గ్రామ్యవచన, క్రీడల; నత్తెఱఁగు కృతుల గేలిం జేయున్. ౮౮

## వ్రీడాశ్లీలము

క జనపతికృప మదయుత్సులై, చనుజనులు గుహ్యాకేశ సన్నిభులగు మో
హనరసరుచిపరిపూర్ణులు, నన వ్రీడాశ్లీలదోష మగు వినుచోటన్. ౮౯

## అమంగళాశ్లీలము

క. అన్నన కధిపతి యలుకం, గన్నుల సిరోలుక బట్ట గడుఁ దడిపె ననం
గ్లిన్నశ్మశాన మన్న,ట్లన్నెరనిపలు కమంగళాశ్లీల మగున్. ౯౦

## జుగుప్సాశ్లీలము

తే. నాతి గనయంబు వదలింప నాథుమీఁద
నాభిపంకజగంధ మున్నతిఁ జరించె
నన జుగుప్సాభిధాశ్లీల మయ్యె నింతి
కపుడు పొక్కిలిరోంపికం పర్థ మగుట. ౯౧

## పరుషము

క. కుర్కుర కర్కశ బర్బర, తర్కిత మవ్విటునిసురతతంత్రం బనుచున్
బేర్కొన్నఁ బరుష మనఁ జనుఁ, దార్కొను శ్రుతికటువు ననఁగఁ దజ్జ్ఞులచేతన్.

## విరుద్ధము

తే. మిత్త్రుఁ డుదయింపఁ గువలయోన్మేష మొదవె
నన విరుద్ధంబు సఖునకు నవని నైనఁ
గలువలకు నర్కునకు నైనఁ గల్గు మైత్త్ర్య
కారణం బొక్క సెపమునఁ గానఁబడెను. ౯౩

---

## వాక్యదోషములు

---

క. ఇవి పదగతదోషంబులు, కవులకు నిట మీఁద వాక్యగతదోషంబుల్
వివరింతుఁ గొన్ని యవియును, వివిధంబులు సూక్ష్మములు వివేకింపఁ దగున్. ౯౪

సీ. క్రమభంగము విసంధికంబును బునరుక్తికంబును వ్యాకీర్ణకంబు సాఁగ
భిన్న వచస్కంబు భిన్నలింగంబు ఛందోభంగ యతిభంగ దోషములును
న్యూనాధికోపమా న్యూనపదంబులు నట సమాప్తికపునరాత్తకంబు
నశరీరకంబును నధికపదంబుఁ బ్ర క్రమభంగము పతత్ప్రకర్షకంబు

తే. వసఁగఁ బదియేనువిధులఁ గావ్యములయందు
వాక్యదోషంబు లుదయించు; వానిఁ దెలిసి
కబ్బములు చెప్ప నుత్తమకవుల మెచ్చు
విష్ణువర్ధనచాళుక్యవిశ్వవిభుఁడు. ౯౫

## క్రమభంగము

క. శ్రీవిష్ణువర్ధనాఖ్యక్ష్మావరుకీర్తిప్రతాపమహిమలతో రా
జీవేందీవరమిత్రులు, కావింతురు చెలిమి యనఁగఁ గ్రమభంగ మగున్. ౯౬

## విసంధికము

క. కులఅంబుజఅర్కుం డిల, బలిఇంద్రఉదారుఁ డనెడుపలుకులలో న
చ్చులు హల్లులతోఁ గూడం, గలయక యుండిన విసంధికం బగుఁ గృతులన్. ౯౭

## పునరుక్తము

తే. చక్రి చక్రాయుధుఁడు పోరు సలుపుచోట
ననిన నిది శబ్దపునరుక్త మండ్రు బుధులు
శార్ఙ్గి చాపాస్త్రుఁ డాజి నెసంగునెడల
ననిన నిది యర్థ పునరుక్త మగుఁ దలంప. ౯౮

## వ్యాకీర్ణము

క. తలల వరాహాంక మురం,బుల సాజ్ఞయుఁ దాల్చి విశ్వభూవిభుఁ గొలువం
దలఁతురు రరు లని చెప్పం, దొలఁగక వ్యాకీర్ణ మనెడుదోషం బయ్యెన్. ౯౯

## భిన్నవచనము

తే. అనిశభంగంబులును ససేవ్యములు నైన
యంబునిధు లట్లు గంభీర మగుమనంబు
వశము గా దన్న నది భిన్నవచన మయ్యెఁ
బెక్కుమాటల నొకమాట భేద్య మగుట. ౧౦౦

## భిన్నలింగము

క. చాళుక్యవిభుఁడు వసుపఁద్రికూలంబునుబోని సేన శూరత వేతం
గూలుదురు వైరు లనిలో, లీలం బోరి నన్న భిన్న లింగం బయ్యెన్. ౧౦౧

## ఛందోభంగము

క. ఎందును నీరాజునకే, చందంబున లేరు సరి జగంబుల నెల్లన్
సుందరతను శూరత నన, ఛందోభంగంబు కృతులఁ జను దోషం బై. ౧౦౨

## యతిభంగము

క. చెప్పినయెడ నిలుపక వడి, దప్పిన యతిభంగ మనఁగఁ జనుఁ దత్కృతి నీ
చొప్పు నెఱుంగుఁడు తెనుఁగున, నెప్పుడును విరామభంగ మెన్నరు కృతులన్

## న్యూనోపమ

తే. చంద్రతారాభిరామ మై చదలు వొలిచెఁ
బుండరీకాంకకాసారఖండ మనఁగ,
నట్లు చెప్పిన న్యూనోపమాఖ్య యయ్యె
నుపమ తారాపథంబున కూనమగుట. ౧౦౪

## అధికోపమ

తే. వికలముఖు లైన యరివధూటీకలు స్ఫాంత
నలినకైరవ లగు గ్రీష్మ నదులభంగి
నైరి నా నధికోపమ యయ్యె నరయ
నందుఁ గైరవ ముపమకు నధిక మగుట. ౧౦౫

## న్యూనపదము

క. పరగండభైరవునిశ్రీ, చరణంబుల కెరఁగ కున్న సమకూజె వనే
చరత యన న్యూనపద మగు, పరునకు నరిపదముఁ గవితఁ బఠితము గామిన్. ౧౦౬

## సమాప్తపునరాత్తము

క. అవనీశుయశము గుణమణి, నివహంబులు నెగడ నెగడె నిఖిలము నిండెన్
గవివినుతులచే ధవళిత, భువనం బనఁగా సమాప్తపునరాత్త మగున్. ౧౦౭

## అశరీరము

క. కుశలుఁ డగున్నృపతి సతతము, కృశకులధర్మలను సహజకృత్రిమగుణులన్
బిశునుల నని మును పలుకఁగ, నశరీరము నిగ్రహించు నన్నుక్రియ గిడమిన్. ౧౦౮

## అధికపదము

క. కరవాలభైరవునిచే, నరుగుదు రరు లర్కమండలాకారములో
సురిఁగి యన నధికపద మగు, నరయఁగ నాకారశబ్ద మధికం బగుటన్. ౧౦౯

## ప్రక్రమభంగము

క. నారలు చీరలు మధురా, హారంబులు కూర లడవి యాలయ మనఁగాఁ
గూరుం బ్రక్రమభంగము, వారక వనగృహము లేకవచనం బగుటన్. ౧౧౦

## పతత్ప్రకర్షము

తే. పిచ్చి మార్కొనుఁ బలుఁ గ్రొ వ్వెసఁగుకిరులఁ
బాఱు మృగములఁ ద్రుంచు సీభటుఁ డనంగ
నడరి విపరీతగతిఁ జెప్ప నగుఁ బతత్ప్ర
కర్ష దోషంబు దగ దీనిఁ గానవలయు. ౧౧౧

## అర్థదోషములు

క. ఇవి వాక్యజాతదోషము, లవిరళముగఁ దెలియుఁ డింక నర్థక్రమసం
భవము లగుదోషములఁ దగఁ, జెవులకుఁ జవు లొదవ నోలిఁ జెప్పెద నొప్పన్.

సీ. వరుస నపార్థంబు వ్యర్థంబు హీనాధికోపమంబులు సంశయోక్తికంబు
నతిమాత్రకంబు నేకార్థంబు భిన్నంబు జరపదక్రమమును బరుషకంబు
ననదృశోపమమును నప్రసిద్ధోపమ ముచు హేతుశూన్యార్థమును దనర్చు
విరసాహ్వయంబును నిరలంకృతియు విరుద్ధంబు నసంగతత్వం బనంగఁ

తే. గబ్బములఁ సప్తదశదోషఘటన లొదవుఁ
బ్రాభి వానికిఁ బాసి సత్ప్రభువు లైన
యుభయభాషాకవీంద్రుల కొసఁగుఁ బొసఁగఁ
జారుతరకీర్తి విశ్వేశచక్రవర్తి. ౧౧౩

## అపార్థము

క. ధనదునకు నెంద ఱంగన?, లనుములు నాకమునఁ బండు నా? పాతాళం
బునఁ బాము లెన్నిగలవో?, యనఁగ నపార్థంబు వాచికార్థము గామిన్. ౧౧౪

## వ్యర్థము

తే. 'మీరు పెద్దలు, కులమును బౌరుషంబు
విశ్రుతంబులు, గుణము లీవితతు, లేల
యధిపుఁ గొలువరు దా?' రన వ్యర్థ మయ్యెఁ
దొలుతఁ బలుకులు భజనహేతువులు గామి. ౧౧౫

## హీనోపమ

క. కుక్కలునుబోలె దనుజులు
మిక్కుటముగఁ గదుర సురలు మృగములభంగిన్
దిక్కులు చెడి పాఱిరి నాఁ
దక్కక హీనోపమాభిధానం బయ్యెన్. ౧౧౬

## అధికోపమ

క. అకుటిలగతిఁ గొలఁకులలో, బకములు మునివరులుఁబోలెఁ బరఁగె ననంగాఁ
బ్రకటిత యగు నధికోపమ, సుకవిత నీరెండుఁ బొనుప శూన్యం బయ్యెన్. ౧౧౭

## సంశయము

క. నీ వన్న పలుకు చెప్పిన, నావెలఁదికి నలుగ నేల యన సంశయ మై
భావింపంబడు నీ వను, నావెరవున నన్ను గామి నన్యార్థం బై. ౧౧౮

## ఏకార్థము

క. మలయసమీరము మలసెను, మలఁగొనియెఁ బటీరశైలమారుత మనుచుం
బలికిన యర్థమ క్రమ్మఱఁ, బలుకుట యేకార్థ మండ్రు ప్రతిభావంతుల్. ౧౧౯

## అతిమాత్రము

క. అతిమాత్రం బగు నతిభాషితమున శేకోదకమునఁ జెడు జగ మనుచుక్
మితముగ నరిసతు లేడ్చినఁ, బ్రతతాకృతి నదులు వర్వె బాష్పజలములన్. ౧౨౦

## భిన్నసంబంధము

క. నలువ భనదహితకీర్తులు, నలుపులు గావించుతలఁపునం జేసి సుమీ
మలినత్వము కుజనమనః, స్థలముల నిడె ననఁగ భిన్నసంబంధ మగున్. ౧౨౧

## అపక్రమము

తే. పురుషుఁ డొక్కండు పరిణయంబునకు మున్న
వరుస సమకూర్చె సీమంతపరికరములు
అన నపక్రమ మండ్రు కృత్యంబు గడచి
యవలిపని సేయు నని చెప్పునట్టికృతుల. ౧౨౨

## పరుషము

క. వేఁడెదునర్థులఁ గనుఁగొన, వాఁడికుతారమునఁ జెండవలదా యను నీ
సూఁడరిమాటల పరుషము, పోఁడిమి చెడు నట్టియర్థములఁ గబ్బములన్. ౧౨౩

## అసదృశోపమ

క. వసుధాపతి కోపాగ్ని, ప్రసరంబులచేత రజతపర్వతభంగిన్
వెస వెలిఁగెఁ బోర ననఁగా, నసమత నిది యసదృశోపమాహ్వయ మయ్యెన్. ౧౨౪

## అప్రసిద్ధోపమ

తే. బాష్పకణకీర్ణ మై యొప్పుఁ బణఁతిమోము
మంచు నిండినతొగపువ్వుమాడ్కి ననిన
నప్రసిద్ధోపమార్థ మై యడరు నండ్రు
కుముదముఖముల కుపమాప్తి గూడ దునికి. ౧౨౫

## హేతుశూన్యము

తే. చర్మ గోరక్షణార్థంబు చంపుఁ బులుల
ననక మిన్నక పులివేఁట లాడు నృపుఁడు
శూరుఁ డై యన్న నది హేతుశూన్య మయ్యె
నిష్ప్రయోజనకథన మై నివ్వటిలుట. ౧౨౬

## విరసము

క. తలఁ బవుమాపులు నిద్దపు, టెలనగవులు నింత యొప్ప నే భయమున ని
చ్చలు చను నరిసతులకు నన, విలసనసమయంబు గామి విరసం బయ్యెన్. ౧౨౭

## నిరలంకృతి

క. నీచుఁడు సభలోపల దు,ర్వాచాలత నాత్మదోషవంచితుఁ డగు నా
నేచుఱు నిరలంకృతి యై, యీచంద మలంకృతులకు నెక్కుడ యునికిన్. ౧౨౮

## విరుద్ధము

ఆ. చర్చ సేయ జగదసమ్మత మగునర్థ
మది విరుద్ధ మనఁగ నతిశయిల్లు
దేశ కాల లోక దిక్సమయక విరు
ద్ధాహ్వయములచేత నైను నాఁగ. ౧౨౯

## దేశవిరుద్ధము

క. మరుదేశంబునఁ బెక్కులు, పరిపూరితసలిలనదులు పరఁగి పిపాసా
తురులఁ దనియించు నాఁగా, ధర దేశ విరుద్ధ మయ్యెఁ దజ్జ్ఞుల కెల్లన్. ౧౩౦

## కాలవిరుద్ధము

తే. గ్రీష్మ కాలంబు మత్తిలి కేకు లాడె
నింద్ర గోపంబు లిలమీఁద నెల్లఁ బొడమెఁ
జాఁగె బ్రథమాంబువులకు నై చాతకంబు
లనఁగఁ గాలవిరుద్ధసమాఖ్య మయ్యె. ౧౩౧

## లోకవిరుద్ధము

క. ఘనగజకుంభంబులలో, మొనయుఁ బ్రవాళంబు వెలయు ముత్తెపుగము ల
య్యెనుఁబోతులకొమ్ములలో, నన లోకవిరుద్ధ మయిన యర్థముఁ దలపన్. ౧౩౨

## దిగ్విరుద్ధము

క. ఉదగంబుధివీచుల నున్నదుఁ డై క్రీడించె దాక్షిణాత్యుఁ డనంగా
మదిలో వినియెడువారల, యెద నించును దిగ్విరుద్ధ మనునర్థం బై. ౧౩౩

## సమయవిరుద్ధము

క. అమరఁగఁ బులితోలును మ,స్తమునం బలుజడలు దాల్చి సౌగతుఁ డొప్పెన్
హిమకరశేఖరుగుడి నన, సమయవిరుద్ధార్థ మగుచుఁ జను సత్కృతులన్. ౧౩౪

## అసంగతి

తే. శ్రుతము శాంతియు నితనికిఁ జుట్టలనక
దయయు దానంబు నితనికి దయిత లనక

జోడు దప్ప ననంగతి స్తుతి యొనర్పఁ
బద్యములయందు సహచరభ్రంశ మయ్యె. ౧౩౫

క. ఈదోషంబులు మొగి నర్థోదితములు పూర్వభాషితోదారశ్లే
షాదిగుణంబులతోడఁ బ్రమోదంబునఁ గూడి యొనఁగు ముఖ్యార్థములన్. ౧౩౬

క. శ్రుతిపరుషత మానుటకై, మతిఁ గర్తవ్యంబు సౌకుమార్యము చెప్పన్
జతురతఁ గాంతి ఘటించుట, వితతగ్రామ్యార్థహారణ విశ్రుతిఁ జేయన్. ౧౩౭

క. కృతుల నపుష్టార్థప్రవి, హతికొఱకై చొనుపవలయు నర్థవ్యక్తిన్,
వితతన్యూనాధికపద, యుగివహతికై సమత చెప్ప నొప్పుం గవితన్. ౧౩౮

తే. అనుచితార్థ నిరాకరణాప్తికొఱకు
నగు నుదాత్తతఁ గావ్యంబులందుఁ జొనుప.
యుక్తపాదవిసంధివిచ్యుతి యొనర్చు
పనికి నూర్జస్వి కర్జంబు పద్యములను. ౧౩౯

ఆ. తుదిఁ బతత్ప్రకర్ష దోషాపహాతికి నై
యుక్తి రీతిఁ గావ్య మొగి నొనర్ప
నప్రతీతిక పరిహారంబు కొఱకు నై
సుప్రసాదగుణముఁ జొనుపవలయుఁ. ౧౪౦

క. చ్యుతసంస్కృతి మానుటకై, యతిమధురసుశబ్దవృత్త మగు నొనరింపన్,
బ్రతత ప్రక్రమభంగా, హతికై సంక్రమతఁ గూర్ప నగు నండ్రు బుధుల్. ౧౪౧

క. ప్రేయోలంకారము దా, శ్రేయం బగుఁ బరుషదోషశిథిలతకొఱకై
చేయఁ దగుఁసూక్తితంత్రము, హేయాశ్లీలంబుఁ దొలఁగ నెగుచుటకొఱకై. ౧౪౨

క. ఇత్తెఱఁగున మఱియుఁ గుణా, యత్తాలంకార సరణు లరసి కవీంద్రుల్
చిత్తంబున దోషోదయ, వృత్తం బెడలించి కవిత విరచింపఁ దగున్. ౧౪౩

---

చ. విరహితవైరికై భువన విశ్రుత సద్గుణ రత్నహారికై
నిరుపమకీర్తికై యువతి నిర్మథనక్షమ చారుమూర్తికై
విరచితవృద్ధికై సమర వీరవిరాజిత జైత్రసిద్ధికై
పరిచితశక్తికై గిరిశ పాదపయోజనిమక్తభక్తికై. ౧౪౪

క. పరగండభైరవునకై, యరిమానసచండడిండిమారావునకై
కరవాలభైరవోర్జిత, బిరుదునకై నతవిమతనిభృతవరదునకై. ౧౪౫

తరలము

సుజనపోషణశాలికై రణశూరతావనమాలికై
రజనినాథకులాగ్రగణ్యవిరాజికై జయవాజికై

గజభుజంగమభారవారణకారికై యవికారికై
విజయవిక్రమభర్తకై మనవిశ్వభూవరభర్తకై. ౧౪౬

## గద్యము

ఇది శ్రీమదుమారమణ చరణారవిందవందన గోవిందామాత్యనందన వివిధబుధ
విధేయ విన్నకోట పెద్దయ నామధేయ విరచితంబైన కావ్యాలంకార
చూడామణియను నలంకారశాస్త్రంబునందు విమిశ్రితాలంకార
యమకాద్యనుప్రాసచిత్ర బంధచిత్ర సందర్భ దోష గుణ
నిరూపణ ప్రభృతి పంచమం బన్నది

ష ష్ఠో ల్లా స ము.

# సప్తమోల్లాసము

## ఛందస్సు

క. శ్రీవిశ్వేశ్వరునకునై, భావితవిశ్వేశ్వరాంఘ్రిపద్మునకై సం
భావితపదవాక్యకళా, కోవిదుకై నయవిశేషగుణవిధునకునై. ౧

క. ధీయుత పింగళనాగ హలాయుధ జయదేవ ముఖ్యు లగునార్యులచే
నాయతమై యామ్నాయ ప్రదాయిత మగుఛంద మొప్పిదముగ నొనర్తున్. ౨

క. ఛందోవిభ్రమవిధితోఁ, బొందిక దా వేదశాస్త్రములు వాగ్వనితా
మందిరము లైన యయ్యర, విందభవునివదనములకు విభవం బొసఁగెన్. ౩

శా. పొందై గౌరవలాఘవప్రకృతమై పూర్ణాక్షరస్నిగ్ధమై
యందంబై శ్రుతిసమ్మతప్రకటమై ప్రాసించునానావిధ
చ్ఛందస్సూత్రము లేక లోకములఁ జంచద్వాక్యరత్నావళీ
సందోహంబులు కంఠభూషణము లై సంధిల్లునే యేరికిన్? ౪

క. ఛందము వాఙ్మయవిద్యా, కందము యతిగమకసమకగణవృత్తకృతా
నంద మమందార్థకళా, విందము వాణీకరారవిందము ప్రతిభన్. ౫

క. పటుమతి నట మున్ను మహా, నటుఁ డీశుఁడు వాచకాభినయమునకై యు
త్కటయతిలయమయతాళ, స్ఫుటవికటచ్ఛంద మందముగ నొనరించెన్. ౬

క. సృజియించి యిచ్చె నజునకు, నజుఁడును భరతునకు నిచ్చె నమ్మునివరుఁడున్
ఋజుమతి యగుపింగళుఁ డను, భుజగమునకు నిచ్చె భుజగభోజనుఁ డచటన్. ౭

క. ప్రియ యది యేటిది నావుడుఁ, బియిలోడినపలుకుతుడలపొల్లలచేతన్
మయరసతభజనగణము లుదయ మొందెన్ ఛంద మొందెఁ దద్గణయుక్తిన్. ౮

క. గురువును లఘువును శంకర, గిరిజాతాకృతులు తత్ప్రకృతములు గణముల్
గరుడునిపై పింగళఫణి, విరచించిన తెఱఁగు వరుస వివరింతుఁ దగన్. ౯

వ. అవి యెయ్యవి యనిన—ధీశ్రీస్త్రీమ్, వరాహాయ్, కాగుహార్, వసుధాస్, సాతేక్వల్, కదాసజ్, కింవదభ్, సహాసన్: ఇట్లని గరుడభయంబుననుం దిర్యగుదితస్వభావంబునను సాభిప్రాయజ్ఞేయనేయార్థంబుగా గణస్వరూపనిరూపణంబునకునై పింగళనాగంబుచేత నుచ్చరితంబు లగుతద్వాక్యాంతరంబులం బొల్లులై తోఁచు మకార-యకార-రేఫ - సకార - తకార - జకార - భకార - నకారంబులు గణాభిధానంబులకు నాద్యక్షరంబు లగుటచేత మగణ - యగణ - రగణ - సగణ-తగణ-జగణ-భగణ-నగణంబులు క్రమంబునం బ్రస్తారోద్ధారంబునం బ్రభవించె. తత్స్వరూపంబులనుం దదధిదైవతంబులను బరిపాటిం బ్రకటించు నెట్లనిన. ౧౦

క. ధీశ్రీస్త్రీ మన మగణము, విశ్రుత, మధిదైవతంబు విశ్వంభర; ని
త్యశ్రీల నొసఁగు మగణ, ప్రశ్రయముఖకవిత చెప్పఁ బని దనుఁ దలఁపన్. ౧౧

క. జగతివరాహో యనఁగా, యగణం బుదయించె నుదక మధిదైవత మై,
యగణప్రయోగములయెడఁ, దగిలించున్ సిరులఁ దన్నుఁ దలఁపున నిలుపన్.

తే. భ్రమిసి కాగుహో రనునట్టి పలుకు రగణ
మయ్యె; నధిదైవతము వహ్ని యయ్యెఁ గానఁ,
గవితముఖమున రగణంబు గట్టునప్పుడు
వహ్నిఁ దలఁపంగఁ బగఱకు వచ్చుఁ జావు. ౧౩

క. గతికై ఫణివసుధా సని, మతిఁ దలఁచిన సగణ మయ్యె; మారుత మధిదై
వత మండ్రు; సగణముఖ మగు, కృతి పగఱకు మగుడులేని కీడొనరించున్. ౧౪

క. సాతేశ్వ దనుడుఁ దగణము, జాతం బై శూన్య మగుడు, జద లధిదైవం
బై తనరెఁ; దగణముఖకృతి, శ్రీతుం డగునృపుని నైన హీనుం జేయున్. ౧౫

ఆ. తనరఁ బింగళుఁడు కదాస జనన్ జగ
ణము జనించెఁ, దదధినాథుఁ డినుఁడు;
తొలుతఁ గృతిని జెప్పఁ దొడఁగుచో నర్కుని
దలఁప నరికి రోగతతులు వొడము. ౧౬

క. ఖగపతి కింవద భన నది, భగణం; బుడురాజు తదధిపతి; భగణాద్యం
బగను గృతి చెప్పనప్పుడు, మృగాంకుఁ దలపంగ నగు సమీహిత కాంతుల్. ౧౭

క. సహాస నసి పలుక నగణం, బహుతం బగుఁ, దదధిదైవ మగుఁ బ్రాణుఁడు; త
ద్విహితస్మృతి నాయువు గడు, నిహితం బగు నగణముఖ వినిర్మాణములన్. ౧౮

క. గురులఘువులు గలములు; లఘు
గురులు గురులఘువు లెన్ని కొన వహము లగున్;
గురులఘువులు త్రితయము లై
మురిసిన నవి మగణ నగణములు నాఁ బరఁగున్. ౧౯

ఆ. మగణరచన కాదిమధ్యాంతలఘువులు
గలిగె నేని య ర త గణము లయ్యె;
నగణ రచన మొదల నడుమను గడ గురు
వుండెనేని భ జ స లొప్పుమిగులు. ౨౦

క. లోవంక వ్రాయ గురు వగు;, నేవంకయు లేనివ్రాత యొసఁగును లఘువై
జైవాతృకరేఖాయుత, భావజశరనిభము లండ్రు ప్రాజ్ఞులు మఱియున్. ౨౧

క. గురువు లగు నొంటిసున్నల, నిరుసున్నల జమిలివ్రాల నెడమల నూఁదన్
బొరసినవియు దీర్ఘములు, నితరములు లఘువులు గణములు తత్త్రితయంబుల్.

క. ఇందుఁడు గాంతి వపుఃప్రభఁ, గందర్పుఁడు సప్తసప్తి ఘనరుచి ననఁ, జె
న్నొందినయవి గురువులు చె, న్నొందిననిడుపులును: నట్ల యున్నవి లఘువుల్. ౨౩

క. కృతిశక్వరులును ధృతిధృతులును, పిత్రృభృతులును నిలుచు పదముపిఱుఁదనలఘువుల్,
కృతిలో నగణములును దీర్ఘత నొందినయేని కట్టిగాఁ దగు నెఱుఁగన్. ౨౪

మ. కమనీయంబగు గద్యపద్యమయమై కావ్యంబు; గద్యంబు నా
నమరుం బాదనియంత్రణానియమవిన్యస్తప్రశస్తార్థమై,
రమణీయాంఘ్రిచతుష్టయ స్ఫుట వళిప్రాసాభిరామంబు ప
ద్యము; తత్పద్యము వృత్త జాతు లన రెండై పర్వుఁ గావ్యంబునన్. ౨౫

క. వృత్తం బనఁ జతురంఘ్రి సు-వృత్తం బై వళుల ప్రాల వెలయును; మాత్రా
యత్తగణంబులచేతఁ బ్ర, వృత్తాకృతిఁ బరఁగు జాతివిశతులు కృతులన్. ౨౬

తే. విరతి విశ్రాను విశ్రాంతి విరమ విరమ
ణాభిధాన విరామము లనెడి పేళ్లు
యతికిఁ బర్యాయపదము లై యమరుఁ గృతిని;
యుక్తి పదములఁ గృతియందు నునుపవలయు. ౨౭

క. కరి గిరి పుర నిధి శశి ది,క్పరిసంఖ్యానంబు గణితపరిభాషలచే
నరసి యతి నిలుపుచోటులు, పరికింపఁగవలయుఁ గావ్యబంధన వెలయన్. ౨౮

వళిప్రాసములు

క. పాదప్రథమాక్షర ము,త్పాదిత మగు వళి యనంగఁ; బ్రాసం బనఁగాఁ
బాదద్వితీయవర్ణము; పాదచతుష్కమున కివియ ప్రాణము లెపుడున్. ౨౯

వళిభేదములు

క. స్వరజలు వర్గజ లిత రే, తరవర్గజ లనఁగ నేకతరజ లనంగాఁ
బరపారు వళ్లు నాలుగు;, వరుసఁ దెనుంగునకు వాని వలయుం దెలియన్. ౩౦

క. కొఁది యకారము మొదలౌ, కారము తుద యైనయచ్చుగమి పండ్రెండున్
వారక యొండొంటికి నిం, పారఁగ వళ్లయ్యె నాల్గు నైదును మూఁడున్. ౩౧

అజ్విరమము

క. అ ఐ ఔ లత్వమునకు, నీ ఏలును ఋద్వయంబు నిత్వమునకుఁ దా
మూ ఓ లుత్వమునకు వళు, లాయచ్చుల దొరసి యుండ హల్లుల కెల్లన్. ౩౨

అకారవళినిరూపణము

తే. అవని ధర్మజుఁబోలు నిత్యార్యచర్య,
నాదిరాజుల దొరయు నిత్యైంద్రభూతి,
నరులఁ బ్రహరించు బాహుదండాగ్ర్యమునను,
విధుకులాగ్రణి చాళుక్యవిశ్వవిభుఁడు. ౩౩

## ఇకారవళినిరూపణము

ఆ. ఇనజుఁ డీగి, భారతీశుండు చతురత,
నేకవీరుఁ డాజి బుజుతయందు,
బురాజరిపుఁడు సిరి, నహీనుండు భూవహ
నమున విశ్వమనుజనాథవిభుఁడు. ३४

## ఉకారవళి నిరూపణము

క. ధరణీవరాహలాంఛితుఁ, డురరీకృత సకలవిద్యుఁ డూరీకృత సం
గరజయుఁడు విశ్వభూవరుఁ, డురుకీర్తుల నెగడు నా బిడౌజో విభుఁ డై. ३५

## వర్గవళినిరూపణము

క. తుది నున్న ఙ ఞ ణ న మ ములు, వదలిన యా క చ ట త పల వర్గాక్షరముల్
వాదిఁ దనవంగడములలో, నదికిన నవ్వళులు వర్గజాఖ్యము లరయన్. ३౬

సీ. కమనీయరాజశిఖామణి కరిరాజ గర్వమహీధ్ర నిర్ఘాతమునకు
చతురయశస్సిత చ్ఛత్ర కాయోధన జయదాశ్వభంజళి ఝంపునకును
టంకితరాయకఠారిసాళువునకు డంభలాంఛన కోల ఢాలునకును
త త్త్వ పురాణకథా రసవేదికి దాన దయా ధర్మ ధామ మతికి

తే. పశుపతిప్రాప్త సామ్రాజ్యఫలున కబ్జ
బంధుబంధుర తేజోవిభాసునకును
విశ్వవిభునకు సరి లేరు విశ్వజగతి
ననిన నివి వర్గవళ్లకు నచ్చు కృతుల. ३౭

## కాదివర్గమునకు గుణితస్వరవళినిరూపణము

క. కా కై కౌ లట కత్వము, కీ కేలు కృ కౄలు నట్లె, కిత్వము నటులై,
కూ కోలు కుత్వమునకును, జేకొను దక్కాదివళాంతసిద్ధార్ణతతిన్. ३౮

## ఇతరేతరవర్గజవళినిరూపణము

క. ఇతరేతరవర్గజవళి, తతికిఁ జవర్గువును శ ష స దగు నొకగమి యై;
కృతులకు న హ య లు నేక, స్థితి నొకవంగళము; న ణ లుఁ జెలఁగునొకటియై.

చ. చతురచళుక్యవిశ్వవిభుశాసన మెక్కినరాజనూళు ల
చ్ఛుత మకుటోజ్జ్వలస్రగనుష క్తము లై విలసిల్లు నెందు; నీ
జతనము నీతిమంతులకు సాగిన నేమి కొఱంత? సంతతో
జ్ఝితమదబుద్ధులుం గుశలసిద్ధులు పొందుట లెల్లఁ బోలవే. ४०

ఆ. చతురుపాయబాహుశక్తిక్షమావళిఁ
బాఱ విడిచి చిత్రభానుసాక్షిఁ

బాటె సర్వసిద్ధిపద మేది ధరణీవ
రాహమునకు నోడి రాచకదుపు. ౪౧

చ. అమమత కాస్పదంబు, వినయంబునకుం గుదు, రుబ్బులేనినె
య్యమునకు నాలవాలము, మహాగుణపంక్తికి జన్మభూమి, దా
నమునకు నాదరం, బరిరణక్రియ కుగ్రనికేతనంబు, నా
నమరుఁ జళుక్యవిశ్వమనుజాధిపుచిత్త మమత్తవృత్తియై. ౪౨

## ఏకతరవళినిరూపణము

క. మ ర వ ల అ లేకతరవళు, లరయఁగఁ దమతమక కవులయనుమతి వళులై
పరఁగుఁ, బదాంతముకారము, పొరిఁబొందినపు ఫు బు భు ము లు పొసఁగిన చోటన్.

ఆ. మధురవచనుఁ డార్యమాననీయాగ్రణి
రసికవరుఁడు రాజరాజనిభుఁడు
వరుస యెఱిఁగి సుకవివరులకు నిచ్చిన
లచ్చి విశ్వవిభునిలాగు మెచ్చు. ౪౩

ఆ. అజ్జు లాని యీగి జావడి సభలోన
జేసి పోరి లోన ఆచ్చుఁ బొఅసి
జెన్న మడుగుపుడమిజేంద్ర నేల నుతింప
మనకు విశ్వనాథుఁ డొనరియుండ. ౪౫

## ముకారవళినిరూపణము

తే. పుడమి విశ్వవిభునిభుజమునకుఁ దొడవు
ఫుల్లపద్మాలయ ఓతీర్ణమునకు బోటి
బుధులు విద్యావివేచనమునకు సాక్షి
భువనములు కీర్తికి నివాసములు దలంప. ౪౬

## ప్రాదివళినిరూపణము

క. ప్ర ప రా ప స మను సు ప్ర,త్యపి ని ర్దు రధి న్యు పా భ్యు దాఙ్వ్య త్యవ ప
ర్యుపసర్గ వింశతికి వళు,లు పరస్పరవర్ణయుక్తి నుభయముఁ జెల్లున్. ౪౭

ప్ర - పరా - అప - సమ్ - అను - సు - ప్రతి - అపి - నిర్ - దుర్ - అధి-ని-ఉప-
అభి - ఉత్ - ఆఙ్ -వి-అతి - అవ-పరి:——ఇవి యిరువదియు నుపసర్గలు; ఇందు
అప్యాఙ్ అను నిరూపణ మప్రసిద్ధము.

శా. ప్రారంభించు నశేషధర్మముల సంపాదించు సత్కీర్తులన్,
బ్రారబ్ధంబులు నిర్వహించు ఫలపర్యంతంబుగా నెప్పుడున్,
బ్రారబ్ధ ప్రతిలబ్ధ సంపదలచే రాగిల్లు నుల్లాసియై,
యీ రా జించు నుతింతు రార్యు లిల విశ్వేశావనీవల్లభున్. ౪౮

తే. రిపుల విశసించు చోటఁ బరేతనాథుఁ
డుర్వి రక్షించుచోటఁ బరోఢ భుజుఁడు
బహుధనావాప్తిచో ననపాయబుద్ధి
యంతరరులకు నీ రాజ సపాయకరుఁడు. ౪౯

చ. స్మయరహితంబు వైభవసమాగమ, మాహవధుర్యశౌర్య మ
వ్యయము, జయంబు విస్మయసమగ్రము, పాదవినమ్ర శాత్రవా
న్వయ పరిరక్షణం బభినవంబు, నయోచిత శాస్త్రవాచకా
న్వయనిపుణంబు చిత్త, మనయంబును విశ్వనరేంద్ర భర్తకున్. ౫౦

తే. స్వర్ణగిరిచాపుఁ డర్చింపవలయు వేల్పు
స్వాంత మగుమంత్ర మాప్తపంచాక్షరంబు,
తథ్యమగుధర్మ మెపుడు ప్రత్యక్షకృత్య,
మాత్మ విశ్వేశ్వరునకుఁ బ్రత్యహముఁ దగిలి. ౫౧

సీ. రసభావశీలి నిరంతరశ్రుతిశాలి యర్థావబోధ నిరర్గళుండు
రాజన్యజన్య దురంతవిక్రముఁడు దు రవగాహవిద్యా విహారభూమి
దానార్హ సంపదధ్యావాస మాయుధాయత వేదశశ్వదధ్యయనవేది
న్యాయ తర్కాది నానాశాస్త్రకుతుకి వి న్యస్తపూతార్థ మహాశయుండు. ౫౨

ఆ. ప్రచుర ఫలిత చతురుపాయాభిరాముఁ డు
పేంద్రభూపతనయుఁ డింద్రనిభుఁడు
భీమబలుఁడు జగదభీహిత శోభనా
భ్యర్థి విశ్వనాథుఁ డవనివిభుఁడు. ౫౩

క. చంచలత లేక దానో, దంచితుఁ డగువిశ్వనాథ ధరణీశ్వరుచే
మించినసుకవీశ్వరుల దృగంచలముల మలయు సిరు లుదగ్రప్రీతిన్. ౫౪

చ. వ్యపగతదోషుఁ డవ్యసనవర్గుఁ డుదంచిత మంత్రపంచక
వ్యపగతశత్రుమండలుఁ డయాన్వితుఁ డూర్జిత వైరిభూవర
ద్విపవరమత్తకేసరి యతీంద్రియఖేలుఁ డార్య చర్యుఁ డ
త్యుపచితశౌర్యశాలి సుగుణోన్నతి విశ్వనరేంద్రుఁ డెప్పుడున్. ౫౫

తే. పళ్వ విశ్వంభరాసమావేక్షణమున
నడరు నీహిత బహుఫలావాప్తు లెల్లఁ;
బ్రణతు లొనరింతు రఖిల పర్యంతనృపులు
నర్థి విశ్వేశ్వరునకుఁ బర్యాయగతుల. ౫౬

## సబిందువర్గవళి నిరూపణము

తే. ట త ప వర్గాక్షరములకు డాపలించి
యొనర నూఁదిన బిందువు లుండెనేని

వరుస ణ న మ లు వళు లగు వాని కెల్ల
నవనిఁ గొందఱు సుకవులయనుమతమున. ౫౭

చ. కనుకఁ జళుక్యవిశ్వనృపకేసరి యేసినచోఁ గృపాణదం
డనమునఁ గల్గుఁ బో సురగణత్వము తత్పదపారిజాత వం
దనమునఁ గల్గుఁ బో మనుజనాథత తద్భటదర్శనావలం
బనమునఁ గల్గుఁ బో గహనమధ్య నివాసము వైరకోటికిన్. ౫౮

## ద్వ్యక్షర త్ర్యక్షర ప్లుతాక్షర వళి నిరూపణము

ఆ. మొదలి వ్రాత రెండు మూడు నక్కరములఁ
గూడె నేని యదియ కూర్చు వళుల,
నంత్యవర్ణము విడుపయి తర్క భేద దీ
యార్థ మయిన నచ్చు వాల్లు వళులు. ౫౯

క. ప్రియకరుఁడు సర్వలోకా,శ్రయ బిరు దోదగ్రుఁ డుగ్ర జనవర సేనా
జయలక్ష్మీ సుఖకర సం,శ్రయుఁ డీచాళుక్యవిశ్వరాజేంద్రుఁ డిలన్ . ౬౦

తే. ధర్మములు నిత్య సత్య కృద్వ్యాప్తు లెపుడు,
వర్జ్యములు చిత్తమున కసద్వ్యసనచయము,
లర్హములు వర్ణ విభ్రమ ద్వ్యక్తివిధులు
పతికి ననుటయు విశ్వభూపతికి నమరు. ౬౧

క. త్రాసమతి విమతు లడుగులు, డాసిన నీసోమవంశ్యుఁడా రక్షింపం
డీ సుడిగి యుచితగతి వి,న్యాసంబునఁ గొలువవలవదా విశ్వేశున్. ౬౨

మ. కమలోత్పత్తి నిమిత్తముం గువలయాకాంత్యాతపజ్జీవనీ
యము సైనంతన నభ్రవిభ్రమము నేలా సర్వలోకాశ్రయ
క్షమతం జేర్చు చళుక్య విశ్వవిభు శశ్వద్దాన ధారాజ లౌ
ఘముతో సాటికిఁ బాటిసేసెదవు శ్రీకా చక్కఁ దర్కింపుమా. ౬౩

## ఆదేశవళి నిరూపణము

క. ద్వీపమునకు నాకమునకు, నాపై శాస్త్రోక్తి నచ్చు నాదేశ సమా
సాపత్తి గలుగుటయు వళు, లాపాదింపుదురు కొంద ఱచ్చుచు వాల్లున్. ౬౪

ఉ. ద్వీపులఁ ద్రుంచువిశ్వజగతీపతి యుత్తమశక్తి జాంబవ
ద్వీపమునందు గోవులకు నిమ్ముగఁ జేయుటయున్ బ్రసన్నుఁడై
గోపతిధేను వవ్విభునకుం దనవైభవ మిచ్చెఁ గాక యే
భూపతు లీవదాన్యగుణబుద్ధిఁ బ్రసిద్ధి వహించి రుర్వరన్. ౬౫

క. నీకరవాలము పాత్రై, నాకంబున కరిగి రాజనారాయణ యా
భూకాంతు లెట్టిచన వో, నాక పిటోత్తములఁ దూల నడుతురు లీలన్. ౬౬

క. విను మన్యోన్యపదంబున, కొనరింతురు కవులఁ గొంద ఱో న్నో లాయుం
దనుబోనియచ్చు కలుగుటఁ, జొనుపుదు రాయచ్చు వళియు సుకవులు కృతులన్.

ఉ. ధన్యుఁడు విశ్వభూవిభుఁడు ధారుణి యేలఁగ భూజనంబు ల
న్యోన్యహితత్వ సంపదల నొందిరి, దంపతు లింపు నింప న
న్యోన్యసుఖానుకూలతల నోమిరి విప్రులు వేల్పుఁబిండు న
న్యోన్య సుపుష్టి తుష్టి కుశ లాదులఁ జెందిరి నాఁడునాఁటికిన్. ౧౮

## దేశీయవళి నిరూపణము

చ. కఱకరి కల్లడంబు కడుఁ గట్టిఁడి దెప్పెర లోలమాన గ్ర
చ్చఱ యెసలారు లుల్లుఱుకు లాడెడి పీఱిఁడి రజ్జులాఁడు గ్రి
క్కిఱియుట నాఁ దెనుంగునకు నీయుభయంబు వళిప్రకారమై
మెఱయఁ గవిప్రయోగమున మేల మెఱింగి రచింప నేర్చినన్. ౧౯

క. చెన్నక్కుఁడుఁ జెన్నక మా, చన్నన మాచన యనంగ నచ్చట వళి యై
చెన్నగు నకార మార్యుల, మన్నన హల్లేని గలుగు మఱియొక్కొకచోన్. ౨౦

క. కడలాలుం జవరాలును, జడుఁ డొక్కం డొకఁ డనంగఁ జనునుడువుల న
చ్చిడుఁటయె తగు వడి హల్లును, వడి నేయుఁదు రంద్రు కవులు వలసినచోటన్. ౨౧

క. ఏకైకము సోదర నా,కౌకులు ననుశబ్దములకు నొగి నేతోవ్త్వా
నీకము వళు లగుఁ గొందఱు, గైకొందురు వృద్ధివళులు కవు లాడఁబడికన్. ౨౨

## షడ్విధప్రాసములు.

క. భాసురము లగుచు సుకర, ప్రాసానుప్రాస దుష్కరప్రాసాంత్య
ప్రాస ద్వంద్వ త్రితయ, ప్రాసము లన షడ్విధములు పరఁగుం గృతులన్. ౨౩

## సుకరప్రాసము

క. సుకుమారము శ్రుతిసుఖదము, నకలంకము నైనవర్ణ మావ్యత్యర స్పృ
ష్టికి రెండవప్రాయి ఘమీ, సుకరప్రాసం బనంగ సులభము కృతులన్. ౨౪

క. అరవిందహితుఁడు దీధితి, నరవిందోదరుఁడు విద్విడపహారణముఁచో
నరవిందభవుఁడు చతురత, ధర ధరణివరాహ విశ్వధరణిపుఁ డెపుడున్. ౨౫

## అనుప్రాసము

క. ఇడునెడఁ బ్రాసాక్షరములు, బిడి తప్పక పాదపదవిభాగములఁ గడున్
బెడఁగైన ననుప్రాసం, బడరుం గబ్బముల నెల్ల నమరినతోడవై. ౨౬

క. రుంద్రములు సాంద్రములు ని,స్తంద్రములును గుణము లెపుడు ధర సత్యహరి
శ్చంద్రునకుఁ జంద్రవంశ్యున, కింద్రోర్జితమహిమునకు నుపేంద్రసుతునకున్. ౨౭

## దుష్కరప్రాసము

క. పరువడిఁ బాదాదుల నుచ్చరణాసహ్యాక్షరముల సమకూర్చిన దు
ష్కర మనియెడు ప్రాసం బగు, సరసాలంకార మనుచుఁ జను సత్కృతులన్. ౭౮

క. నుర్గయి విశ్వేశ్వరుఁడో, రర్గళమాలిఁ జన్న రిపుల న వినుతింపన్
స్వర్గవధూకుచకుంభ వి,నిర్గళదంబువుల చేత నిర్మలు లగుటన్. ౭౯

## అంత్యప్రాసము

క. మొదలిచరణంబుకడ శుభ, పద మయ్యెడి ప్రాయి యన్ని పాదంబులకున్
దుదనుండి మండనం బ, నది యంత్యప్రాస మనఁగ నమరుం గృతులన్. ౮౦

క. భూజనహితనయశీలున్, బూజింతురు నృపులు విశ్వభూమీపాలున్
రాజితకీర్తివిశాలున్, రాజేంద్ర చ్ఛత్రచామరశ్రీలోలున్. ౮౧

## ద్వ్యంత్య ప్రాసము

క. క్రమమునఁ బాదాదులయం, దమలము లై రెండు మూఁడు నక్కరములు చె
న్న మరిన ద్వంద్వత్రిప్రాసము లనఁగా బరఁగు వానిఁ జనుఁ దెలియంగన్. ౮౨

క. దానంబు వివిధకుశలవి,దానంబు విరోధిరాజ దత్తధనచయా
దానంబు గవులసొమ్మప,దానం బిత్తెఱఁగు విశ్వధరణీపతికిన్. ౮౩

క. శీలనమును దన్నవపరి, లాలనము నశేషశాస్త్ర లాలితవిద్యా
ఖేలనము ధర్మధరణీ, పాలనమును విశ్వధరణిపాలుఁడ కొనరున్. ౮౪

## లళడ బుక్రాంతప్రాసములు

క. వలసినచో లళములు డల, ములు మఱి బుక్రాంతవర్ణములు ప్రాసము లై
యలవడు సత్కవికృతులన్, నిలుపందగు వానిఁ దెలిసి నియతప్రీతిన్. ౮౫

క. తాళము దాలము నాఁజనుఁ, జోళుఁడు చోడుండు నాఁగ సొంపగు నుగ్ర
వ్యాళ వ్యాడ వ్యాలము, లోలి న సమరూఢిఁ బ్రాసయుక్తిం జెల్లున్. ౮౬

తే. భీకరాకారుఁ డయ్యు నంగీకృతుండు
మేదురక్రోధుఁ డయ్యు ననాదృతుండు
పావనాత్మకుఁడయ్యు బలావృతుండు
నాఁగఁ బ్రాసంబులకు సమానంబు లెపుడు. ౮౭

## వృ త్త ము లు

క. ఇది ప్రాసలక్షణం బిఁక, విదితంబుగఁ బింగళాహివిరచిత మగుచున్
బొదలెడు ఛందోగణ సం,పద యగు వృత్తప్రపంచపద మెఱుఁగఁ దగున్. ౮౮

క. ఆదట నక్షర గణ నో, త్పాదిత గణసంప్రవృత్తితంత్రముచేఁ గా
కోదరుఁడు గరుడునిం బ్ర, చ్ఛాదించుట ఛంద మనఁగ జగతిం బరఁగున్. ౭౯

క. ఇది లౌకిక వైదిక వాఙ్మద మై షడ్వింశతిప్రపంచాత్మక మై
పొదలుం. దెలియఁగవలయును, ముదమున నభిధానరూపముల చందంబుల్. ౮౦

వ. ఉక్త, అత్యుక్త, మధ్య, ప్రతిష్ఠ, సుప్రతిష్ఠ, గాయత్రి, ఉష్ణిక్కు, అనుష్టుప్పు, బృహతి, పంక్తి, త్రిష్టుప్పు, జగతి, అతిజగతి, శక్వరి, అతిశక్వరి, అష్టి, అత్యష్టి, ధృతి, అతిధృతి, కృతి, ప్రకృతి, ఆకృతి, వికృతి, సంకృతి, అతికృతి, ఉత్కృతి, అనం బ్రవర్తిల్లు; నందు నుక్తాదిచ్ఛందంబు లొక్కొక్కయక్షరంబునుండి యొండొంటి కొక్కొక్క యక్షరంబుగా షడ్వింశాక్షరపర్యంతంబుఁ బెరుఁగు. అందు నుక్తాచ్ఛందంబునఁ బ్రతిపాదంబున నేకాక్షరం బై శ్రీ యను వృత్తంబయ్యె:

శ్రీ-శ్రీ-జే-యున్.

అత్యుక్తాచ్ఛందః పాదంబు ద్వ్యక్షరం బందు స్త్రీ యను వృత్తం బయ్యె:

స్త్రీరూ-పారుం-గారూ-పాదున్.

మధ్యాచ్ఛందంబు త్ర్యక్షరంబై నారీవృత్తంబునకు జనకం బయ్యె:

నారీవృ-త్తారంభం-బారు న్మా-కారం బై.

ప్రతిష్ఠాచ్ఛందః పాదంబు చతురక్షరం బై

కన్యావృత్తము

పొత్తై మాగా-వృత్తిం గన్యా-వృత్తం బయ్యెన్-జిత్తం బారన్

సుకాంతివృత్తము (జగ.)

జగంబులంద-కున్ సుకాం-తి గల్పిత-ప్రగల్భతన్.

సుప్రతిష్ఠాచ్ఛందః పాదంబు పంచాక్షరం బై

సుందరీవృత్తము (భగగ.)

సుందరి యొప్పుం-జెంది భగా నిం-పొంద నియుక్తిన్-గందుకలీలన్.

ప్రగుణావృత్తము (సగగ.)

సగణాసక్తిం-గగసంయుక్తిన్-బ్రగుణాఖ్యం బై-తగు నింపారన్.

అంబుజవృత్తము (భవ.)

ఇంబగు భకా-రంబును వకా-రంబును జుమీ-యంబుజ మగున్.

విచ్ఛేదోధికారము

క. ఇం దుండియుఁ గరణీయ. చ్ఛందోవృత్తముల నర్థ సంజ్ఞితములఁ గా
నొందింతు గ్రంథవిస్తృతి, క్రందునకుం గాక యర్థగౌరవ మొప్పన్. ౮౧

గాయత్రీచ్ఛందఃపాదంబు షడక్షరంబై

### విచిత్రవృత్తము (యయ.)

విచిత్రంబునందుఙ్ - రచింపఙ్ యయంబుల్.

### తనుమధ్యావృత్తము (తయ.)

ఒప్పాఙ్ తయ యుక్తం - జెప్పం దనుమధ్యఙ్.

### సురలత (పయ.)

సురలతఁ జెప్పఙ్ - సొరది నయంబుల్.

ఉష్ణిక్ ఛందఃపాదంబు సప్తాక్షరంబై

### విభూతివృత్తము (రజగ.)

వ్యక్త సద్విభూతి దా-రక్త జక్తగంబునఙ్.

### మదనవిలసితము (ననగ.)

మదనవిలసిత-ప్రదములు ననగల్.

### కుమారలలిత (జనగ.)

కుమార లలితకుఙ్-సమగ్ర జనగముల్.

అనుష్టుప్ఛందఃపాదం బష్టాక్షరం బై

### విద్యున్మాల యనువృత్తము (మమగగ.)

శ్రీలీలఙ్ రాజిల్లుఙ్ విద్యు-న్మాలాఖ్యం బై మాగాసక్తిన్.

### చిత్రపదము (భభగగ.)

చిత్రపదం బన భాగా-చిత్రయతిప్రతిపత్తిఙ్.

### ప్రమాణి (జరవ.)

జకారముఙ్ రకారముఙ్-వకారముం బ్రమాణికిఙ్.

### సమాని (రజవ.)

ఈసమానికిఙ్ రజవ-వ్యాస మొప్పగుం గృతులఙ్.

### సింహరేఖ (రజగగ.)

ఈరజాగ్రగా నియుక్తికిఙ్-గోరి సింహరేఖ యొప్పుఙ్

బృహతీచ్ఛందఃపాదంబు నవాక్షరం బై

భుజగశిశురుతమనువృత్తము (ననయ.)

భుజగశిశురుత మయ్యెన్-బుజు ననయ ములచేతన్.

హాలముఖి (రసస)

కామితక్రియ హాలముఖి-నామ మొప్పు రసనలచేన్.

భద్రకము (రనర.)

భద్రకంబు రనరంబులన్-భద్ర విశ్వనృపమన్మథా.

ఉత్సుకము (భభర.)

ఉత్సుక నా భభరంబులన్-మత్సరి మాన విమర్దనా.

---

క. ఇట నిం దీవల విశ్రమ, ఘటనలు కల్పింప పలయుఁ గబ్బంబుల నె
చ్చట నిలుపంగాఁదగున,చ్చటఁ దగఁ బరికించి నిలుప శాస్త్ర ప్రౌఢిన్. ౫౪

పంక్తిచ్ఛందఃపాదంబు దశాక్షరం బై

రుగ్మవతి యనువృత్తము (భమసగ, 6)

రుగ్మవతిం జేరున్ భమసంబుల్-లిగ్మరుచిద్యుద్దీప్త గయుక్తిన్.

మయూరసారి (రజరగ, 7.)

పర్వ నీరజంబు పై రగంబుల్-సర్వదా మయూరసారిఁ జెప్పన్.

మత్త (మభసగ, 7.)

శైలశ్రాంతిన్ మభసగలింపొంద్రాలన్ మత్తాఖ్యను గనుపట్టున్.

శుద్ధవిరాట (మసజగ, 6)

సక్తం బైమసజస్థగ ప్రథా-రక్తిన్ శుద్ధవిరాట నాఁజనున్.

పణవము (మనయగ, 6.)

అందం బైమనయగముల్ సొంపిం-పం దప్పొందక పణవం బయ్యెన్.

త్రిష్టుప్ఛందఃపాదం బేకాదశాక్షరంబై

శాలినీవృత్తము (మతతగగ, 6.)

రాకాధీశాకార రాజన్మ తా గా-నీకప్రాప్తిన్ శాలినీవృత్త మయ్యెన్.

ఇంద్రవజ్రము (తతజగగ, 8.)

ఈశాజగాసిస్మితి నింద్రవజ్రా-నీతాఖ్య వర్తించు వినిర్మలోక్తిన్.

### ఉపేంద్రవజ్రము (జతజగగ, 8.)

ఉపేంద్రవజ్రాహ్వయ మొప్పునిం పై యుపేంద్రపుత్త్రా జతజోక్తగాలన్.

### ఉపజాతి

ఈయింద్రవజ్రాఖ్య ముపేంద్రవజ్ర-శ్రయంబు గాఁగా నుపజాతి యయ్యెన్.

### తోదకముఁ (భభభగగ. 7.)

కామితభత్రయగాయుత మైవి-శ్రామవుఁదోదకసంజ్ఞతఁ జెందున్.

### రథోద్ధతము (రనరలగ, 7.)

రక్తిఁ జేర్చి రనరంబు పైలగం-బుక్త మైనను రథోద్ధతం బగున్.

### చంద్రిక (ననరవ, 7.)

సలలితముఁ జంద్రికాహ్వయం-బలరు ననర వాంక మై కృతిన్.

### స్వాగతము (రనభగగ, 7 )

స్వాగతంబు రనభంబు గగాప్తిన్-సాగువిశ్వనృపచంద్రకులాఢ్యా.

### శ్యేని (రవరవ, 7.)

శ్యేనికై రవంబు చెప్పి పైరవం బూనఁ జేయు టెల్ల నొప్పు నెప్పుడున్.

### వాతోర్మి (మభతలగ, 7.)

కద్వాతోర్మిన్ మభ తంబుల్ లగముల్-సద్విశ్రామస్థితి సంధిల్లఁ దగన్.

జగతీఛందఃపాదంబు ద్వాదశాక్షరంబై

### భుజంగప్రయాతవృత్తము (యయయయ, 8.)

భుజంగప్రయాతంబు పొం దారు నందం

బజస్రంబుగా నయ్యయాయంబు లొందన్.

### తోటకము (ససనస, 9.)

సరసం బయి సాససనంభృత మై-విరచించినఁ దోటకవృత్తమగున్.

### వంశస్థము (జతజర, 8.)

జతంబులం జెంది నజంబు రేఫయుక్-నుతింప వంశస్థ మనుక్రమక్రియన్.

### ఇంద్రవంశము (తతజర, 8.)

ఈతాజరాకల్పన నింద్రవంశకా-ఖ్యాతాఖ్య మయ్యెన్ బరగండభైరవా.

### తోదకము (నజజయ, 8 )

కలలిత మైననజాయగణంబుల్-విలసితతోదకవృత్తముఁ జెప్పున్.

### ద్రుతవిలంబితము (నభభర, 7.)

ద్రుతవిలంబితరూపితవృత్తిచేఁ-బ్రతతమయ్యె నభారగణంబులన్.

### స్రగ్విణి (రరరర, 7.)

స్ఫారితంబైయకూపారరశ్రేణితో-సార మై స్రగ్విణీచారువృత్తం బగున్.

### జలధరమాల (మభసమ, 9.)

మాద్యత్పీ్రతిం జలధరమాలాభిఖ్యం-బ్రద్యోతించుఁ మభసమభద్రవ్యాప్తిన్.

### ప్రమితాక్షరము (సజసస, 9.)

అమలక్రియాప్తిఁ బ్రమితాక్షర మై-యమరుఁ సయస్థసయంత్రిత మై.

### విశ్వదేవి (మమయయ, 8)

మాయావర్ణం బొప్పం గ్రమన్యాసవృత్తిఁ
జేయుఁ భూభృద్విశ్రాంతిచే విశ్వదేవిఁ

క. అకలంకయతిచ్ఛందో,ధికార మిది దీనినెఱిఁగి తెలియఁగవలయుఁ.
బ్రకటింతు విపులవృత్త, ప్రకరముఁ బ్రస్తారసరణిరచనీయంబున్.

శా. ఛందశ్శాస్త్రవివక్ష సత్కృతిపరిష్కార క్రియాదక్ష స్వ
చ్ఛందక్రీడదురుప్రతాప కరుణాసంపన్న సల్లాప ని
ష్యందానందితసాధులోక భువనప్రఖ్యాతసుశ్లోక స
ద్వందారుక్షితిపాల పాలనకళాధౌరేయ ధైర్యోజ్జ్వలా.

క. రాజేంద్రచరిత్రద్వను, రాజద్విజ యోందిరాభిరా మైశ్వర్యా
రాజాన్వవాయసర్యా, రాజీవ కంబసూర్య రసికాచార్యా.

### మాలిని

రభసరణ విశంకా రాజనారాయణాంకా
సభయరిపుశరణ్యా శశ్వ దాసన్నపుణ్యా
సభికహితపదార్థా సర్వలోకాశ్రయార్థా
విభవవిబుధనాథా వీరలక్ష్మీ సనాథా.

### గద్యము

ఇతి శ్రీమదుమారమణ చరణారవిందవందన గోవిందామాత్యనందన
వివిధబుధవిధేయ విన్నకోట పెద్దయనామధేయ విరచితం బైన
కావ్యాలంకారచూడామణి యను నలంకారశాస్త్రంబు
నందు ఛందోగణ వళి ప్రాస చ్ఛందోధి
కార లక్షణ సముద్దేశం బన్నది
సప్తమోల్లాసము.

---

# అష్టమోల్లాసము

## ఛందస్సు

భ జ స య ర త మ న గ ల

U|| - |U| - ||U-|UU- U|U- UU|-UUU-||| - U - |

గలము—లగము

U| |U

(గలమునకు హగణమనియు—లగమునకు వగణమనియు నామాంతరములు)

క. శ్రీవిశ్వేశ్వర విశ్వవిఖ్యాతవల్లభవంద్య పాదకమల కమలభూ
దేవీ కమలసితయశా,కోవిదనుత రాయగండ గోపాలాంకా ! ౧

౧౩. అతిజగతీచ్ఛందఃపాదంబు త్రయోదశాక్షరంబు—

అందుఁ బ్రహర్షిణీవృత్తము—(మ-న-జ-ర-గ-౮ యతి.)

ప్రావీణ్యప్రదయొనరం బ్రహర్షిణింద్రాఁ,గావించుఁ మనజరగ వ్రజంబుధాత్రిన్

రుచిరవృత్తము—(జ-భ-స-జ-గ ౮ యతి.)

క్రమంబుతో జభసజగమ్ము లిమ్ముగా,సమర్పఁగా రుచిరసమాహ్వయం బగున్.

మత్తమయూరము—(మ-త-య-స-లగ-౯ యతి.)

సంబోధార్థంబై విలసన్మత్త మయూరా
ఖ్యం బింపొప్పారున్ మతయాగ్ర్యస్థిత సగాప్తిన్.

మంజుభాషిణి—(స-జ-స-జ-గ-౯ యతి)

సలయంబుగాఁగ సజసంబుతో జగం,బులు మంజుభాషిణికిఁ బొందు నందమై.

జలదము—(భ-ర-న-భ-గురు-౧౦ యతి.)

ఈభరనంబుల న్భగురు లెక్కుచు నిం,పై భజియించె నేని జలదాహ్వయ మా.

ప్రభాతము—(న-జ-జ-ర-గ-౮ యతి.)

మొదల నజారగము ల్ప్రభాతసంజ్ఞం,బొదవఁగఁ జేయు నపూర్వశిల్పనోక్తిన్.

౧౪. శక్వరీచ్ఛందఃపాదంబు చతుర్దశాక్షరంబు

అందు వసంతతిలకవృత్తము—(త-భ-జ-జ-గ-గ-౮ యతి.)

స్థాపించినం దభజజంబు చతుర్క విశ్వ, త్మాపా వసంతతిలకంబగు గానియుక్తిన్

అపరాజితవృత్తము—(న-న-ర-స-ల-గ-౯ యతి)

ననరసలగముల్ దనర్చిన సత్కృతిం, దనరంగ నపరాజితంబు కవిస్తుతిన్.

వనమయూరము—(భ-జ స-న-గగ-౯ యతి.)

నందయతితో, భజసనవ్రజగగం బిం,పొంది చదువ న్వనమయూర మగుధాత్రిన్.

సుందరము—(భ-భ-ర-స-లగ-౯ యతి)

భారసవంబుల నొప్పఁ పద్మజవిశ్రమం,బారఁగ సుందరవృత్తమై బుధవర్ణ్యమై.

ప్రహరణకలితము—(న-న-భ-న-లగ-౮ యతి.)

ప్రహరణకలితంబయి ననభనలల్, బహువిధయతులం బ్రథఁ జెలు వడరున్.

భూనుతము—(ర-న-భ-భ-గగ-౧౦ యతి.)

అందమై రననభతతి నంది గగంబుల్, పొందఁగాఁ బధగలైఁగని భూనుతమయ్యెన్.

౧౫. అతిశక్వరీచ్ఛందఃపాదంబు పంచదశాక్షరంబు

అందు మణిగణనికరవృత్తము—(న-న-న-న-స-౮ యతి.)

సరసత్వ ననన సగణము తెసఁగం; గరియతిఁ గని మణిగణనికర మగున్.

మాలినీవృత్తము—(న-న-మ-య-య-౮ యతి.)

కరటివిరతి నామక్రాంతయాయుక్తితోడన్

మరగిళ్లిరుగఁ జెప్ప న్మాలినీవృత్తమయ్యెన్

సుకేసరము (న-జ-భ-జ-ర-౧౦ యతి.)

నజభజరేఫలం గదియ నచ్చి దిగ్యతిన్, సుజనమతి న్సుకేసరము శోభితంబగున్

మణిభూషణము—(ర-న-భ-భ-ర-౧౦ యతి.)

విశ్వభూప మణిభూషణవృత్త మనంజనున్, శశ్వదుత్తరనభారదిశాయతిఁగూడినన్.

మనోజ్ఞము—(న-జ-జ-భ-ర-౯ యతి)

వరుస మనోజ్ఞమనంగ వచ్చు నజాభర, స్థిరగతిఁ బంకజభూయతిం బ్రతిపన్నమై.

౧౬. అష్టిచ్ఛందఃపాదంబు షోడశాక్షరంబు

అందుఁ బద్మకవృత్తము—(స-భ-జ-జ-జ-గ-౧౧ యతి.)

సభజజజద్వయగకార సనాతన విశ్రుతిం, బ్రభవమై పరఁగు సత్కృతిఁ బద్మకవృత్తమై.

ప్రియకాంతావృత్తము—(న-య-న-య-స-గ-౧౦ యతి)
నయనయయుక్తిం దగసగణంబుల్ గురువహింపన్
నియతము దిగ్విశ్రమమును నించుం బ్రియకాంతన్.

చంద్రశ్రీ—(య-మ-న-స-ర-గ-౧౧ యతి)
అగుం జంద్రశ్రీ దాహారవిరమణాయత్తమైనం
బ్రగాఢంబై యొప్పన్ యమనసర బద్ధాగ్రగాప్తిన్.

మేదిని—(న-జ-భ-జ-ర-గ-౧౦ యతి.)
నజభజరేఫగంబునఁ దనర్చు మేదినీవృత్తజనికి మూలమై దిగుదిశస్థ విశ్రమంబై.

౧౭ అత్యష్టిచ్ఛందఃపాదంబు సప్తదశాక్షరంబు

అందు శిఖరిణీవృత్తము—(య-మ-న-స-భ-లగ-౧౨ యతి)
వివస్వద్విశ్రాంతిస్యమనసభవావిష్కృతగలిం
గవిశ్రేణీరక్తిన్ శిఖరిణియనంగాఁ దగుఁబ్రథన్.

పృథివీవృత్తము—(జ-స-జ-స-య-వ-౧౨ యతి)
జసంబులు జసంబులన్ యవనివిష్క్తరూపంబులై
పొసంగఁ బృథివీసమాఖ్యయగుఁ బూషవిశ్రాంతితోన్.

హరిణి—(న-స-మ-ర-స-వ-౧౧ యతి)
హరిణి యనువృత్తం బయ్యెన్ శంకరాత్తయతిప్రథన్
సరినసమరేఫాక్రాంతోపేత సస్థలగంబులన్.

మందాక్రాంతము—(మ-భ-న-త-త-గగ-౧౧ యతి)
పొందందంబై మభనతతగా భూషితంబై తనర్పన్
మందాక్రాంతావ్వాయమగు శివామందవిశ్రాంతి చేతన్.

త్వరితపదగతి—(న-న-న-న-న-గగ-౧౧ యతి.)
త్వరితపదగతి యనఁగ: దగుననననగా, విరచితయు దశమయతి విలసితయు నైవన్.

నర్కుటము—(న-జ-భ-జ-జ-వ-౧౦ యతి)
నజభజముల్ జవంబులఁ దనర్చిన నర్కుటకప్రజనన మొప్పు దిగ్యతినిరాజకులాబ్ధిశశీ.

౧౮. ధృతిచ్ఛందఃపాదం బష్టాదశాక్షరంబు

అందుఁ గుసుమితలతావేల్లితావృత్తము— (మ-త-న-య-య-య-౧౧ యతి.)
స్వశ్రేయస్సిద్ధిన్ మతనయయయవ్యాప్తిచే జర్మవాసో
విశ్రామం బొప్పం గుసుమితలతావేల్లితావృత్తమయ్యెన్.

మత్తకోకిలవృత్తము—(ర-స-జ-జ-భ-ర-౧౦ యతి.)

మత్తకోకిలవృత్త మై దశమప్రవర్తిత విశ్రమా
యత్తమై రసజాఖ్యరేఫల నచ్చమై కడు నొప్పగున్.

౧౯. అతిధృతిచ్ఛందఃపాదం బేకోనవింశత్యక్షరంబు

అందు శార్దూలవిక్రీడితవృత్తము—(మ-స-జ-స-త-త-గ-౧౨ యతి.)

సంబంధించి దినేశవిశ్రమముతో శార్దూలవిక్రీడితా
ఖ్యంబయ్యెన్ మసజంబులున్ సతతగాయత్తంబులై యుండినన్

మేఘవిస్ఫూర్జితవృత్తము—(య-మ-న-స-ర-ర-గ-౧౨ యతి)

మృదున్యస్తార్థంబై దినకరయతి న్మేఘవిస్ఫూర్జితాఖ్యం
బుదాత్తశ్రీఁ జెల్వున్ యమనసర రప్రోత గప్రాప్తిచేతన్.

చంద్రకళ—(ర-స-స-త-జ-జ-గ-౧౦ యతి.)

వ్యక్తరీతి రసాతజజగ్రాయత్త గకారనిరూఢిచే
సక్త దిగ్విరమంబన నొప్పుం జంద్రకళాహ్వయమై ధరన్.

తరలము (ధ్రువకోకిల)—(న-భ-ర-స-జ-జ-గ-౧౧ యతి.)

నభరసంబులు జాగవర్గము నచ్చి యీశ్వరవిశ్రమ
ప్రభవమై తరలం బనంజను రాజవంశశిఖామణీ!

భూతిలకము—(భ-భ-ర-స-జ-జ-గ-౧౧ యతి)

భూతిలకం బగు భారసంబులఁ బొంది జాగము లుండినన్
భూతపతిస్ఫుట విశ్రమంబున భూప విశ్వనరేశ్వరా!

౨౦. కృతిచ్ఛందఃపాదంబు వింశత్యక్షరంబు

అందు మత్తేభవిక్రీడితవృత్తము—(స-భ-ర-న-మ-య-వ-౧౩ యతి.)

మనమారం బదుమూఁట విశ్రమముగా మత్తేభవిక్రీడితా
హ్వానమయ్యెన్ సభరంబు లన్నమయవన్యాసంబులం జెప్పినన్.

ఉత్పలమాలావృత్తము—(భ-ర-న-భ-భ-ర-లగ-౯ యతి.)

పద్మజయుగ్యకేళిన్ భరనభారలగంబులఁ బొంది సన్మనః
పద్మవికాస హేతువగు పద్యము నుత్పలమాలయం డ్రిలన్.

అంబురుహము—(భ-భ-భ-భ-ర స-వ-౧౨ యతి.)

భాభభరంబులపై సవలొందుచు భానువిశ్రమయుక్తమై
యీభువి నంబురుహంబనఁగాఁ జను నిందువంశనృపాగ్రణీ.

ఖచరప్లుతము—(న-భ-భ-మ-స-స-వ-౧౧ యతి)

నభభముల్ మససంబు లగా ప్తి న్నాగవిభూషణయుగ్యతిన్
శుభదమై ఖచరప్లుత మొప్పు నోస్నుతలార్ణవచంద్రమా.

౨౧. ప్రకృతిచ్ఛందఃపాదం బేకవింశత్యక్షరంబు

అందు స్రగ్ధరావృత్తము—(మ-ర-భ-న-య-య-య-౭-౭ యతులు)

క్ష్మాభృద్భూభృద్యతిస్స్రీమరభనయయయామాత్రమైయాదిమాద్య
క్ష్మాభృత్కీర్తీశ విశ్వేశ్వరనృపతివరా స్రగ్ధరావృత్త మయ్యెన్.

చంపకమాలావృత్తము—(న-జ-భ-జ-జ-జ-ర-౧౦ యతి)

నజభజజారవర్గము దనర్చి దిశాయతి నర్థ యుక్తమై
బుజగతిఁ జెంది సత్కృవుల కింపుగఁ జంపకమాల యై చనున్.

లాటీవిటము—(స-స-స-స-మ-త-య-౧౨ యతి.)

సససా మతయంబులు భానుయతి న్నొకంబై లాటీవిటవృత్తం
బెసకంబెసఁగున్ విరచించిన విశ్వేశా, చాళుక్యక్షితిపాలా!

వనమంజరి—(న-జ-జ-జ-జ-భ-ర-౧౩ యతి)

తనర నజాజజభాగ్భరకారయుతత్రయోదశయుగ్యతిన్
వినుత మగు వ్వనమంజరినాఁ దగువృత్త మింపెసలారఁగన్.

మణిమాల—(స-జ-స-జ-స-జ-స-౧౨ యతి.)

వరుసన్ సజత్రితయము న్పిసక్త సగణంబుతోడ నొవరం
బరఁగున్ దిగంతవిరతిం బ్రధానపదమై చళుక్యమదనా!

౨౨. ఆకృతిచ్ఛందఃపాదంబు ద్వావింశత్యక్షరంబు

అందు మహాస్రగ్ధరావృత్తము—(స-త-త-న-స-ర-ర-గ-౮-౭ యతులు.)

సకలశ్రీవిశ్వ భూపా సతతనసరరా సక్తమై యగ్రగాప్తిం
బ్రకటింపన్ దంతిశైల ప్రచురయతి మహాస్రగ్ధరావృత్త మయ్యెన్.

భద్రిణీవృత్తము—(భ-ర-న-ర-న-ర-న-గ-౧౧ యతి)

భాదిరనత్రయంబు గురు యుక్తమై గిరిశవిశ్రమప్రకటమై
మేదిని నొప్పు భద్రిణికి నందు మేరునగధీర విశ్వనృపతీ.

మానిని—(భ-భ-భ-భ-భ-భ-భ-గ-౬-౬-౬ యతులు)

కామిని సప్తభకారము తోల గకారముతో పరి కల్పితమై
కోమలగావడి నిల్పినఁ బెక్కులు నిల్పిన మానిని నిక్కమగున్.

తురగవల్గిత—(న-న-న-న-స-జ-జ-గ-౧౪ యతి)

మెఱయు ననననసజజగములను మేలుగా రచియించినన్
వఱలు మనుయతి వలనను దురగవల్గితంబను వృత్తమై.

౨౩. వికృతిచ్ఛందఃపాదంబు త్రయోవింశత్యక్షరంబు

అందశ్వలలితవృత్తము—(న-జ-భ-జ-భ-జభ-లగ-౧౨ యతి)

నజభజను ల్భజంబులకు నచ్చి భస్థలగయుక్తమై రవియతిం
బ్రజనితమైన నశ్వలలితంబు రాజకులదీప ధీజనను తా.

కవిరాజవిరాజితవృత్తము—(న-జ-జ-జ-జ-జ-వ-౮-౬-౭ యతులు)

కలయఁగ నేకనకారపడుక్త జకారవకారనికాయనిర
ర్గళగతిచే నలరం గవిరాజవిరాజితవృత్తము రమ్యమగున్.

౨౪. సంకృతిచ్ఛందఃపాదంబు చతుర్వింశత్యక్షరంబు

అందు సరసిజవృత్తము—(మ-త-య-న-న-న-న-స-౧౦-౯ యతులు.)

చాళుక్యక్ష్మాపాలవరేణ్యా శ్రయమతయననిచయయుతననసల్
చాలై యింపై వ్రాలఁ దనర్పన్ సరసిజమగు నిలఁజవులకుఁ గుదురై.

క్రౌంచపదవృత్తము—(భ-మ-స-భ-న-న-న-య-౧౦-౮ యతి.)

ప్రాంచితతేజఃకుంచితవైరీభమసభననయపరిచితరీతిన్
అంచితమయ్యెం గ్రౌంచపదాఖ్యం బనుగతహరిదిభయతి నభివృత్తిన్

౨౫. అభికృతిచ్ఛందఃపాదంబు పంచవింశత్యక్షరంబు

అందు సింధురవృత్తము—(న-న-న-న-స-భ-భ-భ-గ-౧౨ యతి.)

క్రమమున నననన సభభభగగణ క్రాంతిదినాధిపవిశ్రమమై
ప్రమదధలసలయభరితవిరచనన్ బంధురసింధురవృత్తమగున్.

భాస్కరవిలసితవృత్తము—(భ-న-జ-మ-భ-న-న-సగ-౧౨ యతి)

సారసహితయతి సంగతవృత్తి న్సంచితభనజయభననసగంబుల్
పౌరవకులజలరాశిమృగాంకా, భాస్కరవిలసిత మనవిలసిల్లున్.

౨౬. ఉత్కృతిచ్ఛందఃపాదంబు షడ్వింశత్యక్షరంబు

భుజంగవిజృంభితవృత్తము—(మ-మ-త-న-న-న-ర-స-వ-౭-౧౨)

ధీవైదగ్ధ్యశ్రీవిక్రాంతాదిగిభదశమపదవిరతిన్ భుజంగవిజృంభితం
బైవిశ్రాంతుల్ దైవాఱం జెన్నగుమమతననరస హారిస్థు లగసంయుంతిన్.

మంగళమహాశ్రీవృత్తము—(భ-జ-స-న-భ-జ-స-న-గగ-౮-౮ యతి.)

శ్రీనిలయవిశ్వనృపశేఖరకృతస్తుతివశీకరణమంగళమహాశ్రీ
నా నెగడు సద్భుజసనంబులతుదన్ భజసనంబులు గగంబును దనర్పన్.

క. క్రమమున నిటువదియాఱై, యమరిన ఛందంబులందు నందంబులుగా
సముచిత సమవృత్తంబుల, సమకూర్చితి నెఱుఁగవలయుఁ జతురులు మఱియున్. ౨

క. ఆలాగు గాక యుద్ధుర, మాలావృత్తములు నాఁగ మంజులతాలా
వాలములు నధికవర్ణవి,శాలమ్ములు నగుచుఁ బరఁగుఁ జతురుల కెల్లన్. ౩

అందుఁ జత్వారింశన్మాత్రాగర్భితపాదంబు త్రింశదక్షరంబు

లయగ్రాహి—(భ-జ-స-న-భ-జ-స-న-భ-య-౮ పైఁబ్రాసయతి)

పంబినయుతిన్ భజసనంబులఁ బునర్భజస,నంబులభయంబులకదంబము లయగ్రా
హిం బెనుపునంబుధమతిం బరఁగుఁబ్రాసనియ,తుంబుకము పాదముల నింబడరుచున్నాదన్.

అట్లు చత్వారింశన్మాత్రాగర్భితపాదంబు చతుస్త్రింశదక్షరంబు

లయవిభాతియనువృత్తము—(న-స-న-స-న-స-న-స-న-స-స-గ)

ససనసస నాకలితనసనసగంబుల వి,లసితతర పాదములఁ బొసఁగునలువ్రాలం
బ్రసరితములై యలరుఁ బసలయవిభాతియన, రసికులకువీనులకు నొసఁగుఁజవులింపై.

అట్లు చత్వారింశన్మాత్రాగర్భితపాదంబు సప్తత్రింశదక్షరంబు

లయహారి యనువృత్తము—(న-న-న-న-న-న-న-న-న-న-న-స-గ

౧౦ పైఁబ్రాసయతి)

పదునొకఁడు నగణములఁ బొదలి సగణము గురువు
మృదులపదరచనఁ దగి యొదవి మిలిత్రాలన్
ముదమొసఁగు సభల నని చదువుదురు కవివరులు
హృదయములఁ జతురతలుగదుర లయహారిన్.

అట్లు చత్వారింశన్మాత్రాగర్భితపాదంబు చతుస్త్రింశదక్షరంబు

త్రిభంగియనువృత్తము—(న-న-న-న-న-న-స-స-భ-మ-స-గ.)

లలినసననసములు ససభమములు నతిసనయుక్తిం,జరింపం బ్రసరింపం బాటివహింపం
జెలువుగనసకలి నిలుపఁగఁదగునెడ వెలయుఁద్రిభంగి,సురక్తిం బదభక్తిం బ్రాసనియుక్తిన్.

## మఱియు ననియతపాదంబు - దండకము

కృతినాది ననహంబులొండెం దకారంబులొండెం బ్రకల్పించి యామీఁద నెల్లం దకార ప్రధానంబు గుర్వంతమై త్ర్యాల నిచ్ఛానురూపావధిం జేర్చి నిర్మించుచో మించి తత్తద్గణవ్రాతముల్ వృత్త్యనుప్రాసధుర్యంబులై యర్థవర్యంబులై మోదితార్యంబులై సాధుసారస్యహార్యంబులై రీత్యలంకారవంతంబులై పుష్టిమంతంబులై యింపు లంతంతకింపారఁ గల్పింపఁగా దండకంబు న్న మన్మండలం బయ్యె రాజేంద్రకోటీరకోటీతటీ నృత్యదాజ్ఞాగ్ర్యమాణిక్య విశ్వేశ్వరా విశ్వవిశ్వంభరా ధీశ్వరా.

మఱియు నీవృత్తములు స్వస్థానార్ధసమవృత్తములుఁ బరస్థానార్ధ సమవృత్తంబులు నన రెండు తెఱంగు లయ్యె నది యెట్లనిన:

క. ఛందోవృత్తంబుల సమ, సందర్భము లీడుపడఁగ సముచితనికట
చ్ఛందఃపాదంబుల సరవిం దప్పక యుంభయరూప వృత్తము లయ్యెన్. ౪

క. స్వస్థానార్ధసమములుఁ బరస్థానార్ధసమములును రచనలచే న
ర్ధస్థూలత నిరుదెఱఁగై, సుస్థిరవృత్తములఁ గృతుల సొంపుల నింపున్. ౫

గీ. మొదలి పాదంబు మూఁడవయదియు నరుస, ద్వితీయచతుర్థ పాదములు నట్ల
సమకవర్ణంబులైన వృత్తములఁ జెప్ప, స్వపదజాతార్ధసమవృత్త సంజ్ఞ వచ్చు. ౬

### నారీప్లుతవృత్తము

దానోదారశ్రీమతా గానియుక్తిం, గానంగఁదాజన్మ నగప్రసక్తిన్
మానై చాళుక్యక్షమాపాలరమ్యా, స్థానంబునారీప్లుత సంజ్ఞమయ్యెన్. ౭

### రతిప్రియవృత్తము

ఖ్యాతశ్రీమనజరగంబులుండఁగాఁ దధ్గతంబులై జభసజగంబు లొందఁగా
వీతాఘప్రముదితవిశ్వ విశ్వభూపా, ధృతిం దలంప నిది రతిప్రియం బగున్. ౮

### అజితప్రతాపవృత్తము

సజసాగణావలిఁ బ్రసన్ననభా, గ్రజరపంక్తి నభిరామరూపమై
యజితప్రతాపచెలువారుఁ గృతి, న్విజయవిక్రమణ విశ్వభూవరా. ౯

గీ. వలయుఛందంబు పాదంబుఁ దొలుతనిలిపి, యాలఛందంబు పాదంబు నౌల నిలిపి
యొలి నెడపెట్టి యీగతి నొనరఁ జెప్ప, వెనఁ బరస్థానసమకార్ధవృత్త మయ్యె. ౧౦

### అందుమనోహరవృత్తము

చాళుక్యన్నృపాల తజావములం, గలయన్ననసాపరికల్పితమై
మేలొప్పఁగ, జెప్పిన మేదినిలో, పలసిల్లు మనోహరవృత్తమునన్.

### కోమలవృత్తము

సలలితరీతి నజాయగణంబుల్, చళుక్యభూప జభసజస్థగస్థితిన్
మలయుచు నర్థసమర్థతచేత, న్వెలుంగఁ గోమల మనువృత్త మొప్పగున్. ౧౧

క. ఏకచ్ఛందోవృత్తా,నీకంబులు రెండురెండు నిలుపుదు రిష్ట
శ్లోకార్థంబుల నోలి వి,వేకులు స్వస్థానవిషమవృత్తంబులకున్. ౧౨

### అందు అంగజాస్త్రమనువృత్తము

దానాఖలేంద్రోదారభమంబుల్, పూనిసగాప్తిం బొంపిరివోవన్
జానార స్మసజంబు గస్థితం, బైసీడంజను సంగ జాస్త్ర మై. ౧౩

### వారాంగియనువృత్తము

చళుక్యవంశాజతజల్ గగంబుల్, చెలంగి యర్థంబునఁ జెంది రీతిం
గ్రాలంగఁ దాయత్తజగానియుక్తిన్, మేలయ్యె వారాంగి సమీహితాఖ్యన్. ౧౪

### నదీప్రఘోష మనువృత్తము

భారరముల్మ్రాగఁ బ్రాగుపేతంబులై, చరించుచుండంజతజస్థరేఫలం
బరత్రిపాదంబులఁ బద్వనొప్పఁగన్, దిరంబుగా మూఁట నదీప్రఘోషమై. ౧౫

క. అందముగ నుపక్రాంత, చ్ఛందఃపాదంబు లొల సాగెడునికట
చ్ఛందఃపాదంబులతో, నందఁ బరస్థానవిషమమనువృత్త మగున్. ౧౬

### అందు శ్రీరమణావృత్తము

అరభమవ్యాయత్తసగవ్యా,పారము నాదిమ పాదము నెందన్
జారుభభాగగసంగతిచేతన్, శ్రీరమణంబని చెప్పిరి మూఁటన్. ౧౭

### శరభక్రీడావృత్తము

చతుర్వర్ణాధారాయమనసరగవ్యాప్తినాద్య
ద్వితీయాంత్యాంఘ్రిప్రస్తుతగతి నతిస్పష్టమైనన్
ఖ్యాతాసక్తిన్ మభనయయ తృతీయాంఘ్రినొప్పన్
బ్రతిప్రేమోత్పత్తిం బరఁగి శరభక్రీడ యయ్యెన్. ౧౮

### సర్వాపరస్థానవిషమవృత్తంబులలో వీణారచనయనువృత్తము

చాణక్యనయజ్ఞాతయసస్థసగంబుల్, వీణారచనకొందు భువిందససావంబుల్
శ్రేణిందజనస్థితభస సేవిత నియతిన్, రాణలనెలవై భస నజరంబు లోలిగన్. ౧౯

క. ఛందఃప్రస్తారక్రమ, సందృష్టంబైన వృత్తసంఘములం దొ
ప్పందము లగుపాదంబులఁ, బొందింపఁగ విషమవృత్తపుంజము లడరున్. ౨౦

## ఇది వివిధవిషమవృత్తలక్షణము

క. మాత్రాగణరచనలకుం, బాత్రములై తగడి యంధ్రభాషాకవితా
మిత్రములై రసభావా, మత్రములౌ జాతు లెఱుఁగ మంచిది కృతులన్. ౨౧

క. అందును గందంబులు నా, సందంబులు భజసనలగగాఖ్యలచే వా
నిం దగు తెఱఁగం బ్రాసము, ముందుగ నిడి మూఁడు నైదు మూఁడున్నైదున్. ౨౨

క. ఆదిమవర్ణము వళి నిడు, పై దొరకినఁ గుఱుచయైన నట్టుల త
త్పాదాదుల నిలుపందగు, గాదిలిగాఁ జెప్పఁదలఁచు కందంబులకున్. ౨౩

క. నిడుదలగు పాదములకును, వడి నాలవగణము మొదల వలయు నిలుప న
క్కడలను గురువును మూఁడవ, యెడ నలజలలోన నొకటి నిడ బెడఁగగున్. ౨౪

క. ఇందుపుర బాణనగముల, కందువ జగణంబు నిలుపఁగాఁ గా దెపుడుం
గందములకు నార్యాదుల, చందం బధికంబు వానిఁ జనుఁ దెలియంగన్. ౨౫

క. కందము నర్ధంబులతుద, నందినగురు వుడుపఁ బథ్య యగు నాఱవచోఁ
జెందిన జగణము లత్వముఁ, బొందిన నది యార్యయనఁగఁ బొసఁగుం గృతులన్. ౨౬

క. క్రమమునఁ బథ్యార్యార్థము, లమరంగా వీడుపడిన నది గాథాభే
దముగాఁగం బరఁగు ప్రపంచము తెనుఁగునఁ జెప్పరండ్రు చతురులు కృతులన్. ౨౭

## సీసపద్యలక్షణము

క. భావరసాలంకార, ప్రావిర్భూతాంధ్రకావ్యఫణితులకును ర
మ్యావాలము లగుసీసగ, ణావళిలక్షణము లెఱుఁగనగుఁ జతురులకున్. ౨౮

క. నలనగసలభరతగణం, బులు నసహంబులును ననఁగఁ బొలుపగు సీసం
బులు గీతులు వానఁగదా, యలవడఁగవలయుఁ గృతుల కందం బరయన్. ౨౯

క. ఒకగురువు రెండులఘువులు, నకలంకత సమమ కాన హానములు దమలో
నొకఁడొకఁడు వీడుపడుచున్, వికటింపక చెల్లు నొక్క వృత్తము తక్కన్. ౩౦

క. అమరంగ విషమసీసము, సమసీసము లనఁగఁ రెండుచందము లందున్
బ్రమితమగు విషమసీస, క్రమ మెఱుఁగఁగవలయుం జతురకవిజనములకున్. ౩౧

గీ. హగణనగణంబు లేదు గుర్వంతమగుచు, విస్తరిల్లిన నుత్సాహవృత్తమయ్యె
దీనితుద గీతియొకఁడు సంధింప విషమ,సీస మిత్తెఱఁగెఱుఁగుట చెలువుమతికి. ౩౨

ఉత్సాహము. ఓసరించుఁ బజ్జ లజ్జ లుజ్జగించు రాజులన్
వేసరించు గర్వపర్వవేషభూషితారులన్
వాసవానుకాం వీరవర్య విశ్వభూప నీ
భాసురాసిధేనుకానుభావ మాహవంబులన్. ౩౩

## విషమసీసపద్యలక్షణము

గీ. వడి దనర్పఁ బ్రాసవైభవం బలరార, నిట్లు గణనిరూఢి నెసక మెసఁగఁ
గీర్తితాతిమధురగీతియుఁ బైగల్గ, నదియ విషమసీసమండ్రు కృతుల. ౩౪

## సమసీసపద్యలక్షణము

గీ. వెలయుసమసీసములు పంచవిధములయ్యె, నరయ నవకలిసీసాహ్వయంబుఁ బ్రాస
సీస మక్కిలిప్రాససీసాఖ్యసీస,ము వడిసీస మక్కిలివడిసీసమును ననంగ. ౩౫

క. తన పాదంబులు నాలుగు, మొనసిన పైగీతిపాదములు రెండును గా
సినుమూఁడై సీసమునకు, జను నడుగులు వ్రాలు వళ్లు సరి యున్నిటికిన్. ౩౬

## అవకలి సీసము

క. అలవడిసీసము పాదము, నలఁతునుకలు చేసి మూఁట నలనామగణం
బుల రెంటిరెంటి నిడి య,వ్వలితునుక నహంబు లిడఁగవలయు న్వరుసన్. ౩౭

సీ. సామంబుచే దుల్యభూమీశ్వరులు దనతోడిమిత్రతను నట్టాడుచుండ
దానంబుచే నతిమానమానవనాథు, లేర్పడ నక్కఱఁ దీర్పుచుండ
భేదంబుచేత దుర్మేదమహీశులం దంద సంక్షిప్తత నొందుచుండ
దండంబుచేత నుద్దండమాండలికులాజ్ఞాచక్ర మాదల మోచియుండ
శశ్వదనురక్తిఁ జాళుక్యవిశ్వవిభుఁడు, వాలి వసుమతి లీలమై నేలుననుచుఁ
జెప్ప నవకలిసీస మిట్లొప్పునండ్రు, పూని గావ్యకళావేదు లైనకవులు. ౩౮

## ప్రాససీసము

క. సీసమునకు నాలుగడుగులఁ, బ్రాసము లిడి యోలి సర్వపదఖండములన్
భాసురముగ వళ్లలవడఁ, జేసిన నది కృతులఁ బ్రాససీసంబయ్యెన్. ౩౯

సీ. చక్రవాళాచల చంద్రకాంతములకు సంతతార్ద్రత్వంబు జరపి జరపి
చక్రిశలోకసంచరదురుసంతమసంబుల వడిఁ బాఱఁ జదిపి చదిపి
శక్రేభశంకరశంకరాచలశశి చారుదీధితుల పైఁ జాఁగిచాఁగి
చక్రస్తనీకుచసాంద్రచందనరస చర్చల పైఁ గేలి సలిపి సలిపి
విక్రమప్రతాపవిశ్రుతమూర్తియై విశ్వభూమివిభునివిశదకీర్తి
ప్రక్రమప్రసక్తిఁ బ్రసగించు నని చెప్పఁ, బ్రాససీస మనఁగఁ బరఁగు నెందు. ౪౦

## అక్కిలి ప్రాససీసము

క. తుదిగీతి నాలుగడుగులు, వదలక ప్రాసంబు నిలిపి వళ్లింపారం
గదిరినఁ గదురకయున్నను, నది యక్కిలిప్రాససీస మనఁగాఁ బరఁగున్. ౪౧

సీ. క్రమయుక్తి విద్యల కందువ లెఱుఁగుచుఁ గవులనే ర్పారసి గారవించి
సమరసంక్రీడనక్షమసుభటాటోప సంచారములకు నుత్సాహమూఁది
సమితాహితక్షమానాథులరాజ్యంబు నానాఁటి కొనర నున్నతముచేసి
ప్రముదితారాతుల భంజించి వేలుపుం బడఁతుల కింపారుపతులఁ జేసి
విమలకీర్తుల దిక్కులు విప్పనేర్చు, శమితతిమతుండు విశ్వేశచక్రవర్తి
సముచితంబుగ నని చాల సన్నుతింప, నమరు నక్కిలిప్రాససీసాహ్వయంబు. ౪౨

వడిసీసము

క. ఏపాదమునకు నేవడి, యాపాదింపంగఁబడియె నది ఖండములం
బ్రాపింపఁ జెప్పఁగ వళిని,రూపితసీసంబు నాఁగ రూఢికినెక్కున్. ౪౩

సీ. గ్రహదంష్ట్ర సోఁకని గ్రహరాజు ప్రియవచః కథనంబు నేర్చినకల్పభూజ
మలరుఁదూపులు కేల నంటని కందర్పుఁ డమ్మచే నింకని యంబురాశి
కన్నులు పెక్కులుఁ గల్గనియింద్రుండు కఱకేది వంగనికనకనగము
తనువెత్తి క్రాలెడుధర్మదేవతరూపుఁ దాల్చినరాజవిద్యావిభూతి
నయవిదుండు రాజనారాయణుఁడు విశ్వ,నాథుఁ డనుచు వర్ణనములు సేయ
వరుస నిట్లు కృతుల వళిసీస మన నొప్పు, వసుధ వైభవాలవాల మగుచు. ౪౪

అక్కిలివడిసీసము

గీ. సీసఖండంబు వళ్లిట్లు చెప్పి గీతి, ఖండవళి రెంటి కొక్కఁడుఁగా నొనర్ప
నదియ యక్కిలివడిసీసమండ్రు కృతుల, లక్ష్యములు చూచి యెఱుఁగుఁ డీలాగు లెల్ల.

క. సీసములకు గీతులకుం, బ్రాసములును వళ్లుఁ గలయఁబడి కవితల ను
ద్భాసిల్లఁ దఱచు నియమ, వ్యాసక్తియుఁ గలుగఁ జెప్పవలసినచోటన్. ౪౫

గీతిభేదములు

గీ. ప్రవళినాఁ బ్రసన్న పదినాఁగ గీతులు, సీసములను రెండు చెందుఁ దుదల
నాటవెలఁది యనఁగఁ దేటగీతి యనంగ, నాని పేళ్లు వేఱ వల్లగున్ దెలియ. ౪౬

ఆ. మూఁడునగణహగణములు రెండునలసామ,కములు హగణపంచకంబుఁ గూర్ప
నాటవెలఁది యడుగు లంబునిధులపట్లు, వ్రాలు వళ్లుఁ జెంది వఱలెనేని. ౪౭

గీ. నగణమొక్కండు మఱినలనామకములు, రెండు నగణంబులును దుద రెండునాలు
గడుగులును దేటగీతికి నబ్ధివిరతి, వలయుఁ బళ్లైన వ్రాలైన వరుస నిలుప. ౪౮

### మేలనగీతి

గలము రెండునగణములును గలసి ప్రాస మెఱయఁ
జెలువు దోఁప నెత్తుగీతి వెలయఁ గృతులయందు
నోలి నగణ మొండె హగణ మొండె నేడుచేసి
నాలుగడుగులందు నిలిపి నలువుదోఁప విరతి
వాలి పంచమస్థ యగుచు వచ్చెనేని యొప్పు
మేలనాభిధాన మైన మేలుగీతి కృతుల. ౪౯

### తరువోజ

నలనామకంబులునగణాంతములుగ నాలుగంఘ్రులయందు నాలుగుఁగూర్చి
పదిలు మూఁడెడలను వరుసతో నిల్పవలయు మూఁడవగణవర్ణంబు మొదల
నిలుపంగ నివ్విధి నిర్మించి విశ్వ నృపతికి నిచ్చిన నింపుసొంపారుఁ
దలకొని తగఁ బ్రాలు దంపెడిచోటఁ దరుణులచే సొంపుదనరుఁ దర్వోజ. ౫౦

### ఇంద్రాదిగణలక్షణము

గీ. ఓలి రెండు మూఁడు నాలుగు గురువుల, నైనగణము లినసురాధిపేందు.
గణము లక్షరోపకరణంబు లవి యాది, లఘుగణంబు మొదల లఘువునిలుప. ౫౧

| సూర్యగణములు | ఇంద్రగణములు | చంద్రగణములు | |
|---|---|---|---|
| UI | IIII | UIUU | IIUUI |
| III | IIIU | IIIUU | UIUI |
| | IIUI | UUIU | IIIUI |
| | UII | IIUIU | UUII |
| | UIU | UIIU | IIUI |
| | UUI | IIIIU | UIII |
| | | UUUI | IIIII |

### * అక్కరలక్షణము

వ. ఇత్తెఱంగున రవీంద్రచంద్రాఖ్యగణంబులలోన సప్తగణకల్పనీయంబై మహాక్కరంబు, షడ్గణకల్పనీయంబై మధ్యాక్కరంబును, బంచగణకల్పనీయంబై మధురాక్కరంబును, జతుర్గణకల్పనీయంబై యంతరాక్కరంబును, ద్విగణకల్పనీయంబై యల్పాక్కరంబు నానక్కరవృత్తజాతంబులు పంచవిధంబులం బరఁగు నందు. ౫౨

* అక్కఱలక్షణము.

### మహాక్కరం బెట్టిదనిన

వారిజాప్తుండు పంచేంద్రగణములు వనజారియుగము గూడి వెలయుచుండ
నారయ రెండవనాలవచోట్ల నర్కుండయి ననుం దనర్చుచుండఁ
గౌరి యవ్వడిపంచమగణమునఁ గూడి మొదల నిలుపంగ నగు
సారమై ప్రాసవడి సప్తగణములు సాఁగ మహాక్కర మతిశయిల్లు. ౧౩

### మధ్యాక్కరం బెట్లనిన

వరుసతో దేవేంద్రసూర్యవజ్రిరవుల......
విరచించి నాలవపట్టు విశ్రాంతి సదనంబుచేసి
తరబడిఁ దప్పక చెప్పఁ దగునండ్రు మధ్యాక్కరంబు
కరవాలభైరవు పెంపు గణషట్కమున నుతియింప. ౧౪

### మధురాక్కరం బెట్లనిన

తరణివాసవత్రితయంబు ధవళభానుయుతి నొంద
నిరతి విశ్రాంతి నాలవనెలవున నింపుమీఱ
సరసమధురార్థములఁ జెప్పఁ జను మధురాక్కరంబు
వరుసఁ బంచగణములను వాలి కృతుల వెలయు. ౧౫

### అంతరాక్కరం బెట్లనిన

కమలమిత్రుండు సురరాజగణయుగంబు, కమలశత్రునితోఁజెంది కందళింప
సమరుఁ బ్రావళ్లు నర్థంబునతిశయిల్ల, నమల మగునంతరాక్కర మబ్ధిసంఖ్య. ౧౬

### అల్పాక్కరం బెట్లనిన

సుమనఃపతియుగము సోముండును, నెమకంగఁబ్రావళ్లు నిండిమీఱ
గమనీయవిభవంబుగాంచునెప్డు, రమణీయ మల్పాక్కరము కృతుల.‡ ౧౭

### షట్పది

సురపతులిరువురు సురపతులిద్దఱు, సురపయుగమ్ముతో సోముండును
బరువడిఁబెనఁగొన నరుదుగ షట్పది, సరిఁబ్రాసములు దనరారంగను. ౧౮

### చౌపది

భసగానలములపైని గరంబు, నొసఁగఁగ మూఁడవయెడ విరమంబుం
బొసఁగినఁ జౌపదిఁ బొలుచు రసంబుం, గసవరముగఁ దగఁగదప్రాసంబుల్. ౧౯

‡ ఇది గీతపద్యమువలె నున్నది.

## త్రిపది

త్రిపదికి నొకయంఘ్రి నింద్రులు నలువురు
ద్యుపతులిద్దఱు సూర్యులిర్వు రౌలద్యుపతిద్వయార్కులు సౌల. ౬౦

## ద్విపది - మంజరి

శక్రత్రయంబును సవితృఁడుఁ బాద, విక్రీడితులు మృదుద్విపదికి నెపుడు
పళియుఁ బ్రాసంబును వలయు దీనికిని, వలదు ప్రాసంబంద్రు వరుస మంజరికి. ౬౧

## షట్ప్రత్యయములు

గీ. వచ్చి ప్రస్తారసంఖ్యా ననష్టములును, నౌలనుద్దిష్టలగకరణాధ్వములును
నన౯గషట్ప్రత్యయము లిందుఁదనరు వాని, నెఱుఁగ నేర్పుట ఛందంబు నెఱుఁగు నేర్పు.

## ప్రస్తారము

క. గురుపంక్తి నిలిపి మొదటను, గురువునకుం గ్రింద లఘువుఁ గొని దానిపయిన్
సరిచేసి పిఱుఁద గురులిడి, పరువడి లఘ్వంతమైనఁ బ్రస్తారమగున్. ౬౩

## సంఖ్యానము

క. గురుపంక్తి మొదల రెండిడి, వరుసను రెట్టింపఁ దుదకు వచ్చిన సంఖ్యా
పరిమాణము తచ్ఛందో, విరచితవృత్తములుగా వివేకింపఁదగున్. ౬౪

## నష్టము

గీ. అగసి వృత్తసంఖ్య నర్ధించుచో సరి,యైన లఘువు విషమ మైన గురువు
గొనుచు జేసి నొకఁడు గూడి యర్ధము సేయ, నవధి నష్టవృత్త మబ్బునంద్రు. ౬౫

## ఉద్దిష్టము

క. వలసినవృత్తగణాలి మొదల నొక్కఁడు నిలిపి తుదకుఁ దగ రెట్టింపం
గలలఘువుల పై లెక్కలు, నొలయఁగ మఱియొకఁడుగూడ నుద్దిష్టమగున్. ౬౬

## లగకరణము

క. ఎక్కువ యొకఁడుగ వృత్తపు, టక్కరముల దొంతి పేర్చి యట మీఁదటికై
యొక్కొకఁడ విడిచి యెన్నిన, లెక్కలు గురులఘువిమిశ్రలిఖితగణంబుల్. ౬౭
క ఆలెక్క లన్ని యెన్నిన, లోలత లఘువులును గురువులును గలిగెడు వృ
త్తాలి నవి గలయఁ గూడిన, నోలిం దద్వృత్తసంఖ్యయును నొనఁగూడున్. ౬౮

## అధ్వప్రక్రియ

క. వృత్తసంఖ్యనిడుపువెడలుపు రెట్టించి, వానినొక్కఁడొకఁడు వరుస నెన్న
నెన్ని యయ్యె నన్ని యొసఁగు నంగుళు లవి, ప్రస్తరింప నిడుపు పరఁగు విప్వ. ౧౯

శా. అందంబై శ్రుతిమూలమై విలసదుద్యత్సర్వలోకాశ్రయా
నందంబై సమవృత్తమై వివిధవర్ణశ్రావ్యమై సద్రస
స్యందంబై బహువిశ్రమంబయి భవచ్చారిత్రముంబోలె నీ
ఛందశ్శాస్త్రము పర్వు సర్వరసు విశ్వక్షోణిపాలాగ్రణీ. ౨౦

శా. కావ్యాలంకృతికల్పనక్షమకళాకల్యాణ కల్యాణపూ
ర్ణవ్యాపారసమృద్ధ యుద్ధవినమద్రాజన్య జన్యస్థల
క్రవ్యాదావళిగీయమానవిజయప్రారంభ రంభాదిరం
తవ్యస్త్రీసుఖవృత్తిసుందరసపత్నస్తోత్రపాత్రోదయా. ౨౧

క. నిఘ్నాఖిలశోభన వృత్రఘ్న మహత్తరవిభూతి రంజితజంఘా
దఘ్నారినవ్యజయ నిర్విఘ్నోదయసదయవినుత విశ్వాసనిధీ. ౨౨

## మాలిని

స్తుతహిమకరజూటా చూర్ణితద్విట్కిరీటా
ప్రతతగుణపరీణా పంచధాదాధురీణా
సితకరకులదీపా స్నిగ్ధబద్ధప్రతాపా
సతతలసదభిఖ్యా సర్వలోకాశ్రయాఖ్యా. ౨౩

## గద్యము

ఇది శ్రీమదుమారమణచరణారవిందవందన గోవిందామాత్యనందన
వివిధబుధవిధేయ పిన్నకోట పెద్దయనామధేయ విరచితంబైన
కావ్యాలంకారచూడామణి యను నలంకారశాస్త్రంబు
నందు ఛందోగణ జన్మశుభాశుభ నిరూపణ వివిధవళి
ప్రాస ప్రపంచలక్షణ సమవృత్తజాతికల్పన
షట్ప్రత్యయదర్శనాది సముద్దేశంబునం
దష్టమోల్లాసము.

---

# న వ మో ల్లా స ము

## వ్యాకరణము

క. శ్రీవిశ్వేశ్వర విజయ, శ్రీవిక్రమహర్మ్యబాహుశిఖర బుధోక్తి
శ్రీవిశ్వగిహ్వారీస్తుత, శ్రీవిభ్రమదాలయప్రసిద్ధవిభూతీ ! ౧

క. భవదనుమతి సూరిసుఖ, శ్రవణం బయ్యునట్టి యంధ్రబంధురరుచిమ
త్కవితాస్పద మగుపలుకుల, వివరింతుం దెలియఁ జెప్ప విధములు జగతిన్. ౨

క. యుక్తివిశేషము శబ్దం, బుక్తివిశేషంబు గాదు యోగ్యునకైనన్
యుక్తివిశేషము సాధ్యం, బుక్తివిశేషం బసాధ్య మూహింపంగన్. ౩

మ. విలసద్భావరసాద్యలంకృతులచే విప్పారి గీర్వాణభా
షల శబ్దంబుల కెన్నిమంచితనము ల్సంధిల్లు నాచంద మై
వళియుం బ్రాసము నంత కగ్గలమునై వర్తిల్లు సత్కావ్యముం
దెనుఁగంచుం జెవిఁ బెట్టలేమి యుతుపం దేఁగల్గునే మం దిలన్. ౪

క. ధర శ్రీపర్వతకాళే, శ్వరదాక్షారామసంజ్ఞ వఱలు త్రిలింగా
కరమగుట నంధ్రదేశం, బరుదారఁ ద్రిలింగదేశ మనఁ జనుఁ గృతులన్. ౫

గీ. తత్త్రిలింగపదము తద్భవంబగుటచేఁ, దెలుఁగుదేశ మనఁగఁ దేటపడియె
వెనుకఁ దెనుఁగుదేశమును నండ్రుకొందఱు, వ్రాస పంచగతులఁ బరఁగుచుండు. ౬

గీ. తెలుఁగు దేశభాష తెలియుఁ బొమ్మనఁబోక, తెలియవలయు మించు తేటపడఁగఁ
దొడవు గాక పసిఁడిఁ దొడిగిన నొప్పునే, కనక మింత యెంత కలిగెనేని. ౭

గీ. విశ్రుతులు హేమచంద్రత్రివిక్రమాదు, లొనరఁ జూపిరి ప్రాకృతంబునకుఁ ద్రోవ
నంధ్రభాషయుఁ బ్రాకృతాహ్వయమ కాన, వలయుఁ దల్లక్షణంబులు వరుసఁ దెలియ.

క. స్వరములు నచ్చులు ననఁగా, నరయ నకారాదిసంజ్ఞ నయ్యక్కరముల్
దిరముగ హల్వ్యంజనములు, వరుసఁ గకారాదిపంచవర్గాక్షరముల్. ౯

క. యరలవ లంతస్థలు నా, నురవగు శషసహలు పొలుచు నూష్మ లనంగాఁ
బరువడిఁ బ్రయోగములయెడ, విరచింపుడుఁ దెలియవలయు వీని తెఱంగుల్. ౧౦

క. భువిలోఁ దత్సమమును దద్భవమును సహజాంధ్రదేశభవమును దేశ్యో
ద్భవమును గ్రామ్యము నాఁ బం,చవిధములై తెలుఁగుఁబలుకుజాతము పరఁగున్. ౧౧

## తత్సమలక్షణము

గీ. పరఁగ సంస్కృతంబుపైఁ దెనుఁగువిభక్తులుసఁబడి పొసంగి యుండెనేని
తత్సమంబు నాఁగఁ దగునండ్రు సుకవులు, తద్విహీనకావ్యతతియు లేదు. ౧౨

చ. పరమవినీతిమంతు లగుపార్థివకోటికి విశ్వమేదినీ
వరుదెస నాగ్రహంబుఁ జిరవైరము సత్యవిహీనవృత్తముల్
బిరుదమదంబుఁ గైతవము భేదవిధానము దుర్ణయంబు మ
త్సరమును వర్జనీయ మనఁ దత్సమమై చను నంధ్రభాషకున్. ౧౩

## తద్భవలక్షణము

క. వదలక సిద్ధాక్షరములఁ, బొదివినవర్ణములఁ దూలిపోఁ బలుకఁగ న
గ్గదమై ప్రాకృతనిభ మగు, నది తద్భవపదము నాఁగ నభిహిత మార్యోక్తిన్. ౧౪

సీ. యజ్ఞంబు జన్నంబు యత్నంబు జతనంబు చంద్రముఁ డనుపేరు చందమామ
యోధులు జోదులు యోగులు జోగులు భేదంబు బీఁదంబు పృథివి పుడమి
విష్ణుండు వెన్నుండు వెజ్జు నా వైద్యుండు పుస్తంబు పొత్తంబు ప్రోడ ప్రౌఢ
కుబ్జుండు గుజ్జుండు కుక్క కుర్కురమగు శయ్యయు సజ్జ నా జాది జాతి
యనెడు పల్కులు తద్భవాహ్వయము లండ్రు, వీని నిన్నిటి నెఱిఁగి వివేకబుద్ధిఁ
గబ్బములు చెప్పుకవులచక్కదనము మెచ్చు,విపులవిద్యుండు చాళుక్యవిశ్వవిభుఁడు. ౧౫

## దేశ్యలక్షణము

క. శ్రేయములై బహుదేశా,నేయములై చక్కఁదనము నెఱదనములు నై
యాయానెలవులఁ జెప్పఁ దగు, దీయము లగుపలుకులెల్ల దేశ్యము లరయన్. ౧౬

సీ. వాలాయ మాలంబు వంగడ మంగడ సోలంబు చొక్కులు సోయగంబు
విన్నన్ను వెన్ను వావిరి వంత వాగెంబు డెందంబు డిప్పాడి డిల్లపాటు
నెమ్మోము నెత్తమ్మి నెలఁత క్రొన్నెల కొప్పు లావడి యొయ్యారి మారజంబు
పొక్కడు నెవ్వఁగు పొచ్చెంబు మచ్చిక యక్కజం బచ్చెరు వక్క నిక్క
వెలఁది చిగురెల్లి వేసలి వేసవేలు, నాఁగఁ జనుశబ్దములు దేశిసామకములు
వీనఁ జెప్పినకవితల వినుచు మెచ్చుఁ, జారుతరకీర్తి విశ్వేశచక్రవర్తి. ౧౭

## అచ్చతెలుఁగు లక్షణము

క. ఈమూఁడు తెలుఁగులలో, నేమిటనున్ దొరలకున్న నెల్లజనులకున్
లో మిగులఁ దేటపడియెడు, నామాటల యచ్చతెనుఁగు లన నెగడొందున్. ౧౮
చ. ఎనుములు గుఱ్ఱము ల్మొదవు లెడ్డులు బంతులు పందు లుప్పు ప
ప్పనుములు కొల్లు లాముదము గాములఁ బోఁకలు నేయి నూనె యే
పునఁ బెనుపొందు విశ్వవిభుఁ బ్రోలననం దగ విన్న వారికిన్
మనమునఁ దేటగాఁ దెలియుమాటల యచ్చతెనుంగు నాఁ జనున్. ౧౯

## గ్రామ్య లక్షణము

క. ఈసడములు గోరడములు,గా సరబీసరలఁ నైనకట్టిఁడిపలుకుల్
భాసిల్లు గ్రామ్యములు నా,హాసోక్తులఁ దెగడుచోట నవియును నొప్పున్. ౨౦
సీ. ఊసలు వేసలు వేసాలు దోసాలు దోసలు వేదాలు గాసడాలు
బొందలు గుద్దలు బొక్కలు గుండలు గంతలు మొదలైన కారకములు
దాని గొంచారమ్మి దీని గొంటూ బోకు మేనూనా నీవూను యేగవలయు
పాడేము సూసేము పైలురా గాసేము వాసేవు సేసేవు లేసిరాకు
మనెడు క్రియలును మొదలైనయట్టిగ్రామ్య
శబ్దములు శబ్దములుగాఁగఁ జనవు మెఱసి
కవుల మనుకొను నయ్యూరఁగవుల కైపు
వినిన నగకున్నె చాళుక్య విశ్వవిభుఁడు. ౨౧

## తత్సమశబ్దపరిజ్ఞానము

గీ. వలయుసంస్కృతంబు తెలిఁగించు తెఱఁగు సంధులు విభక్తిచయ విధులు సమాస
తద్ధితములఁ గ్రియలు తగుభంగి నెఱిఁగింతు, నమరశాస్త్రసరణి ననుసరింప. ౨౨

## అజంతప్రకరణము

క. నిడు పుడుపవలయు సంస్కృత, మెడపక లింగములు మూఁట నేకాక్షరముల్
విడిచి యజంతాముల కీనడక యవశ్యప్రయోజనము తెనుఁగునకున్. ౨౩
క. బిందువిసర్గంబులు గడ,నందిన పొల్లులను దక్కి యంధ్రవిభక్తుల్
పొందుగ సంస్కృతపదముల, ముందటి దెస నిలుప నందముఁగఁ దెనుఁగయ్యెన్. ౨౪
క. స్థావరతిర్యక్పదములు, దేవమనుష్యాదికములఁ దెనిఁగించునెడన్
వావిరి నబంతములకును, గావించు ముకారమును డుకారము నునికిన్. ౨౫

గీ. దానకల్పకుజము దర్పోగ్రసింహమ్ము, రజనికరుఁడు కాంతి విజయుఁ డాజిఁ
దనర విశ్వనాథుఁ డన నకారాంతశబ్దములఁ దెనుఁగుపఱుచు భంగులయ్యె. ౨౬

క. రవి యరితిమిరాపహతిం, బవి పరగిరివిహతి రణవిభావప్రతిభం
గవి విశ్వేశ్వరుఁ డనఁగా, భువినీద్వయమునకు నిదియపో తెనిఁగింపన్. ౨౭

గీ. ఇల నుకారాంతపదములఁ దెలుఁగుసేయఁ, గడ వుకారంబునుండు డుకారమండు
రాజనారాయణుఁడు నృపప్రభు వనంగ, విశ్వనాథుండునృపులకు విభుఁ డనంగ. ౨౮

క. మనుకటుపటుశబ్దాదుల, నొనరింప డుకార మెపుడు నుండదు కవితం
దెనిఁగించి చెప్పుచోటం, దనరు వుకారంబ యర్థదాయక మగుచున్. ౨౯

గీ. మనువు ధర్మశాస్త్రమతమున మిక్కిలి, కటువు బిరుదవినుతి కర్ణములకుఁ
జాలఁ బటువు ధరణి సంగీతసాహిత్య, సరణి విశ్వనాథచక్రవర్తి. ౩౦

క. వెలయు ఋకారాంతపదా,దులఁ దెనుఁగుగఁ జేయుచోటఁ దుదినిడుపులు గు
జ్జులు సేయందగు నృపులకుఁ, జలుక్యపతి కర్త భర్త సంహర్త యనన్. ౩౧

క. స్త్రీలింగంబుల నిడుపులు, వాలాయము నుడుపఁ దెనుఁగువచనము లగు నం
దాలోలస్త్రీహ్రీశ్రీ,ధీ లనులపితములు దక్కఁ ద్రిక్కిన వెల్లన్. ౩౨

క. స్త్రీలకు మదనుఁడు విజయ, శ్రీలకు రఘురాముఁ డెపుడు హ్రీలకు నుచితా
వాలము నిజపాలితభూ, ధీలకుఁ దగుపదము రాజదేవేంద్రుఁ డిలన్. ౩౩

క. శ్రీవిష్ణువర్ధనాఖ్య, క్ష్మావరుభూమిర వెపుడును మాకు ననంగా
భావగు నేకాక్షరశబ్దావళి యప్పిఱుఁద నొకరుఁ డంటకయున్నన్. ౩౪

క. వనితా యనుచో వనితయు, జననీ యని పలుకుచోట జననియును వధూ
యనుచోట వధువు తెనుఁగున, జనునాయీయూలుఁదుదలఁ జను పలుకుటకున్. ౩౫

క. ఐకారాంతము లోకా, రౌకారాంతములుఁ దెనుఁగు లైనప్పుడు పూ
ర్వాకృతితోడన యుండును, నోకారాంతంబులై బహుత్వము నొందున్. ౩౬

క. రై వరగును నడుగోవున, గోవులు విమకంగ గ్లౌనికులన్నృపతులు ధ
ర్మావిష్కృతిఁ బడయుదు రనఁ,గా వెలయుఁ గవిప్రయోగగతిఁ దెలియంగన్. ౩౭

వ. ఇది యజంతంబులు తెనిఁగించు తెఱం గింక హలంతవిధియుఁ దెలిఁగింతు. ౩౮

## హలంతప్రకరణము

క. భూభుగ్విరాడ్పదంబులు, శోభితముగఁ దెనుఁగుపఱుచుచోఁ దుదపొల్లుల్
ప్రాభవమతివర్ణములగు, భూభుజులు విరాజు లనఁగఁ బోలుపై యునికిన్. ౩౯

క. బలవన్మతిమత్పదముల, తలనున్న నకార మెడలఁ దగ దెనుఁగగుచోఁ
బలవంతుఁడు మతిమంతుఁడు, చళుక్యపతి యనఁగ సర్వశాస్త్రములందున్. ౪౦

గీ. ద్విట్పదంబు వేదవిత్పదంబును దిక్పదమునుబూర్వవర్ణతను భజించు
విద్విషుండు నాఁగ వేదవిదుండనఁ, దూర్పుదిశ యనంగ నేర్పరింప. ౪౧

క. చేరు నకారాంతముల ను,కారముఁ దెనిఁగించుచోటఁ గతినాత్ముఁ డనన్
దారుణకర్ముఁ డనంగను, మేరుమహాధన్వుఁడన నమృతధాముఁడనన్. ౪౨

గీ. వలసినపుడు శర్మవర్మశబ్దంబుల, పైదుకార మెక్కుఁ బాసిపోవు
రామశర్ముఁ డనఁగఁ గామవర్ముఁడనంగ, వసుధశర్మయనఁగ వర్మ యనఁగ. ౪౩

సంధిపరిచ్ఛేదము

వ. ఇవి సంస్కృతపదంబుల కాంధ్రీకరణం బింక నజంత హలంతసంధు లనంగ రెండు
తెలుఁగు లయ్యె నందు నజంతసంధి యెట్టి దనిన. ౪౪

గీ. ఆదిశబ్దాంకవర్ణంబు నంత్యశబ్ద, పూర్వవర్ణంబుతోఁ గూడఁ బొత్తుచేత
సంధియగుఁగారకక్రియాసంగతములు, పెక్కురూపంబు లవి గానిపింతుఁదెలియ. ౪౫

గీ. తెలుఁగుబలుకులు వెలిగాఁగ దివిజభాష, లమరఁదెనిఁగించినప్పుడు నచ్చుతోడి
వ్యక్తులైయుండునయకాని వానితోడి, వర్ణవత్త్వైకభావంబు వలనుగాదు. ౪౬

క. అచ్చుతుదియచ్చు పట్టున, వచ్చి యకారంబు నిలుచు వలసినయెడఁ దా
నచ్చయి యితోత్వంబులఁ, జొచ్చు ప్రచితార్థవాదసూచక మగుచున్. ౪౭

క. వేయిచ్చుట యీవులయెడఁ, జేయుండుపమి యరుల యెలమి సిదుమటయిలయుం
బాయక యేలుట యేచుట, యీయధిపతి కొనరు నాఁగ నివి లక్ష్యంబుల్. ౪౮

క. ధీయుతి వపుడప్పుడునీ,పీయని కేతెంచి లేయుం మేయు మనంగాఁ
బాయక యేయేయనఁగా, నీయుంభయముఁ జెల్లుఁగ్రియల నిడ నొక్కొకచోన్. ౪౯

గీ. ఒనర షంబుద్ధి నోతండ యనఁగ నోతఁ,డనఁగఁ బూనిన వీని కనర్హమగున
యర్థమిమ్మిమ్ము కొమ్మమ్మునెడుచోట, నూఁదఁ టెప్పుడుఁ దెనుఁగున నుచిత మరయ.

గీ. అట నుకారాంతషష్ఠిపై నచ్చు మొదల, నొనరఁ బొల్ల నకారంబ యుండవలయుఁ
బోతునూ రేతునాలు నాఁబోలుఁగాని, నగియుఁబోతూరు నేతాలునాఁగఁ జనదు.

గీ. అచ్చికారాంతషష్ఠిపై నడఁగుఁ బొడము, నింటి దింటిది యనఁజెల్లు సెల్లకడల
నర్థిదర్థిది యననొప్పు నంధ్రకవితఁ, గవులయనుమతి నిదియును గానవలయు. ౫౨

క. అచ్చులపై హల్లుండిన, నచ్చుండినఁ దద్ద్వితీయ కపుడు నకారం
బచ్చుడిగి హల్లులుండిన, మచ్చికఁ పైఁ బోవు వచ్చు మఱియొక్కొకచోఁ. ౫౩

క. భువి నైనికెగంటి ని కెగు,రువునకు సంధునకు బిరుదదూరున కారం
బివి అంతంబులపైనిం, దవిలిన బహువచనయుక్తిఁ దనరకయుండున్. ౫౪

క ..........................................................................
.........ంటికి సంధినకారం, బుంట యసన్మార్గమందురు ఘ్రంథములన్. ౫౫

క. నిడుపున జకారభావముఁ, వడసియు హ్రస్వమున నెల్లపట్టున నత్వం
బడరు నకారపుఁ బొల్లను, నిడఁ దగుఁ బూర్వప్రయోగ మెఱిఁగి కవీంద్రుల్. ౫౬

క. నేను బచరింతు నీవలెఁ, గానము విశ్వావనీశు కడ నును పేనిం
దానాను నభిమత మగు, నానగుఁ గా దేను నేను గా నేనోక్తిన్. ౫౭

గీ. అచ్చు పరమైనపట్టునఁ బ్రాణిపదము, కర్మమగుచోటఁ దక్క నుకారయుక్తి
వాడుకొనరు చకారభావమున దాని, ననుచరింపుదురు కవిత్రయానుమతిని. ౫౮

క. రిపు నోర్చె రిపుని నోర్చెను, రిపునాజి జయించె నుగ్ర రిపుని జయించెన్
నిపుణతఁ జళుక్యవిశ్వా,ధిపుఁ డనఁగాఁ దెనుఁగుసంధి తెలఁ గొప్పారున్. ౫౯

గీ. తద్ద్వితీయవిభక్తిపొంతలఁ జరించు, కద్దిగల సున్న సోఁకునఁ గచటతప...
గజడదబలగు నూఁదుటగలుగుఁ గవుల, యనుమతంబున నొక్కయవసరమున. ౬౦

గీ. జనులఁగరుణించుఁ జతురులఁజాలఁబ్రోచు, వాజిపదకాయసంబున వశము సేయు
భటులఁ దనియించుఁ బ్రజలకుఁ బాడినడపు, శస్త్రవినయుండు చాళుక్యచక్రవర్తి. ౬౧

క. అలఁతులఁ దుదహల్లులకును, నలపడ వామమున నుండి యహ్రోచ్చటులచేఁ
బలుమఱుఁ దేలుచు నూఁదుచు, విలసిల్లుట గలుగు లక్ష్యవిధి నెఱుఁగఁదగున్. ౬౨

క. తనుఁబొగడుఁ దన్నుఁబొగడును, జనుఁడు జనుండనఁగ దెనుఁగుబాడల గలుగున్
మనవాఁడు వీఁడు నాఁగాఁ, జను నిడుపులు వలవ దూఁద సరళతకొఱకున్. ౬౩

క. మొల్లమ్ముగ నెల్లెడలను, హల్లులపై నిడుపు లగుచు నాయీాయేయో
లుల్లసితాకృతి నిలుపం, జెల్లుం బ్రశ్నానునయవిశేషములందున్. ౬౪

క. రారా నాగారీ మున్నీ రే కర్ణాదిదాత లిట్టివదాన్యో
దారత విన మందఱు నట, పోరో విశ్వేశువేఁడ బుధులన నెపుడున్. ౬౫

క. రుచిరముగఁ బిలుచుచోటను, బ్రచురంబుగఁ బ్రథమపొంతఁబడియుండెడున
క్కచటతపంబుల పట్లను, బ్రచురించుం గసడదవలు పరిపాటిమెయిన్. ౬౬

గీ. విశ్వవిభుఁడు గడిది వీరుండు సతురుండు, డక్కుఁద్రిక్కులేని చొక్కలాఁడు
దత్త్వవిదుఁడు వరవిదారణశీలుండు, ననఁగఁ దెనుఁగు సంధి యలరునిట్లు. ౬౭

క. డులు రుసులను నీవర్ణత,తులు మొదలఁగఁ గొన్నిగొన్నితుదహల్లులతోఁ
గలయునెడఁ గూడు విడుచుం, దెలుఁగునకగుసంధి దీనిఁదెలియఁగవలయున్. ౬౮

గీ వేడ్క వేడుకవ్రేల్మిడివ్రేలఁ మిడియు, మార్మలసెమాఱుమలసెనుమాన్పుమాను
పుము విరోధము సంక్రాంతిఁ బోలుచునిట్టి, సంధిలక్షణ మెంతయుఁ జనునెఱుంగ.

క. ఇది సంధిక్రమమరయఁగఁ, దదుచితసంధానవిధులు తఱచెఱుఁగు డిలన్
విదితవిభక్తులగతిఁ జెప్పెదఁ దెలియన్వలయుఁ బూర్వబుధకృతసరణిన్. ౭౦

## విభక్తి ప్రకరణము.

వ. ప్రథమయు ద్వితీయయుఁ దృతీయయుఁ జతుర్థియుఁ బంచమియు షష్ఠియు సప్త
మియు సంబోధనంబును నన నెనిమిది తెఱంగుల విభజింపం గారణంబు గాన విభక్తు
లనం బరఁగుఁ దత్ప్రకారం బెట్టి దనిన. ౭౧

క. తెలుఁగుం బ్రాకృతభంగిన, బలియుటచే నేకవచన బహువచనపదం
బులకాని ద్వివచనంబులు, గలుగవు తత్క్రియలఁ గారకంబులయందున్. ౭౨

క. ముడులు తుదఁగలుగుశబ్దము, లడరుం బ్రథమావిభక్తు లవి కర్తలగుం
గడు నొసఁగు నిష్టములు ధరఁ, బొడమినకల్పకము విశ్వభూవిభుఁ డనఁగన్. ౭౩

క. నునివర్ణంబులు తుది నొంౘిన కర్మపుఁబదము దా ద్వితీయ యనంగాఁ
జనుఁ జాళుక్యధరిత్రీపుని విశ్వేశ్వరుని సిరులు వొందు ననంగన్. ౭౪

క. చేత ననుపలుకు తుదలఁ బ్రతీతం బగునేని యది తృతీయ యగుం బ్ర
ఖ్యాతంబుగ విశ్వేశ్వరు,చేతం బ్రభవిల్లు నెల్లసిద్ధు లనంగన్. ౭౫

క. పలుకులతుదఁ గైశబ్దం,బలపడ నిలిచినఁ జతుర్థియగు విశ్వమహీ
లలనునకై యలఘునకై, చెలువారం గృతులు కవులు చెప్పుదు రనఁగన్. ౭౬

క. పదముతుద వలన ననియెడు,పద ముండినఁ బంచమీవిభక్తియ పుష్ప
ప్రదరుఁ డగు విశ్వభూవర, మదనువలనఁ దొలఁగు సతులమానం బనఁగన్. ౭౭

క. అమరి కుశబ్దము పాదాం,తమునం దున్నేని షష్ఠితప్పదు విద్యా
సముదయము విశ్వవసుధా, రమణునకుం బోలుచు నిల నిరంతరము ననన్. ౭౮

క. పలుకుతుద నందు ననున,ప్పలు కుండిన సప్తమీవిభక్తియగు న్ని
శ్చలితచతుర్దశవిద్యా, విలసనములు పొలుచు విశ్వవిభునం దనినన్. ౭౯

గీ. ప్రథమగావించు ముదులను బాయఁబెట్టి, కట్టెదురఁబల్కు సంబుద్ధి కడుఁదనర్చు
విక్రమాటోప చాళుక్యవిశ్వభూప, పటుగుణావాల గండగోపాల యనిన. ౭౦

క. కోరి ముకారముమీఁద డు,కారముపట్టునను దగ లుకారము నిడఁ బెం
పారుఁ బహువచనంబులు, హారము లంగములు విబుధు లమరు లనంగన్. ౭౧

క. కడల ముకారడుకారము, లుడుపఁగఁబడు నచ్చతెనుఁగుటుక్తులయందుం
గడ గడలు గొడుగు గొడుగులు, బడుగు బడుగు లేకవచనబహువచనములన్. ౭౨

క. చింతింపఁగ నివ్విధిని హ,లంతంబులు చెప్ప నిలఁ గ్రియావంతులు శ్రీ
మంతులు ధీమంతులు గుణ,వంతులు భూభుజులు వైరివధవిదు లనఁగన్. ౭౩

క. ధర బాలుమీఁదిడుత్వము, పరువడి రుత్వంబునొందు బహువచనము బా
లురు భూపాలురు కరుణా,దరలోలు రనంగఁ దగునుదాహరణంబుల్. (?) ౭౪

గీ. వాఁడు వీఁడను నవి బహువచనములను, వారు వారలు వాండ్రును వీరు వీండ్రు
వీరలును నాఁగ నెందును విస్తరిల్లు, గాఁడునకు గారు గాండ్రును గలుగు నండ్రు. ౭౫

గీ. కొఱచు నెఱను మ్రాను కొల నను నివియెల్ల, బహువచోనియుక్తిఁ బరఁగుచోట
వెలయుఁ దత్పదములఁ గులు జనియించుఁ బై,వరుస నచ్చతెనుఁగువచనములకు. ౭౬

క. కొఱఁకులు నెఱఁకులు మ్రాఁకులు, జిఱుఁగొలఁకులు నయ్యెఁ జేను జేనును మీనుం
గొఱపేలుఁ జేలు మీలన, నురువగు నిల నచ్చతెనుఁగు లూహింపంగన్. ౭౭

క. పల్లు విల్లిల్లు నాఁ జనుపలుకులెల్ల, బండ్లు విండ్లిండ్లు నాఁజను బహుళత నొడుపఁ
బాడుఁ గుండేలు గో రనుపలుకులెల్లఁ, బాళ్లుఁ గుందేళ్లు గోళ్లు నాఁబడు ధరిత్రి. ౭౮

గీ. వరుస నేయి చేయి వా యనుపలుకుల, తుదలఁ బెక్కుఁజెప్పఁ దులు జనించు
బ్రీతి నేతు లనఁగఁ జేతులు వాతులు, నాఁగఁజెల్లు నెల్లనాట నండ్రు. ౭౯

గీ. వేయి ఱాయి దో యనియెడి వీనిబహుళత, నోలిఁ దుద లుత్వ మొనఁగూడు వేలుఱాలు
దోలు నా డుత్వమబ్బు నెద్దునకు వరికి, నెడ్లు వడ్లునునాఁ జను నెఱుఁగవలయు. ౮౦

క. కే లేకవచన మరయఁగఁ, బాలును దెమ్మెరలు సహజబహువచనంబుల్
మూలాఖ్యమున్నగాఁ జే,రోఁకులోపడు నిట్టు ధాన్యకులముల కెల్లన్. ౮౧

గీ. కొఱ్ఱ లాళ్లు వడ్లు గోదుమ లనుములు, కొల్లు లజొడు వీని కెల్లనిట్టు
ప్రకటితంబు లయ్యె బహువచనంబులు, నేకవచననియతి యెపుడు లేదు. ౮౨

గీ. ప్రాణిపదములు వెలిగాఁగఁ బ్రథమలైన, నరయ నొక్కొక్కచో ద్వితీయార్థము లగు
రా జలంకారములు పూనె రాచకొడుకు, వస్త్రములు దాల్చెనన నెందు వఱలెఁగాన.

క. ఒనరఁ దృతీయయుఁ బంచమియును సప్తమియును దలంప నుచితని జైకా
ర్థనియతిఁ జెల్లం దెలియఁగ, ననిరి విభక్త్యర్థవేదు లైనకవీంద్రుల్. ౯౪

గీ. విశ్వవిభుని చేత విలసిల్లు సిరి శరవాలభైరవాంకువలనఁ గలుగు
భూరిసిద్ధి రాజనారాయణునియందుఁ, బొడముఁ గవుల కతివిభూతి యనఁగ. ౯౫

క. పోశ చతుర్థీషష్ఠులు, నేకార్థమునందుఁ బలుక నిత్తుగు విశ్వ
క్ష్మాకాంతునకుం గృతు లరి, భీకరుణకు నిత్త్రు గవులు పృథునీతు లనన్. ౯౬

వ. మఱియు సంధ్రభాషావిభక్తులకుం గల నామాంతరంబు లెఱింగింతు, స్థావర తిర్య
ఙ్మనుష్య పదవర్తి యగు ప్రథమావిభక్తికిం గ్రమంబున ముకారంబును డుకారం
బును, ద్వితీయకు నుకారనికారంబులును, దృతీయకుఁ జేత తోడ యనునవియుఁ,
జతుర్థికిం గైకొఱకు ననునవియుఁ, బంచమికి వలన పట్టి యుండి కంటె యనునవియును
షష్ఠికిం గికుకారంబులును యొక్క లోపల యనుపదములును, సప్తమికి నందు న
యనుపదంబులు నర్యోఁ దత్ప్రకారంబునకు విభక్తినిరూపణంబు లలవరింతు. ౯౭

క. ద్రుమమేచె ద్రుమముఁ జూచెను, ద్రుమమ్ముచేనొప్పె నరుగు ద్రుమమునకై యా
ద్రుమమువలన ఫలమబ్బెను, ద్రుమమున కెనలేదు పువ్వు ద్రుమమం దొప్పున్. ౯౮

వ. ఇది యేకవచనవిధి. ౯౯

క. ద్రుమములు ద్రుమములఁ గదిసెను, ద్రుమములచే నీడగలిగె ద్రుమములకై గం
ధ మమరె ద్రుమములవలనన్, ద్రుమముల కలరారెఁ దాను ద్రుమములయందున్.

వ. ఇట్లు తిర్యక్పదంబులకు యోజించునది. ౧౦౧

క. తనయుండు తనయుని గనియెను, దనయునిచేఁ దనయుఁకొఱకుఁ దనయునివలనన్
దనయునకు ధనము దొరకెను, దనయునియం దెల్ల మంచితనములు గలుగున్. ౧౦౨

క. తనయులు తనయులఁ బడసిరి, తనయులచేఁ దనయులకయి దనయులవలనం
దనయులకు మేలుగలిగెను, దనయులయం దనఁగ నివి యుదాహరణంబుల్. ౧౦౩

క. కవి యొప్పుఁ గవి భజింతురు, కవిచేఁ గృతు లొదవు సిరియుఁ గపియుఁ గవులకై
కవివలనఁ గల్గుఁ గీర్తులు, కవితతికిం బేరువెలయుఁ గవివరునందున్. ౧౦౪

క. కవులు నుతింతురు కవులం, గవులచేతఁ (?) గవులకొఱకుఁ గవులవలనఁ ద
త్కవులకుఁ బ్రసిద్ధి యలవడుఁ, గవులందుంగాక కావ్యకల్పన గలదే. ౧౦౫

క. గురుఁ డధికుఁడు గురుఁ దలఁపుము, గురుచేతం దెలిసి భక్తి కొఱలు గురునకై
గురువలన మేలు చేకుఱు, గురునకు సరిలేమి విద్య గురునం దుండున్. ౧౦౬

క. గురువులు గురులను గొల్తురు, గురువులచే గురులకొఱకు గురువులవలనన్
గురులకు భక్తి దనర్చును, గురువులయందుండు సకలగుణములు నెపుడున్. ౧౦౭

వ. ఇత్తెఱంగున ననుక్తపదంబులయం దొడఁగూర్చునది. ౧౦౮

క. స్థావరతిర్యక్పదములు, వోవిడిచి తృతీయమొదలు పురుషాఖ్యలపైఁ
బైవర్ణములో నుత్వము,నావల నిత్వము విభక్తులైదును జెందున్. ౧౦౯

క. సుతుచేత సుతునిచేతను, సుతుకొఱకును సుతునికొఱకు సుతువలనం ద
త్సుతునివలన సుతుకొదవుచు, సుతునికొదవు సుతునియందు సుతునం దనఁగన్. ౧౧౦

గీ. పరఁగఁ గూఁతురుశబ్దంబుపై రుకార, మొక్కపలుకున వైనైన నుండుఁ బాయుఁ
బెక్కుపలుకులపైనైనఁ దక్కి పోవుఁ, గూఁతురుగఁ బొందెఁ గూఁతుఁగాఁ గోరెననఁగ.

క. కూఁతులచేఁ గూఁతురిచేఁ, గూఁతులకై కూఁతుకొఱకుఁ గూఁతులవలనం
గూఁతులకుఁ దగవు లొసఁగెను, గూఁతులయందుండుఁ బ్రీతి గుణవంతులకున్. ౧౧౨

క. ఓయాదిపదంబులతుదఁ, బాయని నిడు పుడిపి తగవిభక్తు లునుప ము
న్నేయనువునఁ బుంలింగని,కాయమునకుఁ జెప్పి రట్లు కవివరులోలిన్. ౧౧౩

గీ. కడ డుకారమున్న నొడువులెల్ల సంబుద్ధి, హ్రస్వమైన దీర్ఘమైన నగును
వీరవరుఁడ, సమరశూరుఁడా యనఁగ మా,నిని యనంగ మానినీ యనంగ. ౧౧౪

క. డులు బహువచనంబులయెడఁ, దొలఁగు న్సంబోధనమున దుర్జనులారా,
బలిభోజనవిధులారా, ఖలులారా మిమ్ము జముఁడు గావఁ డనంగన్. ౧౧౫

గీ. ఒనర యుష్మదస్మదుక్తుల కేకవ,చనబహువచనములు సంభవించు
మెఱయ నీవు నేను మీరు మేమనెడునా, దేశములు ధరిత్రిఁ దెలియవలయు. ౧౧౬

క. నియతుఁడవు నీవు నిన్నును, నియమింతురు శుభము లొలయు నీచే నీకై
జయమగు నీవలన దయో,దయమున సిరి నీకు శుభము దగు నీయందున్. ౧౧౭

క. మీ రనఘులు మిముఁ గొలఁతురు, సేమము మీచేత నుతులు చెలువగు మీకై
హేమమొదవు మీవలనను, శ్రీ మీకలరారి యుల్లసిలు మీయందున్. ౧౧౮

క. నేరమ్యుఁడ ననుఁ దలఁతురు, సారులు నాచేత నెగడె నాకై ప్రియమా
ధారుణి నావలనం బెం,పారెను నాకొనఁగుఁ బ్రియము లవి నాయందున్. ౧౧౯

క. మేమెఱుఁగము మము మఱచిరె, భామలు మాచేత బ్రదుకఁబడి మాకై ము
న్నేమీరు మావలన వల,దా మక్కువ సేయ మాకుఁ దగ మాయందున్. ౧౨౦

## సమాసప్రకరణము

క. మొదలిపదాంతవిభక్తిని, వదలుచుఁ దుదిపదము మొదలివర్ణముతోడం
గదిసిన నదికినశబ్దముఁ, జదువులను సమాస మనఁగఁ జనునండ్రు బుధుల్. ౧౨౧

వ. అది తత్పురుషంబును, గర్మధారయంబును, బహువ్రీహియు నన మూఁడు తెఱంగులం బ్రవర్తిల్లు, నంధ్రభాషాప్రయోగంబుల నందుఁ దత్పురుషంబుఁ గు నొక్కతెఱం గెఱింగింతు. ౧౨౨

క. రాచిలుకలు విరజాజులు, రాచకొడుకు లంపగములు రాయంచలు నా
రాచినయట్టిసమాసము, లేచుం దత్పురుష మన ననేకం బగుచున్. ౧౨౩

క. వెలిదమ్మి కమ్మఁ దూపులు, వలకే లెడకాలు నీలవర్ణము నవపా
టలరుచులచే సమాసము, లలవడియెం గర్మధారయములు దెనుఁగునన్. ౧౨౪

గీ. పూవుఁబోఁడి తలిరుఁబోడి పూవిల్తుండు, వాలుఁగంటి వాతవాఁడి మించు
మొలక మచ్చెకంటి ముక్కంటి యన బహు, వ్రీహి పెక్కువిధుల విస్తరిల్లు. ౧౨౫

వ. మఱియు వీనికి సాధారణలక్షణంబు లొకకొన్ని యెఱింగింతు. ౧౨౬

గీ. గుణిగుణంబుచెప్పఁ గొఱలు విశేషణ, పదముపై నికార మొదవుఁ బాయుం
నాతికెల్లనాఁడు నల్లనికనుఁగవ, నల్లకన్నుఁగవ యనంగ వతుస. ౧౨౭

క. విదితవిశేషపదాంతము, గదిసి పుకారంబు నిలుచుఁ గడ వాల్గన్నుం
బదపడి యచ్చుండినఁ బుట్టు,లొదవు ముకారంబుఁ ద్రోచి యొలింగృతులన్. ౧౨౮

క. గూఢపుమంత్రంబులు నతి,గాఢపుఁగర్మములు సోయగపుఁబాటలు నా
రూఢపుటాలాపంబులు, ప్రౌఢములగు నీసమాసఫణితులయందున్. ౧౨౯

క. ఇలఁ బల్లు ముల్లు విల్లును, వాలాదులను నదుకుచోట నడఁగును జడ్డల్
పలువరుసయు ములుమోదుగు, విలుకాఁడు ననంగ నెందు విశ్రుతమగుటన్. ౧౩౦

గీ. వెన్ను కన్ను చన్ను నియెడు వీనిజడ్డ, లుడుపుటొప్పు సమాసనియోజనములఁ
దనర వెనుగాఁడి కనుదోయిచనుమొలకలు, నాసమాసంబులొప్పు నానావిధముల.

క. ఆదట నా నీ తన యను, చోదుత్వము గలుగు షష్ఠి చూపెడునెడలన్
నాదు కళాసంపదయును, నీదువివేకంబుఁ దనదు నిపుణతయు ననన్. ౧౩౨

క. నా నీ తన యనుపలుకుల,తో నదుకు దుకార మపుడు దొలఁగినఁ దొలఁగుం
బూని సమాసము సంస్కృత,మైనను షష్ఠ్యర్థహేతువై సత్కృతులన్. ౧౩౩

మ. తనసత్యవ్రత కౌశలంబుఁ దన విద్యాతంత్రనిర్మాణముం
దనవిశ్రాణనకీర్తనంబుఁ దనసత్పుత్రసంతానముల్
తన తేజోమహిమోదయంబుఁ దనయుద్యత్కీర్తివిస్ఫూర్తియుం
దనరం బేర్చుఁ జళుక్యవిశ్వనృపమందారంబుసా చెల్లెడిన్. ౧౩౪

క. క్షీరార్ణవమూఁతురు సం,సారార్ణవమోడ శుభమెసఁగు మీకనఁగా
వైరిపదం బగుఁ దెనుఁగున, గూరని సంస్కృతముఁ దెనుఁగుఁగూర్చుట చేతన్. ౧౩౫

గీ. అరయ నానీలు హల్లుతో నడుచుచోట, నొనర నుగ్గును నిడుపయియున్ననుండు
గవులయనుమతి నిది కృతిఁ గానవలయుఁ, జాలవర్ణంబుగదిసిన జడ్డయగును. ౧౩౬

క. ఆకరి యక్కరి యనఁగా, నాకర మక్కరము నాఁగ నక్కికనకం
బాకీకనకం బన భా,షాకరము సమాసముల కుదాహరణంబుల్. ౧౩౭

గీ. సంస్కృతము లయ్యుఁ దెనుఁగులై చాఁగు గొన్ని
శబ్దములు వానిచందంబుఁ జను నెఱుఁగఁ
బనసపండును గుండలోపలననంగఁ
గందదుంపలు నాజీరకట్టియనఁగ. ౧౩౮

క. సుమతి నికారోకారాం,తము పై సంస్కృతపదంబు తగుఁ గూర్పఁగ వే
డిమరీచులు వాఁడిశరం, బమరు మనుష్యుండుఁ జేర్చు నశ్వంబనఁగన్. ౧౩౯

క. తగుఁగూర్ప నికారాంతం,బగు సంస్కృతపదముమీఁద నచ్చతెనుఁగున
న్నిగుడారు దంతికొమ్ములు, జగమెఱుఁగు నరాతిపోరు చందంబనఁగన్. ౧౪౦

గీ. అత్తమామ నాఁగ నాలుమగం డనఁ, గొడుకుఁగోడలనఁగఁ గొఱనుజేలు
నాఁగ రాత్రిపగలు నాఁగ నిట్టి సమాసములును గలుగుఁ గవులు దెలియవలయు.

## తద్ధితప్రకరణము

క. అరి యిఁడి కాఁడాఁడఱియన, ధరలో నొకకొన్ని చెల్లుఁ దద్ధితపదముల్
పరుపడి వాని నెఱుంగుట, పరమపరిజ్ఞాన మంధ్రభాషాకవితన్. ౧౪౧

సీ. సూఁదరి ముందరి తూఁడరి కల్లరి కాలరి ప్రేలరి కష్టుఁ డనఁగ
నుప్పిఁడి ప్రాయిఁడి చప్పిడి గ్రేసిడి తన్నిడి చిక్కిడి దాతయనఁగ
నీటుకాఁ డేడకాఁడు పోటుకాఁ డుదురులాఁ డించులాఁ డెప్పుడు నీతఁ డనఁగఁ
దక్కులాఁ డెక్కువ నిక్కులాఁ డదరులాఁ డెప్పుడు దురాత్ముఁ డీతఁడనఁగ.

దనరు దబ్బుఱ చిందఱందఱయనంగఁ, బరఁగు పలుకులు తద్ధితపదములయ్యెఁ
దెనుఁగునను వీనిచందంబుఁ దెలియఁకవుల,సాదృతులఁజేయు రాజనారాయణుండు.

## క్రియాప్రకరణము

గీ. అరయవాక్యకదంబోత్తమాంగమనఁ దగు, నమితదృష్టులుఁజగతిఁగ్రియాపదములు
వాని తెలుఁగులు కవులకు వలయుఁ దెలియఁ, గడఁగి కాలత్రయప్రసంగములవలన. ౧౪౪

క. ధరఁ బ్రథమమధ్యమోత్తమ, పురుషాఖ్యలఁ గ్రియలు మూఁడు పొలుచుం గాల
స్ఫురణలును వర్తమానాం, తరభూతభవిష్యదర్థతలఁ ద్రివిధంబుల్. ౧౪౫

గీ. ప్రథమపురుషాఖ్యయన్యార్థపటిమఁ జెప్పు, నగ్రసంస్థితుఁ జెప్పు మధ్యమపురుషము
దగిలి యుత్తమపురుషంబు తన్నుఁ జెప్పు, నేకబహువచనంబుల నెల్లకడల. ౧౪౬

గీ. అగుచునున్న కర్తయగు వర్తమానంబు, భూత మనఁగ నయినపూర్వకృతము
కడఁగి యంత మీఁదఁ గానున్నయది యభవిష్యదర్థమనఁగ విస్తరిల్లు. ౧౪౭

క. ఉచితవిధి విధియు నాశీ,ర్వచనమునను క్రియలు రెండుఁ బ్రథనొక్కటియై
ప్రచురించుం బురుషత్రయ,వచనంబుల వీని తెలుఁగు వలయుం దెలియన్. ౧౪౮

క. తెలుఁగు క్రియాపదములకును, దలఁకొను ధాతువులు జనపదవ్యవహారో
క్తులు కాన వానిఁ జేర్కొన,వలదు ప్రయోగములఁ దెలియ వలయుం దెలుపున్. ౧౪౯

వ. ప్రథమపురుషంబునకు వర్తమానార్థంబునందు నేకవచనబహువచనంబులందు నెడి నెదరులును మధ్యమపురుషంబున నెద వెదరులును, నుత్తమపురుషంబున నెద నెదములును గ్రమంబున నాదేశంబులయ్యెఁ దన్నిరూపణంబు లెఱింగింతు. ౧౫౦

క. అరిగెడి నరిగెద రనఁగాఁ, నరిగెద వరిగెద రనంగ నధిపతిపురికై
యరిగెద నరిగెద మనఁగా, బరువడి నిది వర్తమానఫణితార్థమగున్. ౧౫౧

వ. ప్రథమపురుషంబునకు భూతార్థంబునందు నేకవచనబహువచనంబుల నెన్నిరులును మధ్యమపురుషంబునకు తివి తిరులు, నుత్తమపురుషంబునకు తిని తిములును నాదేశంబు లగుఁ దన్నిరూపణంబు లెట్టనిన. ౧౫౨

క. చేసెం జేసి రనంగాఁ, జేసితి చేసితిరి మీరు సిరి మా కనఁగాఁ
జేసితిఁ జేసితి మనఁగా, భాసురభూతార్థకథనభజన మ్మయ్యెన్. ౧౫౩

వ. ప్రథమపురుషంబునకు భవిష్యదర్థంబునందు నేకవచనబహువచనంబులకు నుదురులును మధ్యమపురుషంబునకు వుదు వుదురులును, నుత్తమపురుషంబునకు దును దుములు నగును నాదేశంబులయ్యెఁ దన్నిదర్శనం బెట్టిదనిన:— ౧౫౪

క. చేయుం జేయుండు రసఁగాఁ, జేయుదు చేయుదురు మీరు చిత్తంబలరం
జేయుదుఁ జేయుదు మనఁగా, నాయతముగ నివి భవిష్యదర్థముఁ జెప్పున్. ౧౫౫

క. మొదలం జెప్పిన యది తుద, యది యాదేశంబు విధికి నవ్వచనములం
బొదలి ప్రథమమధ్యమలకుఁ, దుద నుత్తమపురుషమునకుఁ దొంటట్లయగున్. ౧౫౬

క. చేయునది బుధుఁడు ధర్మము, సేయునది బుధులు విశేషసిద్ధక్రియలం
జేయునది నీవు దర్పము, సేయునది తపంబు మీరు శివునకు ననినన్. ౧౫౭

గీ. ఉసురులకుమీఁద నొగిఁ గాఁతయున్న నా,శీర్వచనమునకును జెల్లునదియు
శివము చేయుఁగాఁత శివుఁడు శోభనము చే,యుదురుగాఁత మీకుఁ ద్రిదశులనఁగ. ౧౫౮

క. కారయిత సేయుకృతి నల,రారు ణిజంతంబు దాని కాదేశంబుల్
ధారిణి నింపును నించును, సారముగా నేకవచనసరణికి నయ్యెన్. ౧౫౯

క. తుదబహువచనమునకు నిం,పుదురును నింతురును నయ్యెఁ బుడమియెడల నిం
చుదురును గలుగుఁ బ్రయోగా,స్పదములు దేశీయసరణిఁ జనుఁ దెలియంగన్. ౧౬౦

సీ. శ్రీవిశ్వభూపతి చేయించుఁ గ్రతువులు సేవింపుదురు తదాశ్రితులు సురలఁ
బండంగ నింద్రుండు పరఁగించు వానలు పాలితులు పరగింతు రర్థచయము
నెసఁగించు ధర శ్రీల నేపారు తద్వృత్తి వరభటు లెలిఁగింపుదురు జయంబు
వెలయింపుకీర్తి యవ్విధి నెలయింపుదు రర్థులెల్లెడఁ బ్రతాపాతిశయము
ననెడు పల్కులచేత ణిజర్థములకు, నేకవచనబహువచనపాకమొలుఁగ
వలయు నవి పెక్కువిధముల వసుధఁ దెలియ, నిఖిలభాషావిదులైన నగడుకవులు. ౧౬౧

క. మహితస్థావరతిర్య,గ్జ్మహిళాదిక్రియలవర్తమానార్థమున
న్విహితమగు నెడుదుకాలము, సహజంబుగ నేకవచనసంజ్ఞలచోటన్. ౧౬౨

క. పండును భూజము తరువులు, పండెడు రాచిలుక యొప్పుఁ బలికెడుఁ జిలుకల్
గండాడెడు నతిపతిపైఁ, బండెడుఁ బెక్కింట సతులు పండెడు ననఁగన్. ౧౬౩

క. నిగుడదు భూజము సింగము, తెగడదు విటు వారవనిత పిలువ దనెడుచోఁ
దగుభూతార్థంబున నదు,లగు నాదేశంబు క్రియల నయ్యెడలన్. ౧౬౪

గీ. పిసర నింపు నించు ననియెడు వీనిపై, నుటతలొండనేని నొక్కచోటఁ
బరఁగుఁ గారకాఖ్యపదములై తెనుఁగున, వాని తెలియఁగలయు బుధులు. ౧౬౫

క. కోపింపుట కోపించుట, కాపించుట పసుల నొప్పఁ గాయించుట నా
సేపారు నిట్టిపలుకులు, లోపుగ బహుళములు జగతిలో నెఱుఁగఁదగున్. ౧౬౬

గీ. తెలుఁగుఁబలుకులు పునరుక్తిఁబలుకుచోట, గదిసి రెండవపదమున మొదలివ్రాత
దనరు గిత్వంబు ప్రాసంబు దప్పకుండ, వర్ణములు దీర్ఘహ్రస్వప్రవర్తులగుచు. ౧౬౭

క. పులిగిలి యనఁ గరిగిరి యన, నలిగిలియన నోడగీడ యనఁగాఁ బరఁగున్
నలుఁలు గిలు లనఁగ బలవం,తులు మఱి గిలవంతు లనఁగఁ దుద సరియగుచున్. ౧౬౮

క. స్మరధరచరవరపదములు, పరఁగుఁ గ్రియాపదమునొందుపట్టుల నెల్ల
న్వరుస రకారములోపలఁ, బొరినిశ్వసుడంగుఁ గాక పొదమినఁ బొడమున్. ౧౬౯

క. స్మరియించె సంస్మరించెను, ధరియించె ధరించెఁ బూవుదండఁ జరించెం
జరియించె వల్లభునిసతి, వరియించె వరించెనాఁగ వలనైయునికిన్. ౧౭౦

క. ఇది తెనుఁగున కెల్లను జన, పదవిదితం బైన తెఱఁగుప ట్టించుక యె
ల్లిదముగఁ జెప్పితి నంతయు, మది నెఱుఁగుం దరసి బుద్ధిమంతు లితరముల్. ౧౭౧

మ. లలితన్యోన్యవ్యుఃఖావలోకనము లీలం జేయఁగాలేని యా
విలసత్కావ్యకళాచతుష్టయము లుర్విం బర్వ నేకస్థలిం
గలిగించెం బదవాక్య వేదియు నలంకారజ్ఞుఁడున్ భూవరో
జ్జ్వలవిద్యావిభవోన్నతుండు నగువిశ్వక్ష్మావిభుం డిమ్ములన్. ౧౭౨

మ. కవివాత్సల్యకళాచరిష్ణుఁడు జగత్కల్యాణవర్ధిష్ణుఁ డు
త్సవసంప్రాప్త సుపర్వగర్వుఁడు జయశ్లాఘాప్తగంధర్వుఁ డా
ర్జవశీలాదివిశుద్ధవృత్తుఁడు విరాజద్విక్రమాయత్తుఁ డ
చ్ఛవిశాలామలకీర్తిపూరుఁడు సుతేజస్స్ఫురుఁ డెల్లప్పుడున్. ౧౭౩

క. శ్రీమచ్ఛళుక్యవిశ్వ, క్ష్మామండలవిభుఁడు సకలసంగ్రామజయ
శ్రీమంతుఁడు సంతతనత, సామంతుఁడు కామినీవసంతుఁడు లీలన్. ౧౭౪

తరల. బిరుదమిత్రుఁడు భిన్నశత్రుఁ డుపేంద్రపుత్రుఁడు యామినీ
శ్వరకులేశుఁడు మానవేశుఁడు వాహినీశుఁడు విక్రమ
స్ఫురణరాముఁడు నూత్నకాముఁడు పూర్ణసోముఁడు కీర్తులం
బరఁగుచుండెడు నాసుధాకరభానుతారకవిశ్రుతిన్. ౧౭౫

గద్యము

ఇది శ్రీమదుమారమణచరణారవిందవందన గోవిందామాత్యనందన
వివిధబుధవిధేయ విన్నకోట పెద్దయనామధేయవిరచితం బైన
కావ్యాలంకారచూడామణి యనునలంకారశాస్త్రంబు
నందు నంధ్రభాషావిశేష సంధిసమాస దేశీయ
ప్రయోగక్రియానిరూపణలక్షణ సముద్దేశం
బన్నది నవమోల్లాసము.



చంద్రికాప్రెస్సున ముద్రితము, చాకలపేట, చెన్నపురి:—1936.

# వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్సు

4. మల్లికేశ్వరస్వామిగుడిసందు, లింగిసెట్టివీధి, మదరాసు. 1.

ఆర్డరుతోకూడ అడ్వాన్సు పంపవలెను. తపాలుచార్జి ప్రత్యేకము.

మొత్తముగా కొనువారికి మంచి కమీషనుకలదు.

## సంస్కృతగ్రంథములు

| | రు. | అ. |
|---|---|---|
| మేఘసందేశము, మల్లినాథవ్యాఖ్య, తెనుఁగున సంపూర్ణ ప్రతిపద టీకాతాత్పర్య పదప్రయోజనచర్చ-ఆక్షేపసమాధానములు | 2 | 8 |
| రఘువంశము, మొదటి 6 సర్గలు పైదానివలెనే టీకాతాత్పర్యములు | 3 | 0 |
| కుమారసంభవము, మొదటి ఆఱుసర్గలు, పైదానివలెనే ... | 8 | 0 |
| అమరుకావ్యము, శృంగారలక్ష్యము. వేమభూపాలవ్యాఖ్య. సంపూర్ణాంధ్రటీక, క్రొత్తయచ్చు ... | 2 | 0 |
| రసమంజరి, శృంగార రసస్వరూపవిస్తరము. సటీక క్రొత్తయచ్చు | 2 | 0 |
| పంచతంత్రము, మూలముమాత్రము ... | 1 | 8 |
| దశకుమారచరిత్రము, మూలముమాత్రము ... | 1 | 0 |
| హితోపదేశము, ,, ... | 1 | 0 |
| ప్రియదర్శికానాటిక, శ్రీహర్షకృతి తెనుఁగు టీకాతాత్పర్యములు గద్యపద్యములుగా ఆంధ్రీకరణము ... | 1 | 0 |
| ఈ 9 గ్రంథములు ఒకసెట్టుగా కొనువారికి ... | 12 | 0 |

## ఆంధ్రగ్రంథములు

| | | |
|---|---|---|
| ఆముక్తమాల్యద, సంజీవనీ వ్యాఖ్యతో ... | 15 | 0 |
| విజయవిలాసము, చేమకూర వేంకటకవి. సటీక ... | 3 | 0 |
| జ్ఞానవాసిష్ఠ రామాయణము, వేదాంతము, మడికిసింగనకవి | 1 | 8 |
| ఆంధ్రబిల్హణీయము, మూలము ... | 0 | 3 |
| పారిజాతాపహరణము. ,, ... | 0 | 8 |
| సారంగధరద్విపద. కవి బాణాలశంభుదాసు, విశ్వకర్మమతస్థుఁడు | 0 | 3 |
| పద్యకథాలహరి, ప్రాచీన గ్రంథములనుండి సంగ్రహింపఁబడిన చిన్నపద్యకథలు. ... | 0 | 12 |

రు. అ.

## నాటకములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| ప్రతాపరుద్రీయ నాటకము | 2 | 8 | బొబ్బిలి యుద్ధనాటకము | 1 | 8 |
| ఉషానాటకము | 1 | 8 | ఆంధ్రాభిజ్ఞానశాకుంతలము | 1 | 8 |
| విక్రమోర్వశీయనాటకము | 2 | 0 | మాళవికాగ్నిమిత్రనాటకము | 0 | 12 |
| ప్రియదర్శికా నాటిక | 0 | 8 | శ్రీకృష్ణరాయవిజయనాటకము | 0 | 8 |

రత్నావళీనాటిక, శ్రీ ధరణికోట వేంకటసుబ్బయ్యగారి వ్యాఖ్యతో 1 8

ఉత్తరరామచరిత్రనాటకము, శాస్త్రిగారి పీఠికతో ... 2 0

ఈ 10 నాటకములు పూర్తిసెట్టుగా గ్రహించువారికి 10 0

## సులభవచనగ్రంథములు. (నాన్‌డీటెయిల్డు)

భోజకాళిదాసకథలు అప్రూవ్డు iii, iv ఫారములకు ... 0 12

విక్రమార్కునియద్భుతకథలు ,, iv, v ఫారములకు ... 0 12

ఉదయనచరిత్రము ,, డిటో ... 0 12

బేతాళపంచవింశతిక ... 0 12

అక్కన్న మాదన్నలచరిత్ర (తానీషా) (మెట్రిక్యులేషను) 2 0

ఆంధ్రహితోపదేశచంపువు ... 1 8

ఈయారుగ్రంథములు ఒకసెట్టుగా కొనువారికి ... 5 0

కథాసరిత్సాగరము 6 భాగములు ... 15 0

,, ఒక్కొక్కభాగము ప్రత్యేకముగా ... 2 8

## లక్షణగ్రంథములు

ఆంధ్రసాహిత్యదర్పణము, ఉదాహరణశ్లోకములతో ... 5 0

కావ్యాలంకారచూడామణి, 9 ఉల్లాసములు పూర్తి ... 1 8

అలంకార సారసంగ్రహము, టీకాతాత్పర్యము ... 0 12

ఛందస్సు, సులువు, సంగ్రహము ... 0 4

కుమారదేవ పండితీయము, ప్రౌఢవ్యాకరణవ్యాఖ్య ... 2 8

శాస్త్రిగారి విమర్శలు-ఉపన్యాసములు రు. అ.

| | | | |
|---|---|---|---|
| గ్రామ్యభాషాప్రయోగనిబంధనము, నాటకముల పాత్రోచితభాషను గురించినది | ... | 0 | 12 |
| ఆంధ్రవ్యాకరణ సర్వస్వతత్త్వము | ... | 1 | 0 |
| విమర్శవినోదము, సంస్కృతాంధ్రకావ్యములను గురించినది | | 0 | 12 |
| తిక్కనసోమయాజి విజయము, విమర్శ | ... | 0 | 8 |
| భారతీభారతి రూపకమర్యాదలు (ఇందు నాటకశాల-దానిచరిత్రము, లక్షణము మొదలైన విషయములు గలవు) | ... | 0 | 6 |
| ఆంధ్రగ్రంథవిమర్శన ప్రకారలేశము | ... | 0 | 6 |
| గ్రామ్యాదేశనిరసనము, గ్రామ్య గ్రాంథికవాదములను గురించినది. అన్ని జిల్లాల వ్యావహారికభాషలను వర్ణించియున్నారు. కడుపుబ్బ నవ్వించు విమర్శ | ... | 0 | 6 |
| విసంధివివేకము | ... | 0 | 2 |
| స్త్రీపునర్వివాహగ్రంథము | ... | 1 | 0 |
| ఆంధ్రభాషాసర్వస్వార్థనియామకతిపయములు (నిఘంటురచనావిధి) | | 0 | 4 |

నేలటూరి వెంకటరమణయ్యగారి గ్రంథములు

| | | | |
|---|---|---|---|
| చరిత్రరచన (మొదలైన చారిత్రకవ్యాసములు) ప్రథమభాగము. ఆంధ్రులు, పల్లవులు, చాళుక్యులు, చోళులు మొదలైనవారి చరిత్ర యిందు చక్కగా వివరింపబడియున్నది. యూనివర్సిటీ విద్యార్థులకు ఉపయోగకరము. | ... | 2 | 0 |
| మధుమావతి (మొదలైన కథలు) ఇందు మధుమావతి, ప్రతీకారము, కంపిలిరాయలు, ఛత్రగ్రాహి అను నాలుగుకథలు చారిత్రాత్మకములు గలవు. మధుమావతి ప్రతాపరుద్రుని పెద్దభార్యయైన మాచల్దేవి పాలికయై, ఓరుగంటి ముట్టడిలో నీమె తురకలకు పట్టుబడిచేసిన చమత్కారకథ ఇది. ప్రతీకారము, మధురను పాలించిన సుల్తాను హిందూస్త్రీని చెఱపట్టగా నామె కసిదీర్చుకొనిన కథ. కంపిలిరాయలు విజయనగరసామ్రాజ్యస్థాపనమునకు పూర్వము కంపిలిరాజ్యమును తురకలు కూల్చిన కథ. ఛత్రగ్రాహి, కృష్ణదేవరాయలగొడుగుపాపరి, పోలుడు, ఒకదినము రాయసింహాసనమెక్కిన విచిత్రకథ | | 2 | 0 |

| | | రు. | అ. |
|---|---|---|---|
| BY Dr. N. Venkataramanayya, M.A., Ph.D. | | | |
| *Kampili & Vijayanagara* | | 2 | 0 |
| *Eastern Chalukyas of Vengi* | | 15 | 0 |

శ్రీ ప్రొఫెసర్ T. M. శేషగిరిశాస్త్రిగారి గ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| ఆంధ్రశబ్దతత్త్వము TELUGU PHILOLOGY. ఇందు ఆంధ్రవ్యాకరణము సంపూర్ణముగా కలదు. అరవము, కన్నడము, మలయాళము మున్నగు భాషలతో తెనుఁగునకుగల సంబంధము చక్కఁగ వివరింపఁబడియున్నది. తెలుఁగు పైలాలజీవిద్యార్థులకు ఉపయోగకరము. 2 భాగములు | ... | 8 | 0 |
| అర్ధానుస్వార తత్త్వము, పైదాని కనుబంధము | ... | 0 | 8 |
| *Notes on Aryan & Dravidian Philology* by the late Professor T. M. Seshagiri Sastriar. Old Copy. Reduced Price | | 2 | 0 |

ప్రకీర్ణము.

| | | |
|---|---|---|
| భగవద్గీత, భగవాన్ శ్రీ రమణమహర్షుల 'గీతారత్నమాలిక'తోను శ్రీ గుఱ్ఱము వేంకటసుబ్బరామయ్యగారి వివరణోపోద్ఘాతములతో | 1 | 8 |
| విజయాశ్వచరిత్రము, శ్రీ పురాణము పిచ్చయ్యశాస్త్రిగారిది | 2 | 0 |
| వేదము వేంకటరాయశాస్త్రిగారి జీవితచరిత్రసంగ్రహము | 2 | 0 |
| *A Hand-book of Classical Samskrit Literature* for College Students, with questions and a Chronological Chart by U. Venkatakrishna Rao. M. A. | 2 | 0 |
| *Notes on the Study of the Preliminary Chapters of the Mahabharata* by Vedam Venkatachellam Aiyer B.A., B.L. | 5 | 0 |